చందమామ సీరియల్

# మాయా సరోవరం

సేకరణ

భాస్కరభొట్ల జనార్ధనశర్మ

సమర్పణ

బొల్లాప్రగడ సోమేశ్వరరావు





చాలా కాలం క్రిందట అమరావతీనగర రాజుగారి ఆస్థానంలో, కులశేఖరుడనే రాజోద్యోగి వుండేవాడు. ఆయనకు జయశీలుడనే ఒక్కగానొక్క కొడుకు. బాల్యంలోనే తల్లిని పోగొట్టుకున్న జయశీలుణ్ణి, కులశేఖరుడు ఎంతో గారాబంగా పెంచాడు. జయశీలుడు ఇరవై ఏళ్ళ వయసు వాడయ్యేసరికి, అన్ని విద్యలతో పాటు, క్షత్రియోచితమైన యుద్ధవిద్యలలో కూడా ప్రవీణుడనిపించుకున్నాడు.

కులశేఖరుడు తన కొడుకును, రాజుగారికి పరిచయం చేసి, ఆస్థానంలో ఏదైనా ఉద్యోగంలో ప్రవేశపెట్టుదామని ఆలోచిస్తూండగా, హఠాత్తుగా జబ్బు చేసి, కొద్ది రోజుల్లోనే మరణించాడు.

జయశీలుడిప్పుడు ఒంటరివాడు. అతడి మంచి చెడ్డలు చూస్తూ, అతణ్ణి సక్రమ మార్గంలో నడిపించేందుకు దగ్గిర బంధువులు కూడా ఎవరూ లేరు. ఈ పరిస్థితుల్లో జయశీలుడికి, దుర్వ్యసనాల్లో మునిగి తేలే కొందరు యువకులతో స్నేహం ఏర్పడింది. అతడు వాళ్ళతో కలిసి, తండ్రి వదిలిపోయిన ఆస్తిని విచ్చలవిడిగా ఖర్చు చేస్తూ, త్వరలోనే జూదగృహాలకు కూడా వెళ్ళటం ప్రారంభించాడు.

తండ్రి పోయిన నాలుగైదు నెలల్లోపునే జయశీలుడు తనకున్న ఆస్తి అంతా పోగొట్టుకున్నాడు. ఆ దుర్దశలో అతడు ఒకసారి మూడు రోజులపాటు తిండి







కూడా లేకుండా, మాసిన గుడ్డలతో వీధిలోకి వచ్చేందుకు సిగ్గుపడి, జూదగృహం లోనే వుండిపోయాడు. జూదరులలో కొందరు దయతలిచి పెట్టిన ఆహారాన్ని తినేందుకు ఆత్మాభిమానం అడ్డువచ్చి, జయశీలుడు పస్తులుండటం చూసి, దేవశర్మ అనే అతని మిత్రుడు, జయశీలుడికి దుఃఖం మాని, ముందుమార్గ మేమిటో ఆలోచించమని హితవుచెప్పాడు.

ఆసలే ఆకలితోనూ, దుఃఖంతోనూ కుమిలిపోతున్న జయశీలుడు, మిత్రుడి మాటలకు కోపం తెచ్చుకుని, "దేవశర్మా, నువ్వు చెప్పే హితవులూ, నీతివాక్యాలూ నాకు తెలియనివి అనుకుంటున్నావా? నువ్వూరుకో. నా దావేదో నన్ను చావనీ." అన్నాడు.

ఆ జవాబుకు దేవశర్మ చిరునవ్వు నవ్వి, "జయశీలా, అన్నీ తెలిసి, నువ్వెందుకీ జూదగృహంలో అడుగుపెట్టావో, నా కర్థంకావటంలేదు! మనం ఆడే పాచికలు దరిద్రదేవత నేత్రాలనీ, బ్రహ్మ జూదగాడి ముఖాన దుమ్మే, పట్టు పరువుగా; విధులే, అళ్ళుగా లిఖిస్తాడనీ నీకు తెలిసినట్టు లేదు. నువ్వు విద్యావంతుడివి. దుఃఖిస్తూ కూర్చోవటం ఎందుకు? బ్రతుకుతెరువుకు, ఏదైనా మార్గం ఆలోచించు," అన్నాడు.

జయశీలుడు కొంచెంసేపు మౌనంగా వూరుకుని, తరవాత ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా తల పంకిస్తూ, "దేవశర్మా, నువ్వు నిజమైన మిత్రుడివ్వదగిన సలహా యిచ్చావు. ఎంతో గొప్పగా బతికిన యీ నగరంలో, పేదగా జీవించటం నా కిష్టంలేదు. మరేదైనా దేశానికి వెళ్ళిపోతాను. ఏమంటావు?" అన్నాడు.

ఈ మాటలకు దేవశర్మ జవాబివ్వబోయేంతలో జూదగృహం ముందు కలకలం బయలుదేరింది. జయశీలుడూ, దేవశర్మా అటుకేసి పోలోమనసరికి, కృపాణజిత్తు అనే రాజుగారి అశ్వదళ నాయకుడు, చేతిలో పెద్ద కొరడా పట్టుకుని, వెంట

మరి నలుగురు భటులు రాగా, జూద గృహంలో వాళ్ళను కొరడాతో ఎడా పెడా కొడుతూ, వాళ్ళున్న చోటుకు వచ్చారు.

జయశీలుడు, కృపాణజిత్తు ముందుకు పోయి, "అయ్యా, ఏమిటీ దురన్యాయం? అలా విచక్షణా రహితంగా, కనపడ్డ వాళ్ళందరినీ కొట్టటం ధర్మం కాదు." అన్నారు.

"ఆహా, జూదరి నాకు ధర్మ బోధ చేయుటం! అద్భుతం!" అంటూ కృపాణజిత్తు కొరడాతో జయశీలుణ్ణి గట్టిగా కొట్టాడు.

జయశీలుడు దెబ్బ తగలగానే, చర్రు మంటూ ఎగిరి, దాపులనున్న కర్ర ఒకటి తిసుకుని, కృపాణజిత్తు తలమీద గట్టిగా మోదాడు. దెబ్బతింటూనే కృపాణజిత్తు కోపంతో ఒక్క అరుపు అరిచి కత్తి దూయబోయాడు. అతడు కత్తి దూసే లోపలే జయశీలుడు అతడి నడుంమీద గట్టిగా ఒక్క తన్ను తన్నాడు.

కృపాణజిత్తు ఒక చావుకేక పెట్టి కింద పడి లేచి, వీధి ద్వారం కేసి పరిగెత్త సాగాడు. ఇదిచూసి తతిమ్మా జూదగాళ్ళు, అతడి వెంటవున్న భటుల మీద కలియ బడ్డారు. పరిగెత్తిపోయి తన గుర్రాన్నెక్కి పారిపోజూస్తున్న కృపాణజిత్తును వెంట బడి తరిమి, జయశీలుడు అతడి వెనకగా గుర్రం మీద దూకి, ఒక చేత్తో దాని కళ్ళాలు పట్టుకుని, రెండవ చేత్తో కృపాణజిత్తు జుట్టు పట్టుకుని, మోచేతులతో అతణ్ణి కుమ్మసాగాడు.





గుర్రం రాజవీధి వెంట పరిగెత్త సాగింది. ఒక గుర్రం మీద ఇద్దరు రౌతుల యీ కుమ్ములాట చూసి, జనం వింత పడిపోయారు. వాళ్ళల్లో కొందరు చప్పట్లు చరుస్తూ, గుర్రం వెనక బయలుదేరారు. గుర్రం అలవాటు ప్రకారంపోయి రాజ భవనం ముందు ఆగింది.

ఆ సమయంలో రాజుగారు భవనం పై భాగాన నిలబడి, మంత్రితో ఏవో సంప్రతింపులు చేస్తున్నారు. వీధిలో కేకలు పెడుతున్న జనాన్నీ, ఇద్దరు రౌతులతో పరిగెత్తు కొస్తున్న గుర్రాన్నీ చూసి ఆయన ఆశ్చర్యపోతూ, నౌకరొకణ్ణి పిలిచి, "ఆ గోల ఏమిటి? గుర్రం మీద ఆ తాగుబోతు వెధవలిద్దరూ ఎవరు? నా దగ్గిరకు తీసుకురా," అని ఆజ్ఞాపించాడు.

కొద్ది సేపటికల్లా నౌకరు కృపాణ జిత్తునూ, జయశీలుణ్ణీ వెంటపెట్టుకుని రాజుగారి దగ్గిరకు వచ్చాడు. రాజు తన అశ్వదళ నాయకుణ్ణి గుర్తుపట్టాడు. ఆయన జయశీలుణ్ణి ఎరగరు. మంత్రి, జయశీలుణ్ణి అతడి తండ్రి వెంట ఒకటి రెండుసార్లు చూసి వున్నాడు. ఆ కారణం వల్ల ఆయన జయశీలుణ్ణి గుర్తించాడు.

రాజు కోపంగా, తన దళనాయకుణ్ణి, "జిత్తూ! నువ్వు, నా అశ్వదళనాయకుడివి. గౌరవనీయుడివి. రాజవీధిలో గుర్రం మీద, యీ దొమ్మరి విద్యా ప్రదర్శనం ఏమిటి?" అని అడిగాడు.

"మహారాజా, వీడు జూదరి! వెనక నుంచి నా గుర్రం మీద దూకి, నన్ను చావ చితకగొట్టాడు. వీణ్ణి తగినవిధంగా శిక్షించాలి," అన్నాడు కృపాణజిత్తు పళ్ళుకొరుకుతూ.

ఆ మాటలకు రాజు నవ్వి, "ఒరలో కత్తివున్న, నా అశ్వదళనాయకుణ్ణి, నిరాయుధుడైన ఒక సామాన్య జూదరి చావు దెబ్బలు కొట్టటం అంటే, చాలా వింత పడవలసిన సంగతే కాక, సిగ్గుపడ వలసిన సంఘటన కూడా! అసలు





నీకీ జూదరితో, తగవులాట ఎందుకు వచ్చింది?'' అని అడిగాడు.

"మహారాజా! రాజవీథిలో వున్న జూదగృహంలో, ఆటలాడే వాళ్ళంతా, అరుగుల మీదా, గడపల దగ్గిరా కూర్చుని, వీధివెంట ఎంత పెద్ద అధికారి వెళుతున్నా లేచి నిలబడనైనా నిలబడరు. మర్యాద నేర్పేందుకు నేను జూదగృహంలో ప్రవేశించాను. అక్కడ యీ దుష్టుడు నా మీద కలబడ్డాడు,'' అన్నాడు కృపాణజిత్తు.

రాజు, ఏంచేద్దామన్నట్టు మంత్రి కేసి చూశాడు. మంత్రి ఒకసారి చిన్నగా దగ్గి, "మహారాజా, కారణం ఏమైనా, మన దళనాయకుడి పరువు ప్రతిష్ఠలు నలుగురిలో నవ్వులపాలయినై,'' అన్నాడు.

"అవునవును. అలాంటివాడు, నా అశ్వదళ నాయకుడుగా వుంటే, నా పరువుతో పాటు, శత్రువుల దృష్టిలో తేలిక్కూడా అయిపోతాను,'' అని రాజు ఒక క్షణం ఆగి, కృపాణజిత్తుతో, "జిత్తూ, నీ పనికి తనం కారణంగా, నా సైన్యం అంతకూ తలవొంపులు తెచ్చావు. నీ కిదే, దేశబహిష్కరణ శిక్ష వేశాను. రెండు రోజుల అనంతరం, నా దేశసరిహద్దుల్లో ఎక్కడ కనిపించినా, నీ తల తీయించేస్తాను. కత్తి అక్కడ పెట్టి, తక్షణం వెళ్ళిపో,'' అన్నాడు.



కృపాణజిత్తు ఏదో చెప్పబోయాడు గాని, రాజు చేయెత్తి వారించాడు. ఇక రాజుకు మరింత కోపం తెప్పించితే, ఆ నిముషానే తల ఎగిరిపోతుందని అతడు భయపడి, కత్తిని నేలమీద పెట్టి, తల వంచుకుని వెళ్ళిపోయాడు.

రాజు, జయశీలుడికేసి కొరకొర చూస్తూ, "ఒరే, జూదరీ! నీకు శిరశ్ఛేద శిక్ష విధించాను. ఏమన్నా చెప్పుకోవా లంటే చెప్పరా,'' అన్నాడు.

తన దారిద్ర్యావస్థను తలుచుకుంటూ, నిరాశా నిస్పృహల్లో వున్న జయశీలుడు, రాజు మాటలకేమీ భయపడక, "మహారాజా, తమరు నాకు శిరశ్ఛేదం విధించాక,







వదరు." అని మంత్రి ఒక క్షణం ఆగి, "నా దొక చిన్న మనవి, మహారాజా," అన్నాడు.

"ఏమిటది?" అని అడిగాడు రాజు.

"జయశీలు డనే ఈ యువకుడు, ఒకప్పుడు మన ఆస్థానంలో పనిచేసిన కులశేఖరుడి ఒక్కగానొక్క కొడుకు. కులశేఖరుడు చనిపోయాడు. తమరు యితడి మీద కొంచెం కరుణ చూపాలి," అన్నాడు మంత్రి.

రాజు, జయశీలుణ్ణి ఆపాదమస్తకం ఒకసారి పరీక్షగా చూసి, జాలిపడు తున్నట్టు తలాడించి, "అయితే, యితడికి శిరశ్ఛేదం కాదు. దేశ బహిష్కరణ శిక్ష వేస్తున్నాను. ఏనాటికైనా దుర్వ్యసనాల నుంచి బయటపడి, సన్మార్గవర్తుడై తిరిగి వస్తే, ఇతడికి, నా ఆస్థానంలో తండ్రిచేసిన ఉద్యోగం తప్పక లభిస్తుంది." అన్నాడు.

జయశీలుడు, యికపొమ్మని సెలవా— అన్నట్టు తల వంచాడు. మంత్రి అతడితో, "ఇక వెళ్ళు. మహారాజుగారు చెప్పిన మాటలు గుర్తుంచుకో." అన్నాడు.

జయశీలుడు, రాజుకు నమస్కరించి, వెనుదిరిగి కొంచెం దూరం పోగానే, రాజు అతణ్ణి పిలిచి, "ఇదుగో, ఆ కృపాణజిత్తు వదిలిపోయిన కత్తి తీసుకో. ఒక్క వారం

ఇక నేను చెప్పుకునేందు కేమున్నది?" అన్నాడు.

"నీకు ప్రాణభయం లేదా?" అని అడిగాడు రాజు ఆశ్చర్యంగా.

"దారిద్ర్య భయం ముందు, ప్రాణ భయం ఏపాటి, మహారాజా?" అన్నాడు జయశీలుడు.

"అవునవును. జూదం, వ్యసనాల తల మానికం, అన్నారు గదా, పెద్దలు!" అన్నాడు రాజు.

"నిజం, మహారాజా! అంతా పోగొట్టు కుని, బంధువులచేతా, మిత్రులచేతా వదిలివేయబడిన జూదరులు, యోగుల మాదిరిగానే, యీ లోకంలో దేనికీ భయ





రోజుల లోపల, నా రాజ్య సరిహద్దులు దాటిపోవాలి, తెలిసిందా?" అన్నారు.

"చిత్తం, మహాప్రభూ!" అని జయశీలుడు కత్తి తీసుకుని బయలుదేరి వీధిలోకి వెళ్ళాడు. అతడికి దేశం వదిలి పోయేముందు, తన చిరకాల మిత్రుడైన దేవశర్మను ఒకసారి కలుసుకుని, వీడ్కోలు చెప్పి పోవాలని వుంది. ఆ కారణంవల్ల అతడు, జూదగృహంలో దేవశర్మను చూడవచ్చు ననుకుని అక్కడికి వెళ్ళాడు. జూదగృహం తలుపులు లోపల గడి పెట్టబడి వున్నాయి.



జయశీలుడు ఆశ్చర్యపోతూ, గట్టిగా తలుపులు తట్టి, "ఎవరు లోపల? తలుపులు తెరవండి!" అని కేక పెట్టాడు.

ఆ వెంటనే లోపలినుంచి ఒక కంఠస్వరం, "ఇది జూద గృహం కాదు; ఆ పిలిచే దెవరు?" అని ప్రశ్నించింది.

ఈ జవాబుకు జయశీలుడు మరింతగా ఆశ్చర్యపోతూ, "నేను జూదరిని కాదు, ముందు తలుపులు తెరు!" అన్నాడు తీవ్ర కంఠస్వరంతో.

ఆ వచ్చిన వాడెవడో రాజోద్యోగి అని జూదగృహ యజమాని నిలువెల్లా వణికి పోతూ తలుపులు తెరిచి, జయశీలుణ్ణి చూసి యీసడింపుగా, "నువ్వు ధనంతో పాటు దృష్టి శ్రవణ శక్తుల్ని కూడా పోగొట్టుకున్నావా? తలుపులు ఎందుకు మూశాననుకున్నావు?" అన్నాడు.

జయశీలుడు చప్పున ఒర నుంచి కత్తి దూసి, "జూదరుల రక్త మాంసాలు తిని బతికే నీవు, ఇంతలోనే పెద్దమనిషివయావంటే నమ్మశక్యం కాకుండా వున్నది. నేను ధనహీనుణ్ణయినా, బుద్ధిహీనుణ్ణి కాను. అట్టే ప్రగల్భాలు పలకక, నా మిత్రుడు దేవశర్మ లోపల వున్నాడో లేడో చెప్పు." అన్నాడు.

జూదగృహ యజమాని తళతళ మెరుస్తున్న జయశీలుడి చేతిలోని కత్తి కేసీ, కోపంతో ఎర్రబడిన అతడి ముఖం కేసీ ఓమారు చూసి, ఇతడు రెండు గంటల





కిందటి వ్యసనపరుడూ, నిర్భాగ్యుడూ అయిన జూదరి కాదని గ్రహించి, "అయ్యా, కోపగించకండి. చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకునేందుగ్గాను, నా జూదగృహాన్ని మూసేశాను. ఇక నాకు రాజభటుల బాధ గాని, యమకింకరుల భయం గాని లేదు," అన్నాడు.

ఈసారి జయశీలుడు కోపంగా కత్తిని జూదగృహ యజమాని గుండెలకు ఆనించి, "ఒరే, పాపీ! నువ్వు అప్రస్తుత ప్రసంగం చాలా చేశావు. నేనడిగింది, నా మిత్రుడు దేవశర్మ లోపల వున్నాడా లేదా? అని. అర్థమైందా?" అన్నాడు.

"అయ్యా, కత్తిని ఒరలో పెట్టండి. వీరులైనవారు, మరొక వీరుడితో తలపడితే లోకం మెచ్చుకుంటుంది గాని, నా బోటి వాణ్ణి తెగటార్చితే హర్షించదు!" అన్నాడు జూదగృహ యజమాని.

జయశీలుడు కత్తిని ఒరలో పెట్టి, జూదగృహ యజమాని కంఠం పట్టుకుని గట్టిగా కుదుపుతూ, "ఒరే, తిరిగి అధిక ప్రసంగం చేస్తున్నావు. నా మిత్రుడు దేవశర్మ ఇంట్లో వున్నాడా లేదా?" అని గద్దించి అడిగాడు.

"అయ్యా, చంపకండి. జూదగృహం మూతబడటం చూసి, మిగతా జూదరులతో పాటు, మీ మిత్రుడూ ఎటో వెళ్ళిపోయాడు," అన్నాడు జూదగృహయజమాని.

"అలా చెప్పావు, బావుంది!" అని జయశీలుడు, అక్కణ్ణించి బయలుదేరి వీధిలోకి వచ్చాడు.

అప్పుడతడికి దేశం వదిలిపోవటం తప్ప, మరో మార్గాంతరం లేదు. కాలం కలిసివస్తే, తనే నాటికైనా దేవశర్మను కలుసుకోవచ్చు! జయశీలుడు ఇలా ఆలోచిస్తూ, నగరం వదిలి, అరణ్య మార్గాలు పట్టి నడవసాగాడు. ఇలా అతడు ఒక వారం రోజులపాటు ప్రయాణం చేసి, అరణ్యంలో దొరికిన పళ్ళూ కాయలూ తింటూ, ఒకనాటి సూర్యాస్తమయ వేళకు, మరొక దేశపు రాజధానీనగర పరిసరాలను చేరాడు. —(ఇంకావుంది)







## 2

[జయశీలుడనే యువకుడు, దుర్వ్యసనాలకు లోనై, తండ్రి ఇచ్చిన ఆస్తి అంతా కొద్దికాలంలోనే పోగొట్టుకున్నాడు. ఆ స్థితిలో అతడికి జూదగృహం వద్ద ఒక రాజోద్యోగితో వైరం కలిగింది. రాజు, అతడికి దేశబహిష్కరణ శిక్ష విధించాడు. జయశీలుడు సొంత దేశం వదిలి, కొన్నాళ్ళకు మరొక దేశపు రాజధానీనగర ప్రాంతాలను చేరాడు. తరవాత—]

ఆ రాత్రికి జయశీలుడు అక్కడ ఉన్న పెద్ద ఊడలమర్రి కింద కాలం గడప దలిచాడు. చీకటిపడి నగరం ప్రవేశించటం క్షేమం కాదని అతడికి తోచింది. చింపి గుడ్డలతో, దుమ్ము కొట్టుకున్న దేహంతో ఉన్న అతన్ని రాజభటులు చూస్తే, ఏ దొంగో, తోడుదొంగో అని అనుమానించి ఖైదు చేయగలరు! అనవసరంగా చిక్కుల్లో ఎందుకుపడాలి?

ఇలా ఆలోచించి, జయశీలుడు మర్రిచెట్టు పాదంలో భూమి నుంచి పైకి వచ్చిన ఒక లావుపాటి వేరును తలగడగా పెట్టుకుని పడుకున్నాడు. కొంతసేపటికి అతడికి నిద్ర ముంచుకు వచ్చింది. సరిగా నడిరేయి వేళ, దాపుల నక్కల కూతలు విని, అతడు కళ్ళు తెరిచాడు. కొంచెం దూరంలో చెట్ల చాటు నుంచి చిన్న వెలుగూ, పొగా అతడికి కంటబడినై.







"ఓహో, నేనేదో శ్మశానప్రాంతంలోని ఊడలమర్రి కింద నిద్రిస్తున్నట్టున్నది! అలాంటి చోట్ల భూత ప్రేత పిశాచాలుంటవని అంటారే! ఏవీ, అలాంటి వేమీ ఇక్కడ వున్నట్టులేదు," అనుకుంటూ జయశీలుడు చీకటిగుయ్యారంగా వున్న మర్రి కొమ్మల్లోకి చూశాడు. అక్కడ అతడి కేమీ కనిపించలేదు. తనకు కలిగిన అనుమానానికి తనలో తాను చిన్నగా నవ్వుకుని, జయశీలుడు కత్తిపిడిని ఒకసారి తాకిచూసి, తిరిగి కళ్ళు మూసుకున్నాడు.

ఈసారి అతడికి కునుకుపట్టే సమయానికి, దూరం నుంచి, "రక్షించండి! మహాకాలుడు మింగ జూస్తున్నాడు!" అన్న ఆర్తనాదం వినిపించింది.

జయశీలుడు చప్పునలేచి, కత్తిదూసి ఆ ఆర్తనాదం వచ్చిన వైపుకు పరిగెత్తాడు. అదొక శ్మశానం! అక్కడ దూరదూరంగా రెండు మూడు శవాలు కాలుతున్నవి. ఆ మంటల వెలుగులో నల్లటి వస్త్రాలు ధరించి, జుట్టు విరబోసుకుని ఆర్తనాదాలు చేస్తూ పరిగెత్తుతున్న మనిషి ఒకడు, అతడికి కనిపించాడు. నిలువెల్లా తెల్లని వస్త్రం కప్పుకున్న ఆకారం ఒకటి, అతణ్ణి వెంటబడి తరుముతున్నది.

జయశీలుడు కత్తిపైకెత్తి ఆర్తనాదాలు చేస్తున్న వాడి వేపు పరిగెత్తుతూ, "భయపడకు, భయపడకు! నీ ప్రాణాలు బలిగొనసున్న ఆ దుర్మార్గుణ్ణి నా కత్తికి బలి చేస్తాను," అంటూ కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే నల్లని వస్త్రాలు ధరించినవాడు, జయశీలుడి కేసి పరిగెత్తుకు రాసాగాడు. తెల్లని ఆకారం అతణ్ణి తరుముకువస్తూ, "ఆగు, ఆగు! మహాకాలుడి బంటునైన, ఈ కాలకాలుడిని చూసే భయపడే నీవు; మహాకాలుణ్ణి ఆవాహన చేయచూస్తావా?" అని అరుస్తున్నది.

జయశీలుడు, ఆ కాలకాలుణ్ణని చెప్పుకునేవాణ్ణి అడ్డగించి, "ఓరీ, నువ్వెవరైనా

నాకు భయం లేదు. కాని, వెన్నిచ్చిపారిపోయేవాళ్ళను, వెంటబడి తరిమి చంపాలని చూడటంమాత్రం, సహించను.'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే కాలకాలుడు వికృతంగా నవ్వి, "సెహబాస్, యువకుడా! నీలో కొంచెం వీరయువకుడి లక్షణాలున్నై. ఏదీ; నా నిజరూపం చూడు!'' అంటూ కప్పుకున్న తెల్లవస్త్రాన్ని తీసి, దూరంగా పారవేశాడు.



ఇప్పుడు ఆ కాలకాలుడి రూపం అతి భయంకరంగా వున్నది. నల్లని శరీర ఛాయతో, నిప్పులు చెరుగుతున్న కళ్లతో, నోట మంటలు కక్కుతూ అతడు భయంకరంగా గర్జనచేశాడు.

జయశీలుడు ఒక్క తృటి కాలం నిశ్చేష్టుడయాడు. కాని, అంతలోనే తెప్పరిల్లి, కత్తిని కాలకాలుడి గుండెల కేసి గురిచేసి, "దుష్టుడా! నీ వికృతరూపానికి నేను భయపడతాననుకోకు. పారిపోయే వాణ్ణి చంపచూసే నీవు, ఏరకం వీర పందవైవుంటావు?'' అని అడిగాడు.

ఆ మాటలతో కాలకాలుడు ఒక్కడుగు వెనక్కువేసి, "యువకుడా, నీ ధైర్యానికి మెచ్చాను. అమానుషశక్తుల్ని, మహాసత్వులు మాత్రమే తమ ఆధీనంలో వుంచుకోగలరు. ఇప్పుడు నన్ను ఆవాహన చేసిన సిద్ధసాధకుడు అల్పసత్వుడు! అలాంటివాణ్ణి ప్రాణాలతో వదలరాదు. అడ్డం తొలుగు!'' అంటూ ముందుకు దూకబోయాడు.

జయశీలుడు కత్తిని, కాలకాలుడి వక్షానికి అడ్డంగా పెట్టి, ఆర్తనాదాలు చేసిన సిద్ధసాధకుడు, ఎక్కడ వున్నాడో అని, వెనక్కు తిరిగి చూశాడు. సాధకుడు భయవిహ్వలత్వం వల్ల, తను పారిపోయేందుకు సరయిన మార్గం ఏదో కూడా చూసుకోకుండా, శ్మశానంలోనే గిరికీలు కొడుతూ, యింకా ఆర్తనాదాలు చేస్తూనే వున్నాడు.

జయశీలుడు, తాను ముందు సిద్ధసాధకుడి దగ్గిరకుపోయి, అతడికి ధైర్యం







చెప్పటం బావుంటుందేమో అనుకునేంతలో', కాలకాలుడు హుష్, అంటూ హుంకరించి, కత్తిని చేత్తో పక్కకు నెట్టాడు.

జయశీలుడు చప్పున కాలకాలుడి కంఠాన్ని కేసి కత్తి విసిరాడు. ఆ దెబ్బకు వాడి తల మొండెం నుంచి వేరైపోయి, అంత దూరాన పడింది. మరుక్షణం కింద పడిన తల నేలమీద ఎగిరెగిరిపడుతూ, దగ్గరగా వచ్చి, "జయశీలా! నిస్సంశయంగా నువ్వు మహా వీరుడివి. నా కంఠ రక్తంలో తడిసిన నీ కత్తి అమోఘశక్తులు కలది! వెళ్ళు, నువ్వు కోరినవన్నీ సాధించుకో," అన్నది.

జయశీలుడు ఆ మాటలకు ఆశ్చర్యపాటు చెంది, ఒకటి రెండు క్షణాలు ఏమనేందుకూ తోచక ఆగి, చివరకు తెప్పరిల్లి, "కాలకాలా! నేనెట్టి అద్భుత కార్యాలు సాధించాలని, ఇల్లు వదిలిన వాణ్ణి కాను. జీవనోపాధికి, ఏ రాజు దగ్గిర నైనా చిన్న ఉద్యోగం దొరికితే చాలు. దానితో తృప్తిపడతాను," అన్నాడు.

కాలకాలుడి కంఠం జవాబివ్వలేదు. జయశీలుడు తెగిపడిన తలను సమీపించి, కత్తితో దాన్ని అటూ ఇటూ కదిపి చూశాడు; జీవం వున్నట్టు లేదు. ఈ చచ్చినవాడెవడోగాని మంచి బలాఢ్యుడు. చెవులకూ, ముక్కుకూ వెండి పోగులూ; వుస్తెమీసాలూ, కంఠానికి గట్టిగా బిగించివున్న పూసలపట్టా, జయశీలుడి కంటబడినై.

జయశీలుడు కత్తిని తిరిగి ఒరలో పెట్టి, రక్షించమంటూ పరిగెత్తిన నల్లటి దుస్తులవాడి కోసం చుట్టూ కలయ చూశాడు. ఈసారి వాడెక్కడా వున్న సూచనలే లేవు. వాడేమై వుంటాడు? భయంతో గుండెపగిలి, ఆ చుట్టు పక్కల వున్న చెట్ల కింద ఎక్కడైనా పడిపోలేదు కదా? ఇలా ఆలోచిస్తూ, జయశీలుడు తాను ముందు పడుకున్న ఊడలమర్రి కేసి నడిచాడు.



ఇప్పుడు మర్రిచెట్టు కొమ్మల్లో గుడ్లగూబల అరుపులతో పాటు, దూరంగా నక్కల కేకలు కూడా ప్రారంభమయినై. ఇక అక్కడ తాను నిద్రించటం సాధ్యపడదనుకున్నాడు, జయశీలుడు. పైగా దాహంతో అతడి నాలుక పిడచకట్టుకుపోతున్నది.

''రాత్రి మూడవజాము గడిచినట్టున్నది. ఈ చుట్టుపక్కల ఎక్కడైనా కొలను లాంటిది వుంటే దాహం తీర్చుకుని, స్నానం చేసి తూర్పు తెల్లనవుతూండగానే నగరంలోకి పోవాలి. దుస్తులు చీలికలూ పీలికలూ అయివున్నా, నడుం నుంచి వేళ్ళాడుతున్న యీ కత్తి ఒర మీదా, పడ మీదా వున్న నగిషీపనిచూసి, నేనేదో గొప్ప కులీనుణ్ణనే జనం అనుకుంటారు. ఈ చిరుగు దుస్తులకు కారణం; అరణ్యాలలో ఒక సింహాన్నెదుర్కొని హోరాహోరీగా పోరాడటం అని చెప్తాను!'' అనుకుంటూ జయశీలుడు మర్రిచెట్టు దగ్గిర నుంచి బయలుదేరాడు.

అలా అతడు కొంత దూరం నడిచేసరికి, ఒక చిన్న ఇల్లూ, ఆ ఇంటి కిటికీలోంచి వెలుగుతున్న దీపం అతడి కంట బడినై. ఆ ఇంటివారినడిగి ముందు దాహం తీర్చుకోవచ్చుననుకుంటూ, ''అయ్యా, నేను బాటసారిని. ఇంత మంచి నీరిచ్చి దాహం తీర్చగలరా?'' అని కేకపెట్టాడు జయశీలుడు.

ఆ వెంటనే ఇంటి తలుపు తెరుచుకున్నది. ఒక వృద్ధురాలు దీపం చేత బట్టుకుని, బయటి చీకటిలోకి చూస్తూ, ''చీకటి పడగానే, ఏ సత్రంలోనో పడుకుని నిద్రించక, ఇంత రాత్రివేళ ప్రయాణం చేస్తున్నావా? లోపలికిరా, మంచి నీరిస్తాను,'' అన్నది.

జయశీలుడు లోపలికి వెళ్ళాడు. వృద్ధురాలు అతణ్ణి దీపపు కాంతిలో పరీక్షగా చూసి, ఆశ్చర్యపోతూ. ''నువ్వేదో వయసుమళ్ళిన, తీర్థయాత్రలకుపోయే బాటసారివనుకున్నాను. ఇదేమిటి? ఇంత



పిన్నవయసులో కత్తి నడుముకు కట్టుకుని, అర్ధరాత్రి వేళ యీ అరణ్య ప్రాంతాల్లో తిరుగుతున్నావు?'' అన్నది.

జయశీలుడు జవాబు చెప్పబోయాడు. కాని, వృద్ధురాలు అతణ్ణి వారించి, ''ముందు దాహం తీర్చుకో. మంచి నీరు తెస్తాను. అదుగో, ఆ బల్ల మీద కూర్చో.'' అని పక్క గదిలోకి పోయి, ఒక పెద్ద గ్లాసునిండుగా నీరు తెచ్చి అతడికిచ్చింది.

జయశీలుడు నీరు తాగి, ''అమ్మా, నా ప్రాణాలు నిలిపావు. ఈ ఇంటిలో మరెవరూ వున్నట్టులేదే!'' అన్నాడు.

''ఎవరూ లేరు, నాయనా! నాకు సంతానం కలగలేదు. నా భర్త సంవత్సరం క్రిందట చనిపోయాడు. ఆయన రాజాశ్రితుడు. నిరాధారురాలనైన నాకు రాజుగారు, నా భర్త జీతంలో మూడోవంతు భరణంగా ఇస్తున్నారు. దాని ఆధారంతో ఒంటరిగానే, యీ ఇంట్లో కాలం వెళ్ళబుచ్చుతున్నాను,'' అన్నది వృద్ధురాలు.

''అమ్మా, నేను ఈ ప్రాంతాలకు కొత్తగా వచ్చినవాణ్ణి. ఈ దాపులనున్న నగరం పేరేమిటి? రాజుగారి పేరేమిటి?'' అని అడిగాడు జయశీలుడు.

ఆ ప్రశ్నకు వృద్ధురాలు చిన్నగా నిట్టూర్చి, ''నాయనా, ఇది హిరణ్యపురం. రాజుగారి పేరు కనకాక్షుడు. ఎంతో ప్రజాహితంగా రాజ్యపాలన చేసే ధర్మాత్ముడు. కాని, ఆ మధ్య నెల రోజుల క్రిందట పెళ్ళీడు వచ్చిన ఆయన కుమార్తెనూ, యౌవరాజ్య పట్టాభిషేకం చేసుకోనున్న ఆయన కొడుకునూ, ఎవరో అపహరించుకుపోయారు. ఆ నాటి నుంచి రాజుగారు దిగులుతో మంచం పట్టారు.'' అన్నది.

కూతురూ, కొడుకూ కనిపించకుండా పోయిన దిగులుతో మంచం ఎక్కిన రాజును ఉద్యోగం కోసం అర్థించటం ఎలా? అనుకున్నాడు జయశీలుడు. ఆ వెంటనే అతడికి తన భుక్తి గడిచే మార్గం కన్న, ముందు రాజుగారు పడ్డ చిక్కుల గురించి తెలుసుకోవాలనిపించింది.





"అమ్మా, రాజుగారి కొడుకూ, కుమార్తెల్నీ ఏ శత్రురాజో రహస్యంగా ఎత్తుకుపోయి వుంటాడు, అంతేనా?" అని అడిగాడు జయశీలుడు.

"అలా జరిగివుంటే చిక్కేమున్నది, నాయనా! ఆ శత్రురాజును చంపి కనక రాజుగారు, తన పుత్రీపుత్రుల్ని తిరిగి తెచ్చుకునేవాడు. ఆ ఎత్తుకుపోయిన వాడెవడో రాక్షసుడో, యక్షుడో అనుకుంటున్నారు," అన్నది వృద్ధురాలు.

ఆమె మాట ముగించే లోపలే ఇంటి ముందు కలకలం బయలుదేరింది. ఒకడు ఏడుపు గొంతుతో, "అయ్యా, శ్మశానంలో నా తండ్రి తల నరికినవాడు యిటే వచ్చాడు. ఈ బ్రాహ్మణవిధవ ఇంట్లో దీపం వెలుగుతున్నది. ఆమె ఏమైనా వాణ్ణి చూసిందేమో అడగండి!" అంటున్నాడు.

"ఒరే, కాటికాపరి వెధవా, నోరు మూసుకో! ఆ మహావీరుడు చంపింది భూతగణాల పెద్ద అయిన కాలుణ్ణి. సిద్ధసాధకుణ్ణయిన నాకు, యిలాంటివి క్షుణ్ణంగా తెలుసు!" అంటున్నాడు మరొకడు కోపంగా.

వాళ్ళిద్దర్నీ గదమాయిస్తూ మరొక గొంతు, "మీ రిద్దరూ కాస్త ఆగండి. చచ్చిన ముసలి కాటికాపరి మళ్ళీ ఎలా బతికాడు. అన్నదానితో పాటు సర్వం విచారించమని, నగరరక్షకుణ్ణయిన నన్ను, మంత్రిగారు పంపారు. నాకు అడ్డు రాకండి!" అన్నది.

ఈ సంభాషణ విన్న జయశీలుడు, వృద్ధురాలితో, "అమ్మా, నా కోసం నగర రక్షకుడూ, కొందరు భటులూ వచ్చినట్టున్నారు. నీ ఇంట నేను కనబడటం ఏమమ్మా? లేక పెరటి ద్వారం గుండా బయటికి వెళ్ళమన్నావా?" అన్నాడు.

వృద్ధురాలు జవాబు చెప్పే లోపలే, నగరరక్షకుడు వీధి ద్వారాన్ని సమీపించి, "లోపల వున్నవా రెవరో వెంటనే తలుపు తెరవండి!" అంటూ అధికార స్వరంతో కేక పెట్టాడు.

—(ఇంకా వుంది)





## 3

[జయశీలుడు ఒక రాత్రివేళ ఆర్తనాదాలు విని, నిద్రమేల్కొని, శ్మశానంలో ఒక వింత ఆకారం బారి నుండి, సిద్ధసాధకుణ్ణి రక్షించాడు. తరవాత అతడు దాపులనున్న ఒక ఇంటికి పోయి, ఆ ఇంటి యజమానురాలైన వృద్ధురాలితో మాట్లాడుతూ ఉండగా, హిరణ్యనగర రక్షకుడు, ఇద్దరు మనుషులతో వచ్చి, తలుపు తెరవమంటూ కేక పెట్టారు. తరవాత—]

నగర రక్షణాధికారి అంత రాత్రివేళ తన ఇంటికి వచ్చి, తలుపు తెరవమంటూ కేక పెట్టటం, వృద్ధురాలికి ఆశ్చర్యంతో పాటు, కాస్త భయం కూడా కలిగించింది.

వృద్ధురాలు తలుపు దగ్గిరకు పోయి, గడి తియబోయినదల్లా ఆగి, జయశీలుణ్ణి, "నాయనా, నీ వేదైనా పెద్ద నేరం చేసి, రాజభటులకు దొరక్కుండా పారిపోతున్న వాడివి కాదుగదా?" అని అడిగింది.

"అమ్మా! అలాంటి నేరం చెయ్యలేదు. బతుకుతెరువు కోసం దేశాలు పట్టి తిరుగుతున్నవాణ్ణి. అంతే! ఈ మాట ప్రమాణం చేసి మరీ చెబుతున్నాను." అన్నాడు జయశీలుడు.

"నీ రూపు రేఖలూ, మాట తీరూ చూస్తూంటే, ఎంతో మర్యాదా, మన్ననా నేర్చిన వాడివిలా కనబడుతున్నావు. నిర్దోషికి రాజభటుల భయమేమిటి!"







అంటూ వృద్ధురాలు గది తీసి. తలుపులు బార్లా తెరిచింది.

నగర రక్షకుడు ద్వారం గడప దాట కుండానే వృద్ధురాలిని. "అమ్మా, మీ భర్త గారు నాకు బాగా తెలుసు. ఇంత రాత్రి వేళ నిద్రాభంగం కలిగించినందుకు ఏమీ అనుకోకండి. కాటికాపరుల పెద్ద కొడుకూ. ఒక సిద్ధసాధకుడూ తగువు పెట్టుకున్న కారణంగా నేను రావలసి వచ్చింది. మీ ఇంటి కెవరైనా యువ కుడు—నడుముకు కత్తి వేళ్ళాడ కట్టు కున్నవాడు, వచ్చాడా?" అని అడిగాడు.

వృద్ధురాలు ఏమని జవాబివ్వాలా అని తికమక పడుతూన్నంతలో జయశీలుడు పక్కగదిలో నుంచి బయటికి వచ్చి, "అయ్యా, వెతకే ఆ యువకుణ్ణి. నేనే అయివుండను గదా?" అన్నాడు.

కాటికాపరి కొడుకు కీచుమంటూ అరిచి. "అయ్యా, యితడే చచ్చి బతికిన, నా తండ్రి తల నరికినవాడు," అన్నాడు.

సిద్ధసాధకుడు అతడి కేసి కోపంగా చూస్తూ. "ఒరే, వెధవా! ఎన్నిసార్లు చెప్పేది? చచ్చిన మనిషి తిరిగి బతకటం ఎక్కడైనా కద్దా? ఈ యువకుడు చంపింది, నీ తండ్రి నావేశించిన మహా భూతాన్ని. ఆ సంగతి ఆ భూతం నోటంటే నే విన్నాను. ఇక నోరు మూసుకో!" అన్నాడు.

"మీ యిద్దరూ తక్షణం నోళ్ళు మూసుకోకపోతే, యిప్పుడే మీ తలలు నరికి శ్మశానంలో పూడ్చి పెట్టిస్తాను," అని నగర రక్షకుడు సిద్ధసాధకుణ్ణీ, కాటికాపరికొడుకునూ గట్టిగా కసిరి. జయశీలుణ్ణి, "నీ పేరేమిటి? ఎక్కణ్ణుంచి వస్తున్నావు?" అని అడిగాడు.

"అయ్యా, నా పేరు జయశీలుడు. అమరావతి నగరం వాణ్ణి. మా రాజుగారి పేరు రుద్రసేనుడు; వినేవుంటారు! నేను కొన్ని కారణాలవల్ల, ఆ నగరం వదిలి ఉద్యోగాన్వేషణలో యిక్కడికొచ్చాను," అన్నాడు జయశీలుడు.

నగరాధికారి సిద్ధసాధకుణ్ణీ, కాటి కాపరికొడుకునూ అతడికి చూపుతూ, "నువ్వు వీళ్ళను ఎరుగుదువా? నువ్వు శ్మశానంలో తన తండ్రిని హత్యచేశావని, యీ కాటికాపరి కొడుకు అంటున్నాడు. అందుకు నీ జవాబేమిటి?" అన్నాడు.

జయశీలుడు ఆ ఇద్దరి కేసీ ఓ మారు చూసి, సిద్ధసాధకుణ్ణి గుర్తించి, "అయ్యా, నేని సాధకుణ్ణి శ్మశానంలో చూశాను. కాల కాలుణ్ణంటూ ఒక వికృతాకారుడు యితణ్ణి వెంటబడి తరుముతుండగా; నేను అడ్డపడ్డాను. ఆ వికృతాకారుడు నా మీద కలబడబోయేంతలో, ఆత్మరక్షణ కోసం అతడి తల నరకవలసి వచ్చింది." అన్నాడు.

"నువ్వు కాలకాలుడి తల కాదు నరికింది, నా తండ్రి తల! ఆయన ఉదయం పూట చనిపోయినట్టు అందరూ అనగా శ్మశానానికి తీసుకు వచ్చాను. కట్టెల కోసం నేను దూరంగా పోయిన సమయంలో ఏ దేవత దయవల్లనో ఆయన బతికాడు. నేను తిరిగివస్తూ, నువ్వాయన తల నరకటం చూశాను," అన్నాడు కాటికాపరి కొడుకు కోపంగా.

"ఒరే, ఆ శవం ఎవరిదో కూడా మాత కుండానే, నేను నా మంత్రశక్తితో, దానిలోకి కాలుణ్ణి ఆవాహన చేశాను. అప్పుడు



శవానికి ప్రాణం వచ్చింది. కాలుడి ధాటికి తట్టుకోలేక నేను పారిపోతూండగా, యీ వీరయువకుడు వచ్చి, కాలుడి తల నరికి నన్ను కాపాడాడు." అన్నాడు సిద్ధసాధకుడు మరింత కోపంగా.

నగరాధికారి చిన్నగా నవ్వి, జయశీలుడితో, "నీ పేరు జయశీలుడని గదా చెప్పావు? సరే, ఈ యిద్దరూ నాలుగైదు గంటల నుంచి యిలా అర్థం లేకుండా మాట్లాడుతూ, నువ్వు తల నరికిన వాడెవరో, అంతుపట్టకుండా నా మతి చెడగొడుతున్నారు. ఇందులో ఏదో ధర్మసూక్ష్మం వున్నట్టు, నా కనుమానం కలుగుతున్నది.... అంతా మంత్రిగారే



చూసుకుంటాడు. ఇక నా వెంటరండి," అంటూ దూరంగా ఒక చెట్టుకు కట్టి వేయబడిన తన గుర్రం కేసి నడిచాడు.

జయశీలుడు, వృద్ధురాలితో, "అమ్మా, సంగతి విన్నావు కదా? నేను నిర్దోషిని. మంత్రిగారో, రాజుగారో ఆ సంగతి తేలిగ్గానే గ్రహించగలరు," అన్నాడు.

"నీకు శుభం కలగాలి, నాయనా!" అంటూ వృద్ధురాలు చేయిఎత్తి జయశీలుణ్ణి దీవించింది.

ముందు గుర్రం మీద నగరాధికారీ, వెనగ్గా కాలినడకన జయశీలుడూ, సిద్ధసాధకుడూ, కాటికాపరి కొడుకూ నగరంలోకి ప్రవేశించారు. ఆ సరికి సూర్యోదయమయింది. వెంట రాజభటులు లేకుండా గుర్రం మీద పోతున్న అధికారినీ, వెనక వస్తున్న వాళ్ళలో జుట్టు విరబోసుకుని, వెలువెళ్ళా నల్లని దుస్తులు ధరించిన సాధకుణ్ణి చూసి, రాజవీధిలోని జనం వింత పడసాగాడు. సంగతేమిటో తెలుసుకునేందుకు తన దగ్గరకు వచ్చిన జనంతో కాటికాపరి కొడుకు, "ఈ కత్తి వేళ్ళాడ కట్టుకున్న కుర్రవాడు చచ్చి బతికిన నా తండ్రిని చంపాడు. ఆ నల్లని దుస్తుల ఘాతంగాడు ఆ హంతకుడికి వంతపలుకుతున్నాడు. రాజుగారు వాళ్ళిద్దరి తలలూ, నా చేత నరికించేయిస్తారు," అని చెప్పసాగాడు.

నగరాధికారి వెళ్ళేసరికి, మంత్రి అప్పుడే రాజభవనం ప్రవేశించబోతున్నాడు. ఆయన అధికారి వెంట వున్న వాళ్ళను చూసి, సంగతి గ్రహించాడు. అధికారి ఆయనతో జరిగిన సంగతంతా చెప్పాడు.

మంత్రి కొంచెం సేపు ఆలోచించి, "వైద్యుడూ, బంధువులూ అంతా చచ్చిపోయినట్టు చెప్పిన కాటికాపరి తిరిగి బతకటం అసంభవం. సిద్ధసాధకుడు చెపుతున్నట్టు వాడి శరీరంలో, ఏ మహాకాలుడో ప్రవేశించి వుండాలి! ఏమైనా వాడికి ప్రాణం వచ్చి, లేచి నడిచాడు







సిద్ధసాధకుడు ముందుకు వచ్చి, మంత్రికి నమస్కరించి, "అయ్యా, నాదొక చిన్నమనవి. చెప్పమని సెలవా?" అన్నాడు.

మంత్రి చెప్పమన్నట్టు తలాడించాడు. సాధకుడు ఒకసారి గొంతు సవరించుకుని, "ఈ జయశీలు అనే యువకుడు మహా సత్వుల కోవకు చెందినవాడు. తల తెగిన కాలుడు, యీ యువకుడి ఖడ్గానికి అమోఘశక్తులు ప్రసాదించి, దీవించాడు! ఆ మాట నేను విన్నాను. అతనివల్ల తనకూ, మహారాజుగారు లాభపడేందుకు చక్కని అవకాశాలున్నాయి," అన్నాడు.

మంత్రి విసుగుపడుతూ, "నువ్వనేదేమిటి? కొడుకూ, కుమార్తే కనబడకుండాపోయిన దిగులుతో వున్న రాజుగారు, యీ యువకుడి కత్తి సాయంతో రాజ్యాలు జయించటానికి బయలుదేరమనా?" అని అడిగాడు.

"అయ్యా, అదికాదు నా సలహా. రాజుగారు తమ కుమార్తెనూ, కొడుకునూ వెతికి తెచ్చేందుకు, యీ జయశీలుణ్ణి పంపవచ్చు. ఆ పనిలో విజయం యితడు తప్పక సాధిస్తాడు. ఇతడికి మహాకాలుడి రక్షా, దీవనా, తోడ్పాటులు లభించగలవనే దాంట్లో ఎలాంటి సందేహమూ లేదు." అన్నాడు సిద్ధసాధకుడు.

గదా? అలాంటివాణ్ణి, యీ యువకుడు తల నరికాడు! అంటే, హత్య చేసినట్టే గదా? కాని...." అంటూ ఆగి, ఏం అనేందుకూ తోచక తలవంకించసాగాడు.

అది అవకాశంగా తీసుకుని జయశీలుడు, "అయ్యా, తక్కిన సంగతుల మాటేమో కాని, నేను ఆత్మరక్షణకోసమే అలా తల నరకవలసి వచ్చింది. ఆత్మరక్షణా ప్రయత్నంలో ప్రత్యర్థిని చంపటం నేరం కాదుగదా!" అన్నాడు.

"అవును, ఆ మాటా నిజమే," అన్నాడు మంత్రి తలమీది నుంచి పెద్ద భారం దిగిపోయినవాడిలా పెద్దగా నిట్టూరుస్తూ.

ఈ మాటలు వినగానే మంత్రికి ఒక గడ్డుసమస్య చప్పున పరిష్కారమైపోయి నట్టు తోచింది. ఏళ్ళుగడిచి, కాలంమారి వచ్చిన కాలికావరి పరోవాళ్ళ గురించి ధర్మసందేహాలతో కాలం వృధాచేయటం ఎందుకనుకున్నాడాయన. సాధకుడు చెప్పినట్టు, యీ జయశీలుడు, రాజుగారి పిల్లలను వెతక పంపటం బాగానే వుంటుంది....

ఇలా ఆలోచించి మంత్రి, వాళ్ళను అక్కడే వుండమని చెప్పి, రాజుగారిని చూడబోయాడు. ఆ సమయంలో కనకాక్ష రాజుగారితో, సేనాని కొడుకు మంగళవర్మ మాట్లాడుతున్నాడు. మంత్రిని చూడగానే రాజు, "మహామంత్రీ! మంగళవర్మ, యువరాజునూ, యువరాణినీ వెతకబోతానని, అనుమతి అడుగుతున్నాడు. నీ సలహా ఏమిటి?" అని అడిగాడు.

మంత్రి ఒకక్షణం ఆలోచించి, "మహారాజా, ఈ పనికి మంచి సాహసంతోపాటు, ఏవో అలౌకిక శక్తుల సహాయం కూడా గల జయశీలు డనే యువకుడు దొరికాడు. అతడు ధరించిన కత్తికి అమోఘ శక్తు లున్నవట!" అన్నాడు.



కనకాక్ష రాజు ఆలోచనలోపడ్డాడు. మంగళవర్మకు మంత్రి పైన చాలా కోపం కలిగింది. అయినా అతడు దాన్ని బయటికి కనబరచకుండా, "అయ్యా, ఈ జయశీలు డనే అతడు గొప్ప కులీను డేనా? మహారాజుగారు, యువరాణినీ, యువరాజునూ వెతికి తెచ్చిన వారికి అర్ధ రాజ్యం యిస్తామని ప్రకటించారు. అందు కతడు అర్హుడేనా?" అని అడిగాడు.

ఈ అసందర్భపు ప్రశ్నకు మంత్రి చిరాకుపడుతూ, "యువరాణినీ, యువరాజునూ అపహరించుకు పోయినవాళ్ళు మానవులో, దానవులో, దేవతలో కూడా తెలియదు. అలాంటి దశలో వారిని వెతికి తెచ్చినవాడు, ఎంత శక్తిమంతుడై వుంటాడు! అలాంటివాడు అర్ధ రాజ్యానికి ఎందుకర్హుడు కాడు?" అన్నాడు.





"అతడి కత్తికి అమోఘశక్తులున్న మాట నమ్మదగినదేనా? ఒకసారి యివ్వమనండి. పరీక్షించి చూస్తాను." అన్నాడు మంగళవర్మ.

"ఇందుకు అతడేమీ అభ్యంతరం చెప్పడనుకుంటాను!" అన్నాడు మంత్రి.

కనకాక్షరాజు ఎంతో సూక్ష్మబుద్ధి, వివేకం కలవాడు. ఆయన తృటికాలంలో సంగతి సందర్భాలు అర్థంచేసుకుని, "మహామంత్రీ! ముక్కూ ముఖం తెలియని ఎవరో యువకుణ్ణి, పిల్లలను వెతికి తెచ్చేందుకు పంపటం ఎందుకు? ఆ జయశీలుడి దగ్గరవున్న కత్తి ఏపాటి శక్తిగలదో పరీక్షించేందుకు, మంగళవర్మకు యిప్పించండి. శక్తిగలదైతే, ఆ యువకుడికి గొప్ప బహుమానం యిచ్చి, మన ఆస్థానంలోనే ఉద్యోగం యిద్దాం." అన్నాడు.

"ఎలాంటి పరీక్ష పెడదాం, మహారాజా?" అని అడిగాడు మంత్రి.

"మన మృగశాల అధికారితో చెప్పి, బోనుల్లోవున్న రెండు పెద్దపులులను తెప్పించండి. మంగళవర్మ, ఆ అమోఘశక్తులు గల కత్తిని పట్టుకుని, బోనుల్లో నుంచి బయటికి వచ్చిన పులుల్ని ఎదుర్కొంటాడు." అన్నాడు కనకాక్షరాజు.

మంత్రి సంగతి చెప్పగానే, జయశీలుడు సంతోషంగా తన కత్తిని, మంగళవర్మకు యిచ్చాడు. కణాల మీద పులులున్న బోనులు తెప్పించబడి, చుట్టూ పది అడుగుల ఎత్తున్న ప్రాకారం లోపల పెట్టించబడినై. మంగళవర్మ కత్తి తీసుకుని లోపలికి పోగానే ప్రాకారం తలుపులు మూసి వేశారు. రాజూ, మంత్రీ, జయశీలుడూ మొదలైన వాళ్ళు, ప్రాకారం చాపులనున్న భవనం పిట్టగోడ పక్కన నిలబడి, లోపలికి చూడసాగారు.

మృగశాలాధికారి, మంగళవర్మను హెచ్చరించి, పైనుంచి బోనుల తలుపులు ఎత్తి, ప్రాకారం మీదికి వెళ్ళాడు. పులులు రెండూ భయంకరంగా అరిచి, మంగళవర్మ కేసి రాసాగినై.

—(ఇంకా వుంది.)





# 4

[నగర రక్షణాధికారి వెంట జయశీలుడూ, సిద్ధసాధకుడూ, కాటికాపరి కొడుకూ హిరణ్యపుర మంత్రి దగ్గరకు వెళ్ళారు. మంత్రి వాళ్ళ సంగతి రాజుతో చెప్పేందుకు వెళ్ళిన సమయంలో, మంగళవర్మ అనేవాడు అపూర్వశక్తులు గల కత్తిని తాను పరీక్షిస్తానన్నాడు. రాజాజ్ఞ కాగానే అతని మీదికి బోనుల్లో నుంచి పులులు వదలబడినై. తరవాత—]

సేనాని కొడుకు మంగళవర్మ ఖడ్గ, ధనుర్విద్యల్లాంటి వాటిని బాగా నేర్చిన వాడే. కాని, రెండు పులులు నోళ్ళుతెరిచి, కోరలుచాచి, గర్జిస్తూ తన కేసి రావటం చూస్తూనే, అతడికి ఎక్కడలేని భయం పట్టుకున్నది. అతడు వెనకకు రెండడుగులు వేసి, ఎగిరి ప్రాకారం ఎక్కి ప్రాణాలు కాపాడుకునేందుకు మార్గమేమైనా ఉన్నదా అని, తల ఎత్తి చూశాడు. వెంటనే పులుల్లో ఒకటి గట్టిగా ఘాండ్రించి, అతడి మీదికి దూకేందుకు ముందు కాళ్ళు రెండూ ఎత్తింది.

మంగళవర్మ భయకంపితుడయాడని, ఆ భయంవల్ల కనీసం ఆత్మరక్షణకైనా కత్తిని ఉపయోగించలేకపోవచ్చుని, అనుమానించిన జయశీలుడు, ప్రాకారంపై నుంచి, "మంగళవర్మా! నీ చేతిలోనిది అమోఘశక్తులుగల ఖడ్గం. భయపడకు!







"ఒక్కొక్క దెబ్బకు, ఒక్కో పులిని హత మార్చు." అని కేకపెట్టాడు

ఆ హెచ్చరికతో మంగళవర్మకు తిరిగి ధైర్యం కలిగింది. తన చేతిలో వున్నది, అపూర్వశక్తులుగల కత్తి!....ఆ మాట చెప్పినవాడు, యిప్పుడు తనను హెచ్చరించిన, జయశీలు డనేవాడు. ఒకవేళ నిజంగా కత్తిలో అలాంటి మహత్తర శక్తులు లేకపోతే....

మంగళవర్మకు యిలాంటి సంశయం కలగ్గానే, అతడి చేయి వణికింది. మరుక్షణం పులుల్లో ఒకటి అతడి మీదికిదూకి పంజాతో అతడి భుజం మీద ఒక దెబ్బ కొట్టింది. ఆ దెబ్బ తింటూనే మంగళవర్మ గట్టిగా అరిచి, తన కెలాగూ చావు తప్పదన్న తెగువతో కత్తి ఎత్తి పులిని గుండెల్లో పొడవబోయాడు. కాని గజగజ వణుకుతున్న అతడి చేతి నుంచి కత్తి జారి కింద పడింది.

ఇది చూసి కనకాకిరాజూ, మంత్రీ నిలువెల్లా కంపించిపోయారు. పులులు రెండూ నాలుగడుగులు వెనక్కువేసి, మంగళవర్మ మీదికి కుప్పించి దూకేందుకు తోకలల్లాడిస్తూ, పంజాలతో నేల దువ్వసాగినై. మంగళవర్మ ప్రాకారం గోడకు ఆనుకుని కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

"వీరయువకా, జయశీలా!" అంటూ అరిచాడు సిద్ధసాధకుడు.

సిద్ధసాధకుడి మాటలు ముగిసే లోపలే జయశీలుడు, పెద్దగా చప్పట్లు చరుస్తూ, పదడుగుల ఎత్తున్న ప్రాకారం మీది నుంచి, పిడుగుపాటులా పులుల ముందుకు దూకాడు. హఠాత్తుగా తమ ముందుకు వచ్చి పడిన ఆకారం ఏమిటో చప్పున గుర్తించలేక, పులులు రెండూ: ఇలాంటి సమయాల్లో ప్రాణికి కలిగే సహజమైన భీతి కొద్దీ, పక్కలకు పరిగిత్తాయి. అదే అదనుగా జయశీలుడు కిందపడి వున్న కత్తిని చేతికి తీసుకున్నాడు.





కనకాక్షరాజు అబ్బురపడిపోతూ, తన మంత్రి కేసి తల తిప్పి, "మహామంత్రీ! ఎంత సాహసం! ఏమి ధైర్యం! ఇలాంటి యువకుడి సాయం వుంటే, యువరాజూ, యువరాణీ తిరిగి మనకు లభించే అవకాశం వున్నది." అన్నాడు.

"మహారాజా, ముందు అతణ్ణి ప్రాణాలతో బయట పడనివ్వండి. పులులు రెండూ ఒకేసారి అతడి మీదికి లంఘించేలా వున్నవి!" అన్నాడు మంత్రి ధర్మమిత్రుడు.

పులులు రెండూ ఒకేసారి తన మీదికి దూకే ప్రయత్నంలో వున్నవని గ్రహించిన జయశీలుడు, నేలను కాళ్ళతో గట్టిగా ఒకసారి తాటించి, "ఏయ్‌!" అంటూ అరిచి, ప్రాకారం గోడ కేసి 'పారిపోతున్న వాడిలా, పక్కకు నాలుగడుగులు వేశాడు. దానితో పులుల్లో ఒకటి రెచ్చిపోయి, పెద్దగా గర్జిస్తూ అతడి కేసి పరిగెత్తింది. పులి యింకా రెండడుగుల దూరంలో వుండగానే, జయశీలుడు కత్తి చాచి, దాని తల మీద మెరుపు వేగంతో బలంగా కొట్టాడు.

పులి ఆ దెబ్బకు దిమ్మ తిరిగి, పక్కకు పడబోయినదల్లా, అంతలోనే తేరుకుని భయంకరంగా గర్జించి, జయశీలుడి మీదికి దూకేందుకు వెనక కాళ్ళ మీద లేచింది. జయశీలుడు యీ సారి ముందుకొక అడుగు వేసి, పులి గుండెల్లో కత్తిని బలంగా గుచ్చాడు.





పులి ఘాండ్రిస్తూ వెనక్కు పడిపోయి గిలగిలా తన్నుకోసాగింది. ఇదంతా క్షణాల మీద జరిగిపోయింది. కింద పడి పొర్లుతున్న తన తోటి పులిని చూస్తూనే రెండవ పులి తల వంచి, గిర్రున ఒక గిరికీ కొట్టి, కత్తి చాచి తన కేసి వస్తున్న జయశీలుణ్ణి చూసి, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, బాణంలా తెరిచి వున్న బోనులోకి పోయి పడింది.

ప్రాకారం పై నుంచి ఒక్క పెట్టున కనకాక్షరాజుతో పాటు అందరూ హర్ష ధ్వానాలు చేశారు. మంగళవర్మ అప్పటిగ్గాని మూసిన కళ్ళు తెరవలేదు. అతడు చచ్చి పడివున్న పులి కేసి, బోనులోకి పోయి కోపంగా గుర్రుపెడుతున్న పులి కేసి ఓ మారు చూసి, తల పైకెత్తి, కనకాక్షరాజుతో, "మహారాజా! ఈ కత్తికి అమోఘశక్తులున్న మాట నిజం! దురదృష్ట వశాత్తూ, అది నా చేతి నుంచి జారి కింద పడింది. అందువల్ల దాని శక్తిని నేను నిర్ణయించ లేకపోయాను: జయశీలుడు ఆ పని చేశాడు." అన్నాడు.

"లెస్స పలికావు, మంగళవర్మా! అదృష్టవంతుడివి. భుజంమీద తగిలింది చాలా స్వల్ప గాయంలా వుంది." అంటూ మంత్రి ధర్మమిత్రుడు హేళనగా నవ్వాడు.

"నేను ముందే చెప్పాను. ఆ కత్తిని కాలకాలుడు స్వయంగా దీవించి, జయశీలుడి కిచ్చాడు. దానితో అతడీ ప్రపంచాన్నే జయించగలడు." అన్నాడు సిద్ధసాధకుడు పరమానంద భరితుడైపోతూ.

"కాని, అంత శక్తులు గల కత్తీ, మంగళవర్మ చేతిలో వుండగా పులిని కూడా చంపలేకపోయింది!" అన్నాడు కనకాక్షరాజు చిరాకుపడుతున్నట్టు.

అంతలో మంత్రి ధర్మమిత్రుడు ప్రాకారంమీది నుంచి వంగి, చేయి చాచి, జయశీలుడితో, "జయశీలా! ఇక పైకి రా! నీ ధైర్య సాహసాలనే కాక, మా సేనాని కుమారుణ్ణి ప్రాణాపాయం నుంచి రక్షించినందుక్కూడా అభినంది





స్తున్నాను. సేనాని ప్రస్తుతం నగరంలో లేడు; సరిహద్దుల రక్షణ ఎలా వున్నదో పర్యవేక్షించేందుకు వెళ్ళాడు. ఆయన తిరిగి వచ్చి, తన కుమారుడు పులివాత పడ్డాడని వింటే, చాలా విచారపడేవాడు." అన్నాడు.

ఆ మాటలకు కనకాక్షరాజు చిన్నగా నవ్వుకుని, ప్రాకారంమీది నుంచి తనూ మంత్రితో పాటు దిగువకు చేయి జార్చి, "జయశీలా! మా యిద్దరి చేతుల ఆధారంతో పైకి రాగలవా?" అన్నాడు.

"అదేమంత కష్టం కాదు, మహారాజా! కాని, ముందుగా పులి వున్న బోనును మూయించటం క్షేమం. నేను పైకి వస్తే, మంగళవర్మ నిరాయుధుడుగా ఒక్కడే యిక్కడ వుండిపోవలసి వస్తుంది," అన్నాడు జయశీలుడు.

"ఆయన చేతుల్లో ఆయుధం వున్నా; నిరాయుధుడి కిందే లెక్క. ఆఖరికి ఇంద్రుడి వజ్రాయుధమైనా, దాన్ని పట్టినవాడు పారుబోతైతే, పూచికపుల్ల కిందే జమ!" అన్నాడు సిద్ధసాధకుడు.

కనకాక్షరాజూ, మంత్రి ధర్మమిత్రుడూ చాచిన చేతుల్ని పట్టుకుని జయశీలుడు ప్రాకారం మీదికి పోయాడు. మంత్రీ, రాజూ అతణ్ణి భుజం తట్టి ఎంతగానో అభినందించారు. సిద్ధసాధకుడు, అతణ్ణి



గట్టిగా కావిలించుకుని, "జయశీలా, నువు గుండెలు తీసిన బంటువు! నువు, నాకు మహాకాలుణ్ణి వశపరుచుకునేందుకు సాయపడటమే గాక, మహారాజుకు, వారి కుమారుణ్ణీ, కుమార్తెనూ తెచ్చేందుకు తోడ్పడగలవు కూడా." అన్నాడు.

"సాధకుడా, ఆ సంగతులన్నీ మహారాజుగారు భవనానికి వెళ్ళిం తరవాత మాట్లాడతారు. నువు కొంచెం ఆగు." అని మంత్రి ధర్మమిత్రుడు దూరంగా ఉన్న సేవకులను కేకవేసి పిలిచి, వాళ్ళకు మంగళవర్మను పైకి తెచ్చి, అతడి గాయానికి చికిత్స చేసే ఏర్పాటు చేయమని ఆజ్ఞాపించాడు.



రాజు వెంట అందరూ భవనం కేసి బయలుదేరగానే, మృగశాలాధికారి పులి వున్న బోనును మూసి, అవమానభారంతో కుంగిపోయి, దిక్కులు చూస్తున్న మంగళవర్మ దగ్గిరకు వచ్చి, అతడి భుజం మీది గాయాన్ని పరీక్షించి చూసి, "అయ్యో, ఇదేమంత ప్రమాదకరమైన గాయంకాదు. వారం రోజుల్లో మాని పోతుంది. కాని, ఆ జయశీలు డనే కుర్రాడు మృగశాలలో అన్నిటికన్నా ఉత్తమ జాతిదైన పులిని చంపాడు. దాన్ని అరణ్యంలో నేను పట్టుకోబోయినప్పుడు, నా సేవకుల్ని యిద్దర్ని చంపిగాని, నాకు స్వాధీనం కాలేదు." అన్నాడు చచ్చిన పులి దగ్గిర, మోకాళ్ళమీద వంగి కూర్చుని కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూ.

"చచ్చుపులి, చచ్చినందుకు అంతగా దుఃఖపడకు. ఆ జయశీలుడి కత్తిలో నిజంగానే అమోఘ శక్తులున్నవంటావా?" అని అడిగాడు మంగళవర్మ.

ఆ మాటలకు మృగశాలాధికారి కోపం తెచ్చుకుని, అయినా సేనానికొడుకు గనక దాన్ని బయటికి కనబరచకుండా, చిన్నగా పళ్ళుకొరికి, "అయ్యా, ఆ కత్తికున్న శక్తులమాట నాకు తెలియదు. కాని, ఒకటి మాత్రం నిజం: ఆ కత్తి మాంచి పదునైనది. వాడినవాడు చేవగలవాడు," అన్నాడు.

"అయితే, వాడికి అర్ధరాజ్యం, రాజ కుమార్తె కూడా లభ్యపడే అవకాశం వుంది. ఏం చేయాలి?" అంటూ మంగళ వర్మ గొణుక్కోసాగాడు.

మంత్రి పంపిన సేవకులు నలుగురు వచ్చి, మంగళవర్మను చేతులు పట్టుకుని, ప్రాకారం మీదికి తీసుకుపోయారు. అతడు రాజభవనం కేసి ఓమారు దిగులుగా చూసి, "ఒరే, పులిని చంపిన ఆ యువకుడికి రాజుగారేమైనా బహు మానం యిచ్చి పంపారా? లేక యువ రాజునూ, యువరాణినీ వెతికేందుకు వెళ్ళమన్నారా?" అని అడిగాడు.





"అయ్యా, ఆ సంగతు లేవీ మాకు తెలియవు. అందరూ భవనంలోకి పోతు న్నారు. కాటికాపరి కొడుకు మాత్రం, వాకిలి దగ్గిరే నిలబడి వున్నాడు." అన్నా డొక సేవకుడు.

అంతలో కాటికాపరి కొడుకు పెద్దగా గొంతెత్తి, "మహాప్రభో! చచ్చిబతికిన, నా తండ్రిని చంపినాయన్నుంచి, నాకే దైనా నష్టపరిహారం అయినా యిప్పిం చండి." అని కేకపెట్టాడు.

ఆ కేక విని మంత్రి ధర్మమిత్రుడు వెనక్కు తిరిగి చూసి, రాజుతో ఏదో మాట్లాడి, కాటికాపరి కొడుకుతో, "ఒరే, తండ్రి పోయినందుకు దిగులుపడకు. మహారాజుగారు నిన్ను, మొత్తం నగరం లోని వల్లకాడులూ, శ్మశానాల మీద పర్య వేక్షణాధికారిగా నియమించారు. జీతం యిప్పుడు నీకు ముట్టుతున్న దానికి నూరంతలు ఎక్కువ యిస్తారు. ఇక గొడవ చేయక పో." అన్నాడు.

"ప్రభో, చచ్చేవరకూ మీ మేలు మరవను. మా అయ్య చచ్చినందుకు ఒక దిగులు; బతికి మళ్ళీ వచ్చినందుకు మరొక దిగులు. ఆయనే బతికుంటే, యిప్పటి నా పదవిచూసి ఎంత సంతోషించే వాడు!" అన్నాడు కాటికాపరి కొడుకు, కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.



మంత్రి ధర్మమిత్రుడు చిన్నగా నవ్వుతుని, "ఇక వెళ్ళు," అని కాటికాపరి కొడుకుతో చెప్పి, రాజూ, జయశీలుడూ, సిద్ధసాధకులతో పాటు, భవనం లోపలికి వెళ్ళిపోయాడు.

కనకాకరరాజు ఒక ఉన్నతాసనం మీద కొంచెం సేపు ఆలోచిస్తూ కూర్చుని, తర వాత మంత్రితో; "మహామంత్రీ! యిప్పుడేం చేద్దామంటారు? యువరాజునూ, యువ రాణినీ వెతికి తెచ్చే ప్రయత్నంలో మన వాళ్ళందరూ విఫలులయారు. ఆ భారం ధైర్యవంతుడూ, శక్తిమంతుడూ అయిన, యీ జయశీలుడి పైన పెట్టటం ఎలా వుంటుంది?" అన్నాడు.





మంత్రి, జయశీలుడి కేసి ఓ మారు చూసి, ఏదో చెప్పబోయేంతలో సిద్ధసాధకుడు ఆవేశపడిపోతూ, "దివ్యంగా వుంటుంది, మహారాజా! తమ పిల్లల్ని వెతికి తెచ్చేందుకు ఒక్క ధైర్యమూ, శక్తిసామర్థ్యాలూ మాత్రమే చాలవు; వాటితోపాటు అలౌకికజ్ఞానం కూడా వుండాలి. అందువల్ల జయశీలుడితో వెళ్లేందుకు, నాకూ అనుమతియివ్వండి," అన్నాడు.

జయశీలుడు అయిష్టంగా తలాడించి, "మహారాజా, నాదొక మనవి!" అన్నాడు.

"ఏమిటో చెప్పు. నీ అభిప్రాయం ఎలా వున్నదో వినాలనుకుంటున్నాను," అన్నాడు కనకాకరాజు.

"మహారాజా, నేను ఉన్న దేశం వదిలి, బతుకుతెరువుకు తమ దగ్గిర ఏదైనా చిన్న ఉద్యోగం దొరుకుతుందేమో అని వెతుక్కుంటూ వచ్చిన వాణ్ణి. అలాంటిదేదైనా యిస్తే, కృతజ్ఞుణ్ణయి వుంటాను," అన్నాడు జయశీలుడు.

కనకాకరాజు, మంత్రి కేసి సాభిప్రాయంగా చూశాడు. మంత్రి, జయశీలుడితో, "మహారాజుగారు, నీకు ఉద్యోగం యిచ్చి, తమ భృత్యుల్లో ఒకడుగా చేర్చుకున్నారు. రాజాజ్ఞ పాలించటం భృత్యుడి ధర్మం గదా?" అన్నాడు.

"ధర్మం ఒక్కటేకాదు, విధి కూడా. ఆజ్ఞాపించండి!" అన్నాడు జయశీలుడు.

మంత్రి ధర్మమిత్రుడు తృప్తిగా తలాడించి, "జయశీలా, నిన్ను యువరాజు, యువరాణులను వెతికేందుకు పోవలసిందిగా మహారాజుగారు ఆజ్ఞాపిస్తున్నారు," అన్నాడు.

అంతలో రాజుగారి సేవకుడొకడు ఒక ముత్యాలహారాన్నీ, సగం విరిగిన కత్తినొకదాన్నీ అక్కడికి తీసుకువచ్చి, "మహారాజా, ఇవి యువరాజు, యువరాణీ కనిపించకుండాపోయిన చెట్టు దగ్గిర ఒక బోయవాడికి దొరికాయి. వాడు మతిపోయిన స్థితిలో పడి వున్నాడు," అని చెప్పాడు.

—(ఇంకావుంది)





# మాయాసరోవరం

## 5

[సేనాని కొడుకు మంగళవర్మను, జయశీలుడు పులులబారి నుంచి కాపాడాడు. కనకాక్ష రాజు అతన్ని చాలా మెచ్చుకుని, మంత్రి సలహాపై, అతడికి ఉద్యోగం యిచ్చాడు. మంత్రి, జయశీలుడికి రాజకార్యాలు గురించి చెపుతున్న సమయంలో ఒక సేవకుడు విరిగిన కత్తినీ, ముత్యాలహారాన్నీ తీసుకుని అక్కడికి వచ్చాడు. తరవాత ]

కనకాక్షరాజూ, మంత్రి ధర్మమిత్రుడూ, సేవకుడు తెచ్చి యిచ్చిన విరిగిన కత్తినీ, ముత్యాల హారాన్నీ చూసి చాలా ఆశ్చర్యం చెందారు.

మంత్రి ముత్యాలహారాన్ని పరీక్షించి చూసి, "మహారాజా, ఈ హారం యువరాణిదే అయి వుంటుందా? అలాగే, యీ విరిగిన కత్తి యువరాజుదై వుండదు కదా?" అన్నాడు.

రాజు హారాన్నీ, కత్తినీ అటూ యిటూ తిప్పి చూసి, "ఈ వస్తువులు యువరాజూ, యువరాణీ అరణ్యంలో కనబడకుండా పోయిన చెట్టు దగ్గిర దొరికినవని చెప్పకపోతే, అవి వాళ్ళవే అన్న అనుమానం కూడా నాక్కలిగేదికాదు," అన్నాడు.

"నిజమే, మహారాజా! వీటిని బాగా ఎరిగినవాళ్ళకు చూపి, అవునో కాదో తెలుసుకోవలసిందే. యువరాణిగారి







ప్రధాన చెలికత్తె మల్లికను పిలిపిస్తే, యీ కత్తిపూటకేంగాని, కనీసం ముత్యాల హారాన్నయినా గుర్తించగలదు," అన్నాడు మంత్రి ధర్మమిత్రుడు.

రాజు చెప్పగానే సేవకుల్లో ఒకడు పోయి మల్లికను అక్కడికి తీసుకు వచ్చాడు. మల్లిక తన యజమానురాలు కనబడకుండా పోయినందుకు, యిన్నాళ్ళుగా ఎంతో దుఃఖంలో వున్నది. రాజు ఆమెకు ముత్యాలహారం ఎక్కడ దొరికిందో చెప్పకుండా, హారాన్ని ఆమె చేతికిచ్చి, "ఈ ముత్యాలహారాన్ని అంతఃపురంలోని వాళ్ళెవరో పారేసుకున్నారు. తీసుకుపోయి వాళ్ళకు యిచ్చెయ్యి," అన్నాడు.

మల్లిక హారంలోని ప్రతి ముత్యాన్నీ వేళ్ళతో తడివిచూస్తూ, ఒక చోట చప్పున ఆగి, చిన్నగా కేకపెట్టి, "మహారాజా, యీ హారం యువరాణిది! మొం అరణ్యంలో విహారానికి వెళ్ళినప్పుడు, ఆమె దీన్ని ధరించి వున్నది." అన్నది.

ఆ హారం తన కుమార్తెదే అని మల్లిక ధృవపరచగానే, కనకాక్షరాజు మనస్సు చివుక్కుమన్నది. ఆయన మల్లికను ఏదో ప్రశ్నించబోయి కూడా, గొంతు పెగలక తలవంచుకు వూరుకున్నాడు.

రాజు స్థితి గమనించిన మంత్రి ధర్మమిత్రుడు, మల్లికను, "అమ్మాయీ, ఇలాంటి ముత్యాల హారాలను సంపన్నులైన గృహస్థుల పిల్లలెందరో ధరిస్తూ వుంటారు. మరి యీ హారం యువరాణిదే అని నమ్మకంగా ఎలా చెప్పగలవు?" అని అడిగాడు.

మల్లిక, మంత్రి దాపులకు వచ్చి, ఆయనకు హారంలో వున్న రెండు ముత్యాలను చూపుతూ, "ఈ చిట్లిన రెండు ముత్యాలనూ చూడండి! ఒకసారి యువరాణి, నా మీద ఎందుకో కోపం వచ్చి, ఆ కోపంలో హారం తీసి నా కేసి విసిరింది. అది గురితప్పి దాపులనే వున్న చెట్టు బోదెకు తగిలింది. అప్పుడు యీ రెండు ముత్యాలూ కొద్దిగా చిట్లినవి. ఆస్థాన





స్వర్ణకారుడితో చెప్పి, హారంలో కొత్త పుష్యాలు చేయించాలనుకున్నాము." అన్నది.

మల్లిక జవాబుతో రాజుకూ, మంత్రికీ కూడా ఆ హారం యువరాణి కాంచనమాలదే అన్న నమ్మకం కలిగింది. ఆ తరవాత విరిగిన కత్తి యువరాజు కాంచనవర్మదే అన్నదాంట్లో ఎవరికీ అనుమానం లేదు. కాని, కత్తి సగం విరిగిపోయి వుండటం మాత్రం రాజుకు, మంత్రికి ఆశ్చర్యకారణం అయింది..

కనకాకరరాజు కత్తిని జయశీలుడికి యిస్తూ, "జయశీలా! ఈ కత్తి విరగటానికి కారణం ఏమై వుంటుందంటావు?" అన్నాడు.

జయశీలుడు కత్తిని కొంచెం సేపు పరీక్షించి చూసి, "మహారాజా! యువరాజు తనను పట్టవచ్చిన ఎవరో శత్రువుతో పోరాడి వుంటాడు. కాని, కత్తి మాత్రం ఆ శత్రువు శరీరాన్ని తాకి విరిగిందికాదు. ఏ రాతికో, చెట్టుబోదెకో గట్టిగా తగిలి విరిగిపోయి వుంటుంది." అన్నాడు.

"అలా జరిగివుంటే విరిగిపోయిన ముక్క ఆ పరిసరాల్లోనే ఎక్కడో దొరికి వుండాలికదా? అంతకూ, యీ వస్తువులు కనుక్కున్న ఆ బోయవాడి మాటేమిటి?"



అంటూ మంత్రి ధర్మమిత్రుడు, హారాన్నీ, కత్తినీ అరణ్యం నుంచి తెచ్చిన సేవకుడి కేసి చూశాడు.

సేవకుడు ముందుకు వచ్చి మంత్రితో, "అయ్యా, ఆ బోయవాడు మనం అడిగిన దానికి బుద్ధిగా జవాబు చెప్పే స్థితిలో లేడు. వెర్రిచూపులు చూస్తూ, మధ్య మధ్య 'రెండు కాళ్ళ మొసలి!' అంటూ కేకలు పెడుతున్నాడు. వాడి కేదో భూతం పట్టిందని, వాడి బంధువులు వైద్యుడి చేత మంత్రాలు వేయిస్తున్నారు. నేను యీ కత్తీ, హారం యువరాజు, యువరాణులవేమో అని అనుమానించి, యిక్కడికి తీసుకువచ్చాను." అన్నాడు.







ఈ జవాబు వింటూనే సిద్ధసాధకుడు అదిరిపడి, "మహారాజా! మహాకాలుడి పరివారంలోని పిశాచాలు కొన్ని అప్పుడప్పుడూ రకరకాల వేషాలతో మనుషులకు కనిపించటం లోకప్రసిద్ధమే కదా! ఆ బోయవాడికి పట్టిన పిశాచాన్ని వదలకొట్టి, వాడిచేత యీ వస్తువులు ఎలా దొరికిందీ చెప్పించగలను. అక్కడికి వెళ్ళేందుకు నాకూ, జయశీలుడికీ అనుమతి యివ్వండి," అన్నాడు.

యువరాజూ, యువరాణుల అపహరణకూ, యీ బోయవాడి మతిచాంచల్యానికీ ఏమైనా సంబంధం వున్నదేమో అన్న ఆలోచన కలిగింది మంత్రి ధర్మమిత్రుడికి. కనకాకరరాజుకూ యిలాంటి అనుమానమే కలిగింది. వాళ్ళిద్దరూ ఏం చేయటమా అని తమలో తాము తర్కించుకుంటున్నంతలో జయశీలుడు, "మహారాజా! యువరాజూ, యువరాణీ కనపడకుండాపోయిన చెట్టు ప్రాంతాలే. ఒక బోయవాడికి యీ వస్తువులు దొరికినై. వాణ్ణి మరెవరో పట్టుకొట్టి, మతిపోయేలా చేశారు. మేం అక్కడికి పోయి సంగతి సందర్భాలు విచారించటమే ప్రయోజనకరంగా వుంటుంది," అన్నాడు.

ఇందుకు రాజూ, మంత్రీ సమ్మతించారు. వెంటనే జయశీలుడూ, సిద్ధసాధకుడూ రాజసేవకులు తెచ్చిన గుర్రాల మీద బయలుదేరారు. వాళ్ళకు దారి చూపేందుకు అరణ్యం నుంచి వచ్చిన సేవకుడు తోడై, ముందుండి దారి తీశాడు. అలా సుగ్గుతూ గుర్రాల మీద వేగంగా ఒకగంట తరవాత అరణ్యంలోని ఒక పెద్ద ఊడలమర్రి దగ్గిరకు చేరారు. ఆ దాపుల్లో పెద్ద పెద్ద వృక్షాలూ, పొదలూ, కొంచెం దూరంలో పెద్ద కొండా వున్నవి.

అప్పుడు ఊడలమర్రి కింద కనీ పన్నెండుమంది బోయవాళ్ళు పోగై వున్నారు. వాళ్ళ మధ్య మతిపోయిన బోయవాణ్ణి పెడరెక్కలు విరిచికట్టి, వాడికి సాంబ్రాణిపొగ వేస్తూ, దయ్యాల





పోతకడు; ఒక చేతిలో పాముల మెలికలు తిరిగివున్న కర్ర. రెండవ చేతిలో వేప మండలూ పట్టుకుని గంతులు వేస్తూ, "హుం, హర్ హర్, ఫట్ ఫట్!" అంటూ కేకలు పెడుతున్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ గుర్రాలను అంతదూరంలోనే దిగి, ఊడలమర్రి కిందికి పోయారు. సిద్ధసాధకుడు తలాడిస్తూ, ఏదో గొణుగుతున్న కోయవాడి కేసీ, కేకలు పెడుతూ గెంతుతున్న దయ్యాలపోతు కేసీ ఒకసారి చూసి, తన చేతిలోని పొన్నుకర్రను పైకెత్తి, "ఆగండి! ఆగండి!" అంటూ అరిచాడు.

దయ్యాలపోతు, సాధకుడి కేసి కోపంగా చూసి, పళ్ళు కొరుకుతూ అతడి మీదికి దూకబోయేసరికి, రాజసేవకుడు అతడికి అడ్డుపడి, "ఓయ్. దయ్యాలపోతూ! ఈ వచ్చిన దెవరనుకుంటున్నావు? రాజుగారి ఆస్థానమాంత్రికుడు," అన్నాడు.

సేవకుడి మాటలు వింటూనే దయ్యాప్పోతు ఉలికిపడి, గుడ్లు తేలవేసి, సిద్ధసాధకుడి కేసి భయంగా చూడసాగాడు. సాధకుడు ఒకడుగు ముందుకు వేసి, దయ్యాలపోతుతో, "ఒరే, నీచగ్రహా పాపకపు వెధవా! నే నెవరనుకుంటున్నావు? నా మంత్రశక్తితో నిన్ను గడ్డిపోచగా మార్చి, చిటికెన వేలికి చుట్టుకోగలను," అన్నాడు కళ్ళెర్రచేసి.

దయ్యాప్పోతు, "తప్పయింది. క్షమించండి!" అంటూ సిద్ధసాధకుడి కాళ్ళ





మీద పడిపోయాడు. సాధకుడు వాణ్ణి పాదంతో పక్కకునెట్టి, జుట్టుపీక్కుంటూ పిచ్చి చూపులతో చుట్టూ కలయచూస్తున్న బోయవాడి దగ్గిరకు పోయి, "ఒరే, బోయ భీమన్నా! నిన్ను బెదరకొట్టిన రెండుకాళ్ళ మొసలిని, యిదుగో, యీ వీరయువకుడు జయశీలుడు గుండెల్లో కత్తి గుచ్చి చంపాడు. ఇక నీకు భయం లేదు. లేచి నిలబడు!" అన్నాడు.

బోయవాడు ఆ మాటలు అర్థమై, అర్థంకాని స్థితిలో కనుబొమలు ముడిచి, సాధకుడి కేసి వింతగా చూడసాగాడు. అక్కడవున్న వాడి బంధువుల్లో ఒకడు బెదురుగా చూస్తూ సాధకుడితో, "అయ్యా, ఏది పేరు. భీమన్న కాదు; రామన్న!" అన్నాడు.

"ఈ క్షణం నుంచీ వీడు భీమన్నే! నా వాక్కుకు తిరుగులేదు. జయశీలా! ఏదీ రెండుకాళ్ళ మొసలి గుండెల్లో దించిన నీ కత్తి రక్తాన్ని, యీ బోయ భీమన్నకు చూపు." అంటూ జయశీలుడి కత్తిని, తానే ఒరలో నుంచి లాగుతూ, ఆ సమయంలో దాని మొనకు ముజాస పెట్టుకున్న కుంకం యింత తీసి చప్పున రాశాడు.

సిద్ధసాధకుడు చూపిన కత్తి కేసి బోయవాడు ఒక క్షణకాలం కన్నార్పకుండా చూసి, చప్పున లేచినిలబడి, "దొరా, ఆ రెండు కాళ్ళమొసలి పిశాచాన్ని చంపావా? దాని శవం ఎక్కడ?" అన్నాడు.

ఈ జరుగుతున్నదంతా జయశీలుడు కొంచెం దూరంలో నిలబడి శ్రద్ధగా చూస్తున్నాడు. సిద్ధసాధకుడు ఏదో అతి తెలివికిపోయి, లేని చిక్కులు తెస్తాడని అతడికి అనుమానంగా వున్నది. అతడి వన్నె మోసపు మాటలను బోయవాళ్ళు గ్రహిస్తే, అప్పుడు వాళ్ళు తిరగబడటం, తప్పనిసరై తాను కత్తి ఉపయోగించ వలసి రావటం జరగవచ్చు!







జయశీలుడు యిలా ఆలోచిస్తున్నంతలో, సిద్ధసాధకుడు ఏ మాత్రం తొణక్కుండా, బోయవాడితో, "ఒరే, లోకంలో మనిషి చచ్చి శవం అవుతాడుగాని, పిశాచం చచ్చి శవం కావటం జరుగుతుందా? ఆ ముసలి పిశాచాన్ని, నా మంత్రంతో కాల్చి బూడిదచేసి, విభూదిగా శరీరానికి రాసుకున్నాను. ఇక నీ కొచ్చినభయం లేదు. ఆ ముత్యాల హారం, విరిగిన కత్తి, ఎక్కడ దొరికినవో, ఆ ముసలిపిశాచం నీతో ఏమన్నదో చెప్పు," అన్నాడు.

బోయవాడి కింకా పూర్తిగా భయం వదల్లేదు. వాడు దాపులనేవున్న తన బంధువుల కేసీ, తలవంచుకుని నిలబడి వున్న దయ్యాలపోతు కేసీ ఓసారి చూసి, సాధకుడితో, "దొరా, హారాన్నీ, కత్తినీ ఆ రెండుకాళ్ళ ముసలి పిశాచే ఎత్తుకు పోయినట్టుంది." అన్నాడు.

అప్పుడు రాజుగారి సేవకుడు బోయవాడితో, "ఒరే, ఆ విలువైన వస్తువులు రెండూ నేను తీసుకుపోయి రాజుగారి కిచ్చాను. నేను వాటిని తీసుకున్న సమయంలో నువ్వు పిచ్చిగా కేకలు పెడుతూ, నేలమీదపడి దొర్లుతున్నావు. ఆ సంగతి నీకు తెలియదు; నీ బంధువుల్ని అడుగు," అన్నాడు.

బోయవాళ్ళల్లో ఒకడు, "రాజుగారి మనిషి చెప్పిందే సరిరా, రామన్నా!" అన్నాడు.

ఆ జవాబుతో బోయవాడు తృప్తిపడి, సిద్ధసాధకుడితో, "దొరా! ఈ ఊడల మర్రి పిశాచాల పుట్ట. రాజుగారి పిల్లలిద్దరూ యిటు వచ్చినప్పుడు, యిక్కడి పిశాచాలే వాళ్లను ఎత్తుకుపోయి వుంటవి," అన్నాడు.

ఆ జవాబుకు జయశీలుడు విసుగు పడుతూ తలాడించి, సాధకుడితో, "సాధకా, అనవసర కాలయాపన ఎందుకు? మనం యిక్కడి కొచ్చింది, యువరాజూ, యువరాణులను ఎత్తుకు





పోయిన వాళ్లెవరో తెలుసుకునేందుకు, ఏవైనా ఆధారాలు దొరుకుతవేమో అనే కదా? ఆ సంగతి త్వరగా తెలుసుకో," అన్నాడు.

"ఒరే, భీమన్నా! ఆ హారం, కత్తి నీ కెక్కడ దొరికినై? నువ్వనే ఆ మొసలి పిశాచి అరణ్యంలో నీ కెక్కడ తటస్థ పడింది? ఆ వివరా లవే చెప్పు," అన్నాడు సిద్ధసాధకుడు.

బోయవాడు ఒకసారి గొంతు సవరించుకుని, "దొరా, యీ రోజు చీకటివేళ నేను విల్లంబులు తీసుకుని వేటకు బయలుదేరాను. ఆ కనబడే మద్దిచెట్టు కొమ్మల్లోంచి అడవి కోడిపుంజు కూత వెయ్యటం వినిపించింది. నేను నక్కుతూ వచ్చి దాన్ని బాణంతో కొట్టాను. కాని బాణం దానికి అయువుపట్టున తగల్లేదు; రెక్కల్లో గుచ్చుకున్నది. పుంజు పెద్దగా అరుస్తూ పైకి లేచి, బాణం అడ్డుపడగా, ఎగరలేక ఆ కనబడే పొదలో పడి పోయింది," అన్నాడు.

జయశీలుడు, బోయవాడి మాటలకు అడ్డొచ్చి, "ఏది. నువ్వనే ఆ పొద ఏదో చూపించు! త్వరగా పద. యిక్కడ చాలా ముళ్ళ పొదలున్నవి గదా." అన్నాడు.

బోయవాడు, జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ గుబురుగా వున్న ఒక రేగుపొద దగ్గరకు తీసుకుపోయాడు. జయశీలుడు, బోయవాణ్ణి, "ఈ పొదలోనేనా, నీకు ముత్యాలహారం, విరిగిన కత్తి దొరికింది?" అని అడిగాడు.

"అవును, దొరా!" అన్నాడు బోయవాడు భయపడిపోతూ.

బోయవాడు మాట పూర్తిచేసే లోపలే సిద్ధసాధకుడు వంగి పొదలోకి చూస్తున్న వాడల్లా ఎగిరి గంతేసి, "జయశీలా! మహారణ్యం మధ్యలోని, ముళ్ళ రేగు పొదలో, పురాతన తాళపత్ర గ్రంథం! జై, మహాకాళా!" అంటూ పొదలో నుంచి, ఒక చిన్న తాళపత్రాల కట్టను బయటికి లాగాడు. —(ఇంకావుంది)







మాత్రమే చదవగలం! లేక నవనగర రాజుగారి కొలువులో ఉండే పండితులెవరికైనా తెలుసునేమో చూడాలి." అన్నాడు.

జయశీలుడు సాధకుడి నుంచి గ్రంథాన్ని తీసుకుని అటూయిటూ తిప్పి చూసి, "నిన్న యీ బోయవాడు చెప్పిన ఆ రెండు కాళ్ళ మొసలే యిక్కడ ఖార విడిచి వుండాలి! కాని యువరాజా, యువరాణుల జాడ తెలుసుకునేందుకు యిది ఏ మాత్రం సహాయపడదు." అంటూ తాళపత్ర గ్రంథాన్ని దాపులనున్న పొదల్లోకి విసిరివేశాడు.

సిద్ధసాధకుడు అది చూసి, పెద్దగా కేక పెట్టి, "జయశీలా, అదేం పని? ఆ గ్రంథంలో ఉన్నవి. ఏవో మంత్రాలు అయి వుంటవి. వాటిద్వారా మహాకాళుణ్ణి వశం చేసుకోవచ్చునేమో. ఏమర్థం చేశావు!" అంటూ పరిగెత్తిపోయి, పొదలలో నుంచి తాళపత్ర గ్రంథాన్ని వెదికి తీసి, జయశీలుడి వద్దకు తిరిగి వచ్చాడు.

జయశీలుడు కోపంగా సిద్ధసాధకుణ్ణి, "మనం యిక్కడికొచ్చింది మహాకాళుణ్ణి ప్రత్యక్షం చేసుకునేందుకా, లేక నవనగర రాజుగారి పిల్లల జాడ తెలుసుకునేందుకా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నతో సాధకుడు వెలవెలబోయి, "జయశీలా, కోపగించకు. నేను బోయవాడి ద్వారా, ఆ రెండు కాళ్ళ మొసలి సంగతి తెలుసుకున్నాను. వాడే యువరాజునూ, యువరాణినీ అపహరించుకుపోయి వుండాలి." అన్నాడు.

"ఏదో మతిలేని వెధవ! రెండు కాళ్ళ మొసలి ఏమిటి? నాలుగు కాళ్ళ మనిషి లాగా!" అన్నాడు జయశీలుడు విసుగుపడుతూ.

సిద్ధసాధకుడు, బోయవాడి భుజం తట్టి, "ఒరే అబ్బీ! నీకొచ్చిన భయం లేదు. ఆ రెండు కాళ్ళ మొసలి యిక్కడికెందుకు వచ్చాయి? ఎన్నేమదిగాడు?" అని ప్రశ్నించాడు.



బోయవాడు భయంతో దిక్కులు చూస్తూ, "దొరా, వాడు నన్ను పలకరించటం, నేను జవాబు చెప్పి యింకా బతికి వుండటం కూడానా? నేను రేవు పొదల్లో పక్షి అరవి నోటిని ముక్కు సమ్ముకుంటూ సుతారంగా బయటికి లాగేందుకు, మోకాళ్ళ మీద వంగాను. ఇంతలో వెనక శబ్దమైంది. తల తిప్పి చూసేసరికి, ఆంత పొడుగున, ఒళ్ళంతా మొసలిలా గజ్జలు గజ్జలుగా వున్న ఆకారం కంటబడింది. వెంటనే నేను ఒక దెబ్బ కేక పెట్టి, నేల మీద పడి పోయాను. తరవాత ఏం జరిగిందీ నాకు తెలియదు." అన్నాడు.

"నువ్వు చూసింది నిజమైన అడవిదేవతేమోమరి?" అన్నాడు జయశీలుడు.

"వాణ్ణి కొండదేవత ఎత్తుకుపోయి వుంటుంది. తెల్లవారుజామున కోడిని కొట్టి వీడు అపచారం చేశాడు. అందుకే పిల్లి ఆ కొండదేవత నిత్రయించింది." అన్నాడు దయ్యాలపోతు పళ్ళు కొరుకుతూ.

జయశీలుడు వాడి కేసి కోపంగా చూసి, సిద్ధసాధకుడితో, "ఇక్కడంతా వెకిలి విధపలు చేసినట్టుంది. ఇప్పుడు మనం ఏం చేద్దాం? ఎలాంటి శుభవార్త వినకుండా రాజుగారికి చెప్పేందుకు లేదు కనక, మనం యిప్పుడే నగరానికి తిరిగిపోవటం అర్థంలేని పని అవుతుంది. మనం యీ చుట్టు పక్కల పొదల్లో, కొండల్లో, లోయల్లో కనీసం ఒకవారం రోజులపాటైనా తిరిగి, ఆ దుర్మార్గుడి జాడ ఏమైనా తెలుసుకో గలమేమో చూద్దాం." అన్నాడు.

"ఇది మంచి యోచన, జయశీలా!" అని సిద్ధసాధకుడు జయశీలుణ్ణి మెచ్చుకుని, తాళపత్ర గ్రంథం అట్టలను రెండు మూడు సార్లు తిప్పిచూసి, "జయశీలా! యీ గ్రంథాన్ని యిక్కడ పోగొట్టుకున్న వాడే యువరాజును ఎత్తుకు పోయినవాడైతే మాత్రం—వాడు తప్పక రాక్షసజాతివాడో, కిన్నెర, గంధర్వజాతి వాడో అయివుంటాడు." అన్నాడు.







"అంతేకాని, సేవకా! అయినా మనం అలాంటి వాళ్ళను నా కత్తి బలంతో, ఈ మంత్రశక్తితో వధించి, యువరాజునూ, యువరాణినీ తిరిగి తెచ్చి, కనకాకరరాజు గారికి ఒప్పచెప్తాం." అన్నాడు జయశీలుడు.

తరవాత ఇద్దరూ కలిసి దాపులనున్న కొండల కేసి బయలుదేరారు. వాళ్ళ వెంట నగరం నుంచి వచ్చిన రాజుగారి నౌకరు, వాళ్ళను, "అయ్యా, రాజుగారికి ఏమని చెప్పమన్నారు?" అని అడిగాడు.

జయశీలుడు జవాబు చెప్పబోయేంతలో సిద్ధసాధకుడు అందుకుని, "ఒరే, రాజుగారికి ఈ శుభవార్త చెప్పు! అయిన పిల్లలు అపహరించబడిన దీవల పట్టి దగ్గిర, ఒక మహాద్భుతం జరిగిందని దాని సాయంతో త్వరలోనే యువరాణి, యువరాజులను ఎత్తుకుపోయిన దుష్టులను సంహరించి, వాళ్ళను క్షేమంగా నాటిక తేగలమని తెలియజేయుము." అన్నాడు.

ఈ మాటలకు జయశీలుడు తనలో తాను నవ్వుకున్నాడు. ఇద్దరూ దట్టమైన చెట్లతో కప్పబడిన కొండ కేసి పోసాగారు. ఆ సమయంలో అక్కడికి అనతిదూరంలో, కొండ దిగువ నున్న ఒక కుగ్రామంలో, గ్రామస్థులంతా ఏడుపుల్లో చేరి, భయకంపితులైపోతూ, ఏమి చెయ్యటమా అని గొడవ గొడవగా చర్చించుకుంటున్నారు.

ఈ గగ్గోలు కంతకూ కారణమైన సంఘటన, ఆనాటి ఉదయాన, గ్రామానికి దూరంగా వున్న జొన్న చేల దగ్గిర జరిగింది. ఆ చేలల్లో ఒక చోట మంచె వున్నది. ఆ మంచె మీద కూర్చుని చేల కావలా కాస్తున్న, ఒక పన్నెండేళ్ళ కాపుకుర్రవాడికి దూరంగా చేల కేసి వస్తున్న ఏనుగు ఒకటి కనిపించింది. ఏనుగును వడిసెల దెబ్బతో తరమటం సాధ్యంకాదని వాడికి తెలుసు. కాని, అది ఒకసారి పంట మీద పడిందా, పావుగంటలో ఎకరం పంట సర్వనాశనం అయిపోతుంది.



చెక్కలో పెగ, పెరిగిపోయిన యీ కత్తిని ఉపాయంగా బయటికి లాగి, ప్రాణం పోకుండా కాపాడాలి. మీ ఇద్దరికీ ప్రతి ఫలం వుంటుంది," అన్నాడు.

కాశీ సుబ్రాడు నిలువెల్లా వణికిపోతూ, ఆ వికృతాకారుడు చెప్పినదంతా విన్నాడు. కాని, వాడికి మంచె దిగడానికి ధైర్యం చాలలేదు. అది గ్రహించిన వికృతాకారుడు ముందుకు వచ్చి, కాశీ సుబ్రాణ్ణి నడుం పట్టుకుని పైకెత్తి, పిసుగు మీదికి దించి, తరవాత చేతులు రెండూ పట్టుకుని నేల మీదికి జార్చాడు.

కాళ్ళు రెండూ నేలను తాకగానే కాశీ సుబ్రాడికి నూరు ఏనుగుల బలం వచ్చి నట్టయింది. వాడు యమకింకరుడి పట్టు నుంచి బయటపడినవాడిలా కీచుమంటూ ఒక కేకపెట్టి, సుడిగాలిలా జొన్నచేలకు అడ్డంపడి పరిగెత్తుతూ, కొద్దిసేపటికల్లా గ్రామం చేరాడు.

ఆ సమయంలో గ్రామ మధ్యలోని వేపచెట్టు కింద రచ్చబండ మీద గ్రామస్థులు కొందరు కూర్చుని, పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. పరుగెత్తుకుంటూ వస్తున్న కాశీ సుబ్రాణ్ణి చూస్తూనే వాళ్ళు, జొన్నచేల మీదికి ఏ అడవి పందుల గుంపో, లేక్క మంది వచ్చిపడి వుంటుం దనుకుని, "ఒరే, చిన్నా! ఏం జరిగింది? ఎందుకలా పరిగెత్తుతున్నావు?" అని అడిగారు.

చిన్నడు ఒగ రొప్పుతూ, తడబడే మాటల్తో జొన్నచేల దగ్గిర జరిగిందంతా చెప్పాడు. గ్రామస్థుల్లో ఎవరికీ వాడి మాటల మీద నమ్మకం కలగలేదు. వాడికి కేదో మతిభ్రమ కలిగి వుంటుందని కూడా కొందరనుకున్నారు. కాని, ఆ సమయంలో అక్కడికొచ్చిన ఊరి గణాచారి, గ్రామ పెద్ద ద్వారా సంగతంతా విని, "చిన్నా చెప్పింది, అంత అబ్బురమైన సంగతేం కాదు. నేను గతంలో విన్నప్పుడు- ఇలాంటి చిటి పిసుగుళ్ళి, ముసలి మను షుల్నే కాదు—రెండు తలల సింహాలనూ,



# మాయాసరోవరం

## 7

[ ఉపమంత్రి దగ్గిర ఉద్యోగులందరికీ, సిద్ధసాధకుడికీ ఒక పురాతన తాళపత్ర గ్రంథం దొరికింది కాని, రాజుగారి పిల్లల జాడలు మాత్రం తెలియలేదు. వాళ్ళు దావళనున్న కొండల వేపు బయలు దేరారు. ఆ సమయంలో, ఆ ప్రాంతాల గల ఒక గ్రామప్రజలు తమ పత్తిచేల కేసి పోగా, వాళ్ళ మీదికి ఒక వికృతాకారుడు, అడవిలో వున్న ఏనుగును ఉసిగొల్పాడు. తరవాత ...]

తరుముకొని వస్తున్న ఏనుగునూ, దాని మీద ఉగ్రరూపంలో వున్న వాణ్ణీ చూస్తూనే, గ్రామస్థులంతా భయకంపితులైపోయారు. ఒకటి రెండు క్షణాలపాటు వాళ్ళకు పారిపోయేందుకు కూడా కాళ్ళాడలేదు. ఏనుగు మీద వున్న వికృతాకారుడు, తన వాహనాన్ని వాళ్ళ దాపులకు పరి గెత్తించి, పెద్ద గొంతుతో, ''మీలో పారిపో చూసే వాళ్ళకు తప్ప, మిగతా వాళ్ళకు నా నుంచి ఎలాంటి హానీ జరగదు.'' అన్నాడు.

ఆ మాటలతో గ్రామస్థులకు కొంచెం ధైర్యం కలిగింది. ఏనుగు మీద వున్న వాడు ఎంత వికృత రూపుడైనా, వాడి మాటల్ని బట్టి, వాడు మనిషే అను కున్నారు వాళ్ళు.

మాటా పలుకూ లేకుండా, నివ్వెరపడి చూస్తున్న గ్రామస్థులను తిరిగి వికృతా





కారుడి పలకరించి, "మీలో పెద్ద ఎవరు? ఇక్కడ మంచె మీద వున్న వాడు, మీ గ్రామం కుర్రాడేనా? వాడితో నాకు ఆహారం తెమ్మని, ఒక వైద్యుణ్ణి కూడా వెంటబెట్టుకు రమ్మని చెప్పానే! కాని, మీరు కర్రలూ, కత్తులతో నన్ను చంపేందుకు యిక్కడికి వచ్చినట్టుంది. అవునా?" అని ప్రశ్నించాడు.

ఆ సరికి గ్రామపెద్ద భయం పోయి, బాగా తేరుకున్నాడు. రూపానికి భయంకరుడే కాని, తతిమ్మా విషయాల్లో వికృతాకారుడు తమలాంటి వాడేనని అతడికి తోచింది. ఆ వెంటనే అతడు, వికృతాకారుడికి చేయెత్తి నమస్కరిస్తూ, ఏనుగును సమీపించి, "అయ్యా, మొసలి దొరా! మమ్మల్ని క్షమించాలి. మీరనే ఆ కుర్రాడు, మా గ్రామం వాడే. వాడు, మీరు చెప్పమన్న మాటలు మాతో చెప్పాడు. కాని, ఎంత ఏనుగు, ఎంత మనిషి అంటూ వాడు మాట్లాడిన తీరు చూసి, మేము నమ్మలేక పోయాం. ఈ కొండలూ, అరణ్య ప్రాంతాల అన్ని రకాల క్రూరమృగాలతోపాటు, అడవి ఏనుగుల మందలు కూడా తిరుగుతుంటవి. ఆ ఏనుగులేవో వచ్చి మా జొన్నచేల మీద పడినవనుకున్నాము," అన్నాడు.

ఏనుగు మీది మొసలి ఆకారం వాడు చేయెత్తి, "ఒరే, గ్రామ పెద్దా! నువ్వు అసలు సంగతి తప్ప, అనవసరమైన సంగతులు చాలా మాట్లాడావు. ఇంతకూ, మీరు, నా కోసం ఆహారాన్ని, వైద్యుణ్ణీ తెచ్చారా లేదా?" అన్నాడు.

వాడి కోపం చూసి గ్రామ పెద్ద వెనుక్కు అడుగు వేసి, "అయ్యా, మొసలి దొరా! తమ కోసం పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం మా ఇంట తయారవుతున్నది. ఇక వైద్యుడంటారా? ఒక్కడు కాదు, ఇద్దర్ని తీసుకొచ్చాం." అన్నాడు.

మొసలి ఆకారం వాడు తన డొక్కలో నుంచి బయటికి పొడుచుకు వచ్చిన



వంగిన కత్తి కేసి ఒకసారి చూసుకుని, చిన్నగా మూలిగి, "ఆ వైద్యులెక్కడ?" అంటూ జనం కేసి పరీక్షగా చూడసాగాడు.

గ్రామ పెద్ద తెలివైనవాడు, జిత్తుల మారి. అతడు తన చేతిలోని పొన్ను కర్రను పైకెత్తి, వెనక వున్న గ్రామస్థుల కేసి తిరిగి, "ఒరే, మీలో ఒకరిద్దరు వెంటనే గ్రామానికి పరిగెత్తిపోయి, మొసలి దొరకు క్షణాల మీద ఆహారం పట్టుకు రావాలి. మన చరకాచారిగారెక్కడ? వీరనారాయుడు ఎక్కడ చచ్చాడు?" అన్నాడు.

అతడు మాట ముగించేలోపలే, జనంలోని కొందరు చరకాచారినీ, వీరనారాయుణ్ణీ ముందుకు తోశారు. కాని, వాళ్ళు భయంతో గింజుకుంటూ వెనక్కు పోయి దాక్కోవాలని చూస్తున్నారు. గ్రామ పెద్ద పోయి, చరకాచారినీ, వీరనారాయుణ్ణీ చేతులు పట్టుకుని ముందుకు లాగి, మొసలితలకారంవాడితో, "మొసలిదొరా! వీళ్ళే మా గ్రామవైద్యులు. ఇద్దరూ మంచి హస్తవాసిగలవాళ్ళు." అన్నాడు.

మొసలితలకారంవాడు, వాళ్ళిద్దరి కేసి చూసి, ఆ క్షణం వరకూ తలమీద కప్పున్న కరస్త్రాణాన్ని వెనక్కు లాగాడు. ఇప్పుడు అతడి ముఖం గ్రామస్థులందరూ స్పష్టంగా చూశారు. అతడికి నలభైఏళ్ళ కన్న ఎక్కువ వయసుండదు. ఎర్రనిదేహచ్ఛాయ, భుజాల మీదికి పడుతున్న నల్లని ఉంగరాలజుట్టు.

"మామూలు మనిషే! ఏదో రాజకుటుంబీకుడిలా వున్నాడు," అన్నాడు శస్త్రవైద్యం నేర్చిన వీరనారాయుడు, పక్కనున్న చరకాచారితో.

"రాక్షసులు కామరూపులు. కావాలనుకున్న రూపాన్ని క్షణాలమీద ధరించగలరు. ఏదైనా మా గురువుగారికి చేసిన ప్రమాణం ప్రకారం, రోగగ్రస్తుడైనవాడు, రాక్షసుడైనా, పిశాచం అయినా నేను వైద్యం చేస్తాను." అన్నాడు చరకాచారి.







"నేనూ, వైద్యం నేర్పిన మా అయ్య దగ్గర అలాంటి ప్రమాణమే చేశాను. ఊం, తమరు ముందు నడవండి." అన్నాడు వీరనారాయణుడు.

వైద్యులిద్దరికీ మొసలి ఆకారంవాడి వేషం పోయిందని గ్రహించి, గ్రామ పెద్ద పక్కకు తప్పుకున్నారు. చరకాచారి, వీరనారాయణుడూ ఏనుగును సమీపించారు. ఆచారి తల ఎత్తి, "మొసలిప్రభూ! తమను పట్టి పీడిస్తున్న వ్యాధి ఏమిటి? దాని లక్షణాలు సెలవివ్వండి." అన్నాడు.

మొసలిఆకారంవాడు ఆ ప్రశ్నకు కోపంతెచ్చుకుని, "మీకు దృష్టిమాంద్యం లేదుగదా? నేను మీ గ్రామం కుర్రాడితో చెప్పి పంపిన మాటేమిటి? అదుగో, డొక్కలో గుచ్చుకున్న ఈ కత్తిని బయటికి లాగి, నేను చావకుండా చూడాలి. తెలివితక్కువకొద్దీ నా కేమైనా ప్రాణాపాయం కలిగించారో, మీ ఇద్దరినీ ఏనుగు చేత నజ్జునజ్జయేలా తొక్కిస్తాను." అన్నాడు.

చరకాచారి తప్పని ఒకడుగు వెనక్కు వేసి, "ప్రభూ, ఈ వీరనారాయణుడు శస్త్రవైద్యంలో సాటిలేనివాడు. ఆ కత్తిని అతడు బయటికి లాగనివ్వండి. ఈ లోపల నేను, గాయం మానేందుకు అవసరం అయిన మూలికలూ అవీ పోగు చేసుకు వస్తాను." అంటూ గబగబా ఆ పక్కనవున్న గుబురు చెట్ల వేపు బయలుదేరాడు.

"నేను కత్తి లాగిన అరఘడియలో, రక్తస్రావం కాకుండా పసరు, గాయానికి కట్టు కట్టాలి. త్వరగా రండి, చరకాచారి గారూ." అని కేక వేశాడు వీరనారాయణుడు.

తరవాత అతడు మొసలిఆకారంవాడు అందించిన చేయి పట్టుకుని, ఏనుగు మీదికి పోయాడు. ఆ వికృతాకారుడి డొక్కలో దిగివున్న కత్తిని పరీక్షగా చూసి, "ఔరా! కత్తి తళ తళ మెరుస్తున్నది. ఇదేదో రాచకత్తిలా వుంది!" అన్నాడు వీరనారాయణుడు.





మొసలి ఆకారంవాడు ఆ మాటలకు విసుక్కుని, పెద్దగా మూలిగి, "ఇది రాచకత్తిలా వుండటం కాదు. రాచకత్తే! ఒకానొక పొగరుబోతు రాజకుమారుడు. నా మీద తిరగబడి కత్తితో బలంగా డొక్కలో పొడిచాడు. ఈ మొసలిచర్మం కవచం నన్ను చావకుండా కాపాడింది. ఆ కుర్రాణ్ణి ప్రాణాలతో పట్టుకోవాలని ప్రయత్నం చేసి, నే నొక్కణ్ణే యీ ఆపద తెచ్చుకున్నాను. నా తోటివాళ్ళు ఆనందంగా తిరిగి పోయారు. నేను ప్రాంతాల మతిచెడి తిరుగుతున్నాను." అన్నాడు.

ఈ జవాబుతో వీరనారాయణుడికి, తమ రాజుగారి కుమారుడూ, కుమార్తె అపహరింపబడిన సంగతి గుర్తుకొచ్చింది. వాళ్ళను అరణ్యంలో నుంచి బలవంతంగా ఎత్తుకుపోయిన ముఠాలోనివాడన్న మాట వీడు—అనుకున్నాడు, వీరనారాయణుడు. అప్పుడు తాను. వీణ్ణి డొక్కల్లో నుంచి కత్తిలాగే ప్రయత్నంలో, కత్తిని అటూయిటూ బాగా కదిలించి, ప్రాణాలు తీయవచ్చు. కాని, అందువల్ల రాజుగారి పిల్లలు ఎక్కడ నిర్బంధంలో వున్నారో, తెలియకుండా పోతుంది. కనక, యీ దుర్మార్గుణ్ణి చావకుండా కాపాడి, రాజుగారికి అప్పచెప్పటం మేలనుకున్నాడు, వీరనారాయణుడు.



కినాల మీద వీరనారాయణుడు అలా వుంచి, తాను వెంటతెచ్చిన చిన్నకత్తులనూ ఆకుపసరులాగలనూ దుస్తుల్లో నుంచి బయటికి తీసి, "ఓరా! వరకాదారిగానిని రాసియుంచి. కత్తి బయటికి లాగిన మరుక్షణం గాయానికి కట్టుకట్టకపోతే ప్రమాదం." అని, దూరంగా నిలబడి వున్న గ్రామపెద్దతో, "ఇక్కడ వీడికి చికిత్స పూర్తయింతరవాత. వాడిని మన గ్రామం తీసుకుపోవాలి. ముందుగా మనిషిని పంపి, అక్కడ వాడి విడిదికి తగిన ఏర్పాట్లు చేయండి." అన్నాడు.

వీరనారాయణుడు ఇలా అనగానే, మొసలి ఆకారంవాడు ఆతడి కేసి కను



బొమలు ముడిచి సుర్రుసుర్రున చూస్తూ, "ఒరేయ్, ఏమిటేమన్నావు, వీరనారాయుడా?" అంటూ, వీరనారాయుడి మెడ పట్టుకుని పైకెత్తి, "బాధకొద్దీ, నేనన్న మాటలవల్ల, నేనెవరైందీ నువ్వు గ్రహించినట్టుంది. కాని, ఆ సంగతి మీ గ్రామపెద్దతో గాని, మరెవరితోనైనా గాని అన్నావో, నీ ప్రాణాలు నిలువునా తీస్తాను. తెలిసిందా?" అన్నాడు.

వీరనారాయుడు గడగడ వణికిపోతూ, "మొసలిబావా, నన్ను చంపకండి! మా రాజుగారూ, మీరూ నాకు ఉజ్జీలు. ఏదో కూరగాయ వైద్యం చేసుకు బతికే వాణ్ణి నేను. కాస్త పళ్ళబిగువున బాధను పట్టుకోండి. కత్తి బయటికి లాగబోతున్నాను." అన్నాడు.

మొసలి ఆకారంవాడు, నారాయుణ్ణి వదిలాడు. నారాయుడు కత్తిని మెల్లిగా అటూ యిటూ కదిలించి చూసి, రెండు చేతులతో బలంగా పట్టుకుని లాగబోతున్నంతలో, దూరంగా చెట్ల వెనకనుంచి, చరకాచారి వెనక, "రక్షించండి! రక్షించండి!" అన్న కేకా, ఆ వెంటనే రెండు మూడు ఏనుగులు ఒక్కసారిగా దూరంనుంచి ఘీంకరించటం వినబడింది.

ఏనుగుల ఘీంకరింపులూ, చరకాచారి కేకలూ వింటూనే మొసలి ఆకారంవాడు చప్పున ఆ ధ్వనులు వస్తున్న వైపుకు తల తిప్పాడు. ఆ రెండు ధ్వనులూ వస్తున్న దిక్కు పరిశీలించి చూస్తే, చరకాచారి ఆర్తనాదానికి కారణం, అడవి ఏనుగుల ప్రమాదం కాదని అతడికి తోచింది. ఆ ఏనుగులు మరెంత దూరం నుంచో ఘీంకరిస్తున్నవి. అయినా చరకాచారి ఆర్తనాదాలు చేస్తున్నాడు!

ఈలోపల గ్రామస్థులంతా భయకంపితులైపోయారు. వాళ్ళకు అడవి ఏనుగులంటే, పులులూ, సింహాలకన్నకూడా ఎక్కువ భయం. అవి ఒకసారి గ్రామాల మీద పడి, నివాసగృహాలను నేలమట్టం చేయటం వాళ్ళెరుగుదురు.

గ్రామపెద్ద, మొసలి ఆకారం వాణ్ణి సమీపించి, "మొసలిదొరా! చరగాచారి గారు ఒక్క కేక మాత్రం పెట్టి ఊరుకున్నాడు. అంటే, ఆయన కెదురైన ప్రమాదమేదో, ఆయన్ని పట్టివిట్టు కున్నట్టుగదా? కనక, ఆ అడవి ఏనుగుల మంద మనమీదికి వచ్చే ప్రమాదముంది. మనం గ్రామం చేరటం మంచిది." అన్నాడు.

"బాగానే వుంది! మరి నా కత్తి మాటేమిటి? ఎంతకాలం ఇలా విరిగిన కత్తిని పక్కలో పెట్టుకుని తిరిగేది?" అన్నాడు మొసలి ఆకారంవాడు.

వీరనారాయుడు ఏనుగుల ఘీంకారాలు వస్తున్న దిక్కుకేసి చూసి, నిలువెల్లా వణికిపోతూ, "మొసలిదొరా, మా గ్రామపెద్ద అన్నదే నిజం!" అన్నాడు.

మొసలి ఆకారంవాడు తనేదో పెద్ద చిక్కుల్లో తల దూర్చబోతున్నాననుకుని, బెంబేలు పడిపోతూ, ఏం చేయటమా అని ఆలోచించేంతలో, బూసాని చరగాచారి, "అయ్యో, రక్షించండి!" అంటూ ఒక చావు కేక పెట్టాడు. అదే సమయంలో దూరం నుంచి కొన్ని అడవి ఏనుగులు తుప్పలూ, పొదలూ నలగదొక్కుతూ, చెట్లకొమ్మలను ఫెళఫెళమని విరుస్తూ, వేగంగా రాసాగినై.

ఇదంతా చూసిన గ్రామపెద్ద చేతిలోని పొన్ను కర్రను పైకెత్తి, తన గ్రామం వాళ్ళతో, "ఒరే, ఇక్కడ మరొక క్షణకాలం వున్నా, మనం చచ్చిన వాళ్ళకిందే జమ. కాలిసత్తువ కొద్దీ గ్రామం కేసి పరిగెత్తండి." అని హెచ్చరించాడు.

గ్రామస్థులంతా వెనుదిరిగి పరుగు లంకించుకున్నారు. మొసలి ఆకారం వాడు చప్పున తన శిరస్త్రాణాన్ని తలమీదికి దించుకుని, ఏనుగును అదిలించి, పొడవాటి తొండాన్ని వత్తి పట్టుకున్నాడు. వీరనారాయుడు ఏనుగు మీద గెంతుతూ, "అయ్యో, రక్షించండి!" అంటూ చరగాచారి కన్న పెద్దగా కేకలు పెట్టసాగాడు.

—(ఇంకావుంది.)





# మాయాసరోవరం

## 8

[ఏనుగును తమ మీదికి ఉసికొల్పిన మొసలి ఆకారం వాడికి, వైద్యుల్లైన చరగావారిని, శివనారాయణమూర్తి చూపించి, గ్రామపెద్ద శాంతపరిచాడు. శివనారాయణుడు, మొసలి ఆకారం వాడి పొక్కలో దిగిన కత్తిని బయటికి లాగివేస్తున్న సమయంలో, దూరం నుంచి పరిగావారి ఆర్తనాదంతోపాటు, అడవి ఏనుగుల ఘీంకారాలు వినిపించినై. తరవాత—]

అడవి ఏనుగులు తన మీదికే దాడి వస్తున్నవని మొసలిఆకారంవాడు గ్రహించాడు. అవి కొంచెం చిన్నా, పెద్దా కలిసి ఆరు ఏనుగులు మాత్రమే. ఆ ఏనుగులు ఏనాడూ తన వాహనం అయిన జలగ్రహం లాంటి ఏనుగును చూసి వుండవు! దాని బలం, తన చేతిలోని శూలం శక్తి ఏపాటివో తెలియగానే, ఇలా ఏనుగుల్లో చావగా మిగిలినవన్నీ, తిరిగి అడవుల్లోని చెట్లచాటుకు పారిపోవటం జరిగి తీరుతుంది....

మొసలిఆకారంవాడు ఇలా ఆలోచించి, "జలగ్రహా! ఆ ముందు వస్తున్న ఏనుగును, నీ కోరలకు బలిపెట్టు," అంటూ అరిచాడు.

వాడి హెచ్చరిక వింటూనే జలగ్రహం చూసుకుపోయింది. అందుబాటులోకి వచ్చిన అడవి ఏనుగు తొండాన్ని, తన వాడ







దంతాలతో తల మీద బలంగా పొడిచింది. ఆ దెబ్బకు అడవి ఏనుగు ఘీంకరిస్తూ పక్కకు పడిపోయింది. అదేసమయంలో మొసలిఆకారంవాడు మరొక ఏనుగు కుంభస్థలం మీద శూలంతో గట్టిగా పొడిచాడు. ఆ పోటుకు అది తల వంచి ముందుకు కూలబడింది. జలగ్రహం దాన్ని కాళ్ళతో తొక్కుతూపోయి, మరొక ఏనుగు తలను తొండంతో బిగించి పట్టుకుని, కోరలతో కుమ్మింది.

ఈ విధంగా క్షణాల మీద మూడు అడవి ఏనుగులు బాగా గాయపడి నేల కొరిగినై. మిగిలిన ఏనుగులు వెనుదిరిగి పారిపోతున్నంతలో, మొసలిఆకారంవాడు తన శూలంతో అందినచోటనల్లా వాటి శరీరాల మీద పొడిచాడు. అవి బాధతో ఘీంకరిస్తూ అరణ్యం కేసి పరిగెత్తసాగినై. మొసలిఆకారంవాడు వాటిని కొంత దూరం తరిమి, ఆయాసపడుతూ తన వాహనాన్ని ఆపాడు. హఠాత్తుగా వాడికి తనకు చికిత్స చేయ వచ్చిన వీరనారాయుడు గుర్తుకొచ్చాడు. వాడేమైనట్టు? తనకూ అడవి ఏనుగులకూ జరిగిన పోరాటంలో, ఏనుగుల కాళ్ళ కింద పడి నలిగి చావలేదు గదా?

వాడికి యీ అనుమానం కలగ్గానే పై ప్రాణం పైనే పోయినట్టయింది. వాడు కళవెళ పడిపోతూ చుట్టూ ఓ మారు కలయచూసి, పెద్దగా గొంతెత్తి, "ఓరి, వీరనారాయుడూ, ఎక్కడ?" అని కేక పెట్టాడు.

ఆ వెంటనే మొసలిఆకారంవాడి వీపు వెనక నుంచి, "మొసలిదొరా, నేనిక్కడే వున్నాను: యింతసేపూ తమ తోక పట్టుకుని వేళ్ళాడుతున్నాను. మనం గెలిచామా, అడవి ఏనుగులు గెలిచినయ్యా?" అన్న జవాబు వచ్చింది.

ఆ మాట్లాడినవాడు వీరనారాయుడు. అతడు జలగ్రహం మీదికి అడవి ఏనుగులు దాడి రాగానే, దాని మీది నుంచి కిందికి దూకి పారిపోదామనుకుని, అలా పారిపో



చూడటం వల్ల, తను ఏనుగుల కాళ్ళ కింద పడి నలిగి చచ్చే ప్రమాదం వున్నదని భయపడి, సహాయానికి చేతికందిన మొసలి ఆకారంవాడి తొడుగుకు వున్న తోక గట్టిగా పట్టుకుని కళ్ళు మూసుకున్నాడు. తరవాత జరిగిందేమిటో అతడికి అంతగా తెలియదు.

వీరనారాయుడి జవాబు విని మొసలి ఆకారంవాడు కాస్త స్థిమితపడి, "నువ్వెక్కడే—జలగ్రహం మీద వున్నావన్న మాట. జడిసిపోయాను! ఈ డొక్కలో విరిగిన కత్తిని ఎప్పుడు బయటికి లాగుతావు?" అన్నాడు.

"మొసలిదొరా, వెగిరపడకండి. తమరు అడవి ఏనుగుల మీది యుద్ధం గొడవలో అసలు సంగతి మరిచినట్టున్నది. చరకాచార్యులుగారు ఆ మధ్య, యీ డొక్కల నుంచే ఒకటి రెండు చావుకేకలు పెట్టారు. ఆయన ఏవో మూలికలూ, ఓషధుల కోసం చెట్లల్లోకి వెళ్ళారు." అన్నాడు వీరనారాయుడు.

ఆ మాటలతో మొసలి ఆకారంవాడు గతుక్కుమని, "నిజమే, నిజమే! ఆ ఆచారి రక్షించండి అంటూ రెండు మూడు చావుకేకలు పెట్టాడు. తరవాత పలుకే లేదు. ఒకవేళ ఏ పెద్దపులో అతగాణ్ణి కరుచుకుపోతే, నా డొక్కలో యీ విరిగిన కత్తి అలా వుండిపోవలసిందేనా? దాన్ని బయటికి లాగి, నా గాయం మానే చికిత్స నువ్వు చెయ్యలేవా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వీరనారాయుడు పకపకమంటూ నవ్వి, "శస్త్ర చికిత్స నేర్చినవాడు, గాయం మాన్పే మందులే తెలియవనుకుంటున్నారా? బతుకు తెరువు పోటీ లేకుండా సాగిపోయేందుకు వీలుగా, నేనూ, ఆ ఆచార్యులూ ఒకళ్ళకు తెలిసిన వైద్యం మరొకళ్ళకు తెలియదన్నట్టు గ్రామంలో చిన్న నాటకం ఆడుతున్నాం. అలా చెయ్యకపోతే, గ్రామస్థులు మా ఇద్దరిలో ఒకళ్ళకే తిండీ తిప్పల నదు



పాయం చూస్తూ, లంటే వాళ్ళను తిం చేస్తారు." అన్నాడు.

ఆ జవాబుకు మొసలి ఆకారంవాడు కూడా పెద్దగా నవ్వబోయి, డొక్కలో వున్న కత్తి ఖరుక మనటంతో, పొట్ట పట్టుకుని చిన్నగా మూలిగి, "ఒరే, కపటపు వెధవా! నువ్వు నా తోక వదిలి ముందుకు రా!" అన్నాడు కోపంగా.

వీరనారాయుడు భయపడుతూనే, మొసలిఆకారంవాడి ముందుకు వచ్చాడు. వాడికిప్పుడు, ఆ వింత ఆకారం వాడు ఎక్కిన ఏనుగు ఏదో పిశాచం అయి వుంటుందన్న అనుమానం పట్టుకున్నది. అలా కాకపోతే, ఒక్క ఏనుగు అయి వారు అడవి ఏనుగుల్ని ఎదుర్కొని జయించుకు రావటం సాధ్యమయే పనా!

"ఒరే, నారాయుడూ! అలా గుడ్లు మిటకరిస్తూ చూడక, యీ కత్తి త్వరగా లాగి, గాయానికి చికిత్స చెయ్యి." అన్నాడు మొసలి ఆకారంవాడు.

"మొసలి వీరా! ఆ చికిత్సకు అవసరం అయిన ఆకులూ, మూలికల కోసమే చరకాచార్యులుగారు ఆ అరణ్యవృక్షాల్లోకి వెళ్లింది. ఎవరైనా ముందుగా వాటిని సంపాయించకుండా కత్తిని బయటికి లాగటం తమకు ప్రమాదకరం అవుతుంది." అన్నాడు వీరనారాయుడు.

"నాకు ప్రాణం పోయేంత ప్రమాదం సంభవిస్తే, నువ్వూ నాతోపాటు ఆ మరో లోకానికి ప్రయాణం కట్టవలసిందే. తెలిసిందా? సరి. పద! ఆ ఆచారి ఎక్కడున్నాడో చూద్దాం. ఏ పులో, సింహమో అతగాణ్ణి పట్టుకుని ఆకలి చల్లార్చుకుని వుంటే, మిగల్చిపోయిన బొమికలన్నా కంటబడకపోవు." అన్నాడు మొసలి ఆకారంవాడు

ఆ తరవాత అతడు జలగ్రహాన్ని అదిలించి గుబురుగా వున్న అరణ్యవృక్షాల కేసి బయలుదేరాడు. చరకాచారి రక్షించండి అంటూ కేకలుపెట్టింది. ఆ వృక్షాల వెనకనుంచే.

ఇప్పుడు చరకాచారి ప్రాణాలతో వున్నాడన్న మాటేగాని, మాట్లాడగలిగిన స్థితిలో మాత్రం లేడు. అంతకు కొద్దిసేపటికి ముందుగా అతడు, ముసలి ఆకారం వాడి గాయానికి కట్టు కట్టేందుకు చెట్ల కింద ఓషధుల కోసం వెతుకుతూ, ఒకచోట ఆగి, "ఆహా, యిక్కడ నేలఉసిరిక ఎంత నేవళంగా పెరిగింది! ఇది గ్రామ పెద్ద కీళ్ళ వాతానికి పనికి వస్తుంది." అంటూ మొక్కలను పీకేందుకు చప్పున వంగాడు.

చరకాచారి వంగిన ప్రదేశానికి పైన వున్న ఒక చెట్టు కొమ్మను చుట్టుకుని ఒక పెద్ద కొండచిలువ ఆకలితో నకనకలాడుతున్నది. దానికి రెండు రోజులుగా ఆహారం దొరకలేదు. కంటబడితే, ఆ ఆకలి మైకంలో అది పెద్దపులి మీదనైనా, ఏనుగు మీదనైనా పడి పట్టుతినేందుకు సిద్ధంగా వున్నది. అలాంటి కొండచిలువకు, కొమ్మ దిగువగా చరకాచారి కనిపించగానే, అది సమీమంటూ అతడి మీదికి జారింది.

కొండచిలువ పైనుంచి మీదపడగానే, చరకాచారి ఏ చెట్టుకొమ్మో విరిగి మీద పడిందనుకుని, దూరంగా పరిగెత్తబోయాడు. కాని అతడి కాళ్ళూ, చేతులూ ఆడలేదు. ఆచారి భయకంపితుడై పోయేంతలో అతడి శరీరాన్ని మెలి వేస్తూ, పెద్ద కొండచిలువ అతడి కంటబడింది. మరుక్షణం అతడు,





"రక్షించండి! రక్షించండి!" అంటూ కేకలు పెట్టాడు.

ఈ కేకలను చిన్న చెల దగ్గిర వున్న ముసలి ఆకారం వాడూ, గ్రామస్థులతో పాటు; ఆ సమయంలో అటుకేసి వస్తున్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ కూడా విన్నారు. వాళ్ళిద్దరూ పొదలో దొరికిన తాళపత్రగ్రంథం తీసుకుని, దాన్ని అక్కడ వదిలిన వాడి కోసం అరణ్యంలో వెతుకుతున్నారు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ రక్షించండి అనే కేకలైతే విన్నారు గాని, అలా కేకలు పెడుతున్న చరణాచారి మాత్రం వాళ్ళకు కనిపించలేదు. ఇద్దరూ ఆ ధ్వని వచ్చిన వైపుకు కొంత దూరం నడిచే సరికి, అడవి ఏనుగుల ఘీంకారాలూ, వాటితో వింత ఏనుగు నెక్కిన ముసలి ఆకారం వాడు శూలం తీసుకుని పోరాడుతూండటం కనిపించింది.

సిద్ధసాధకుడు ఆవేశపడి గంతులూ, తన చేతిలోని దండాన్ని పైకెత్తి, "జయశీలా! మన కనకాక్షిరాజుగారి పిల్లలను ఎత్తుకుపోయిన దుర్మార్గుడు వీడే! నేను ముందే చెప్పినట్టు వీడు యక్షుడో, గంధర్వుడో, కిన్నెరుడో అయి వుంటాడు!" అన్నాడు.

"నువ్వు చెప్పే వాళ్ళలో వాడెవడైనా కాకపోయినా, మనలాంటి మనిషి మాత్రం కాదు. వాడెక్కి వున్న ఏనుగు చూడు! అలాంటి దాన్ని మనం కలల్లో కూడా చూసి వుండం," అన్నాడు జయశీలుడు.

అంతలో మరొకసారి చరణాచారి చేసిన ఆర్తనాదం వినిపించింది. జయశీలుడు వెంటనే కత్తి దూసి, "భయపడకు, వస్తున్నాం!" అంటూ అటు కేసి బయలు దేరాడు.

సిద్ధసాధకుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో, "జయశీలా, యిదేంపని? యువరాణి, యువరాజుల్ని అపహరించుకు పోయిన దుష్టుడు కళ్ళఎదట కనిపిస్తూంటే, వాణ్ణి





వదిలి, ఎవడో ఆటవికుడు ఏ క్రూర మృగం వాతబడో చస్తుంటే, వాణ్ణి కాపాడేందుకు పోతున్నావా?'' అన్నాడు.

''అవును, సాధకా! మనం తక్షణం సాయపడక పోతే, ఏమరితే ప్రాణాలే కోల్పోతాడు. యువరాజా, యువరాణులు అంత ప్రాణాపాయస్థితిలో వున్నారను కోను.'' అంటూ జయశీలుడు పరిగెత్త సాగాడు. అతడి వెనకగా సిద్ధసాధకుడు కూడా పరిగెత్తాడు.

ఇద్దరూ చరకాచారిని సమీపించే సమయానికి, కొండచిలువ అతడి శరీరాన్ని బలంగా చుట్టి నోటితో అతడి తలను పడిసి పట్టుకునేందుకు ప్రయత్నం చేస్తున్నది. చరకాచారి చెట్టుబోదెకు నిలువుగా అనుకునివున్నాడు. అతడింకా బతికేవున్నాడన్న సూచనగా, అతడి చేతివేళ్లు మాత్రం కదుల్తూవున్నవి.

జయశీలుడు దూకుతూపోయి కత్తితో కొండచిలువ తలను, చరకాచారి తల నుంచి దూరంగా నెట్టేందుకు ప్రయత్నించాడు. తన కత్తి దెబ్బ, పాములో నుంచి దూసుకుపోయి మనిషికి తగులుతుందేమో అని అతడికి భయంకలిగింది. కాని, బలమైన కొండచిలువ బాగా ఆకలిగొని వున్నదేమో—జయశీలుడి కత్తిని తలతో గట్టిగా పక్కకు నెట్టింది.



''జయశీలా, వీడు ఆటవికుడు కాదు; చదువు సంధ్యలు నేర్చిన పండితుడిలా వున్నాడు. త్వరగా పామును చంపు.'' అన్నాడు సిద్ధసాధకుడు, చరకాచారి కేసి పరీక్షగా చూస్తూ.

జయశీలుడు కొండచిలువ తలను ఎడమ చేతితో పట్టుకుని వెనక్కు లాగుతూ, కత్తితో దాని తల కింది భాగం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు సగం తల తెగిన పాము గిలగిల్లాడుతూ, చరకాచారిని చుట్టబెట్టిన శరీరభాగమంతా వూడిపోగా, దభీమంటూ నేలమీద పడింది.

కొండచిలువతోపాటు కింద పడబోయిన చరకాచారిని, జయశీలుడు పట్టుకుని,





"సాధకా! త్వరగాపోయి నీళ్లు తీసుకురా. మనిషి దిమ్మెరపోయాడు తప్ప, బతికే వున్నాడు." అన్నాడు.

సిద్ధసాధకుడు పరుగు పరుగునపోయి, దాపులనున్న కొలను లోంచి కమండలంతో నీరు తీసుకుని, తిరిగి వచ్చాడు. జయశీలుడు ముఖం మీద నీళ్లు చల్లగానే చరకాచారి కళ్ళు తెరిచి, "నేనెక్కడున్నాను? బతికే వున్నానా, కొండచిలువ పొట్టలో వున్నానా?" అన్నాడు పెద్దగా మూలుగుతూ.

"నువ్వు బతికే వున్నావు. ముందుగా మంత్రజలం తాగు. నిన్ను పట్టిన నిస్త్రాణా, ప్రాణభయం పోతుంది." అంటూ సిద్ధసాధకుడు, చరకాచారి చేత నీళ్ళు తాగించాడు.

అంతవరకూ సగం మైకంలో వణికి పోతున్న చరకాచారి అప్పుడు కళ్ళు సాంతం తెరిచి, చుట్టూ కలయచూస్తూ, "ఏదీ పాము? ఆ మొసలి ప్రభువెక్కడ? వీరనాగాయుధుడేమయ్యాడు?" అన్నాడు.

ఆ ప్రశ్నతో జయశీలుడికి, చరకాచారి ఎవర్ని గురించి మాట్లాడుతున్నాడో అర్థమై పోయింది. అతను సిద్ధసాధకుడితో, "సాధకా, ఇతడి మాటలు విన్నావా? ఆ వింత ఏనుగు మీద వున్న మొసలి ఆకారం వాడితో, ఇతడికేదో నేస్తం వున్నది." అని చరకాచారితో, "నీ పేరేమిటి? ఆ మొసలి ఆకారం వాడికి నువ్వు బంటువా, స్నేహితుడివా?" అని అడిగాడు.

చరకాచారి జవాబు చెప్పేలోపల మొసలి ఆకారంవాడు చెట్లచాటు నుంచి ముందుకు వచ్చి, "ఈ చరకాచార్యులు నా సొంత వైద్యుడు. మీ రెవరు? నిజం చెప్పకపోయారో, నా జలగ్రహంతో మిమ్మల్ని నజ్జునజ్జయేలా తొక్కిస్తాను." అన్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ లేచి నిలబడ్డారు. జయశీలుడు కత్తి పిడిమీద చేయివేశాడు. సిద్ధసాధకుడు దండం ఎత్తి పట్టుకున్నాడు. —(ఇంకా వుంది)







# మాయాసరోవరం

## 9

[ అడవి మనుషుల్ని తరిమివేసిన తరవాత, మొసలి ఆకారంవాడు, చరకాదారి కోసం బయలుదేరాడు. కొండచిలువకు చిక్కి ప్రాణాపాయస్థితిలో వున్న చరకాదారిని, జయశీలుడు కాపాడి, అతన్ని ప్రశ్నిస్తున్న సమయంలో, మొసలి ఆకారం వాడు అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే జయశీలుడు కత్తిపిడిమీద చెయివేశాడు. సిద్ధసాధకుడు దండం ఎత్తి పట్టుకున్నాడు. తరవాత-]

జయశీలుడూ, సిద్ధసాధకుడూ నిర్భయంగా నిలబడటమే కాక, తనను ఎదిరించేందుకు సిద్ధపడటం చూసి, మొసలి ఆకారంవాడు గతుక్కుమన్నాడు. తన వాహనాన్నీ, తన మొసలి రూపాన్నీ, చేతిలో గల వాడి శూలాన్నీ చూసి, వాళ్ళిద్దరూ హడలుకుని, వెనుదిరిగి పారిపోతారని వాడు భావించాడు; కాని అలా జరగలేదు.

మొసలి ఆకారంవాడు శూలం ఎత్తి పట్టుకుని, పెద్ద గొంతుతో, "మీరెవరు? ఈ భయంకరారణ్యంలో మీ కేంపని?" అంటూ జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ గద్దించి అడిగాడు.

జయశీలుడు కత్తిని ఒర నుంచి బయటికి లాగి, "మొసలి చర్మం కప్పుకున్న నిన్ను చూస్తే, నాకు నవ్వొస్తున్నది. నేనడగవలసిన ప్రశ్నలు నువ్వడుగు







తున్నావు. సరే, నువ్వెవరు? ఈ అరణ్యం లోకి ఏం పనిమీద వచ్చావు? నువ్వెక్కి వున్న ఏనుగుకూడా ఏదో వింత చర్మం తొడుగు వేసినట్టున్నావు! ఈ కపట నాటకమంతా ఎందుకాడుతున్నావు?" అని అడిగాడు.

"ఛీ. అల్ప మానవుడి నుంచి యింత ధిక్కారమా? నేను సహించను." అంటూ మొసలి ఆకారంవాడు, విల గ్రహన్ని అదిలించబోయేంతలో, అంతవరకూ అతడి తోక పట్టుకుని వణికిపోతున్న వీరనారాయుడు మొండి ధైర్యం తెచ్చుకుని, మొసలి ఆకారంవాడి శూలం నన్ను చేరిన. తన రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, "మొసలిదొరా, కాస్త నిదానించు. నువ్వెంత వీరుడివైనా దొక్కలో యింకా గుచ్చుకుని వున్న కత్తిని మరిచిపోకు. ఆ ఇద్దరితో సమాధాన పడటం మంచిది. చరకాచారిగారు వైద్యానికి పనికివస్తాండని. కొండచిలువను పట్టబోయి చిక్కుల్లో పడి వున్నాడు." అన్నాడు.

వీరనారాయుడు యిలా అన్న తరవాత గాని, మొసలి ఆకారంవాడు సరిగా చరకాచారి కేసి చూడలేదు. ఇప్పుడు చరకాచారి లేచి నిలబడేందుకు ప్రయత్నిస్తూ, మూలుగుతున్నాడు. అతడి పక్కనే నేలమీద తల తెగి పడివున్న కొండచిలువ, గిలగిల కొట్టుకుంటున్నది. ఇది చూసి మొసలి ఆకారం వాడు ఒక క్షణకాలం నిశ్చేష్టుడై, "చరకాచారి, నాకు వైద్యం చేసేందుకు కొండచిలువను పట్టుకోబోయి, చిక్కుల్లోపడ్డావా? నీకు కావాలంటే, ఏనుగులనే మింగగలిగినంత పెద్ద కొండచిలువలను, నా శూలానికి గుచ్చి తెచ్చి యిచ్చివుండేవాడినే!" అన్నాడు.

చరకాచారి, "మొసలి ప్రభూ!" అంటూ ఏమో చెప్పబోయి, గొంతు పెగలక, గట్టిగా ఓ మారు దగ్గి, ఆయాస పడుతూ చెట్టు బోదెను ఆనుకుని, చేయెత్తి





అతడికి జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ చూపించాడు.

ముసలి ఆకారంవాడు, వాళ్ళిద్దరి కేసి కళ్ళెగరేసి చూస్తూ, "మీరింకా యిక్కడే వున్నారా? ఊఁ, బతకాలని వుంటే, నా కంటికీ, శూలానికీ అందనంత దూరం పారిపొండి," అన్నాడు.

ఆ వెంటనే జయశీలుడు కత్తి ఎత్తి ముందుకు ఒక అడుగు వేశాడు. అది చూసి వీరనారాయుడు చిన్నగా ఒక కేక పెట్టి, జయశీలుడితో, "ఓ కూరకత్తి చినబాబూ, కాస్త ఆగు! ఈ ముసలిదొర మీద కత్తితో కలబడటం అంటే, నిస్సహాయుడైన మనిషిని హత్య చేయటంతో సమానం. ఈయన దొక్కలో దిగివున్న కత్తిని చూశావా? దాన్ని బయటికి లాగకపోతే, నెత్తురు గడ్డకట్టి మరణించి తీరుతాడు," అన్నాడు.

"వీడు అంత సుఖంగా చావటం నా కిష్టంలేదు. వీడి దొక్కలో విరిగిన కత్తి మిగతా భాగం కనకాక్షరాజుగారి దగ్గిర వున్నది!" అన్నాడు జయశీలుడు.

జయశీలుడు మాట పూర్తి చేసేలోపలే ముసలి ఆకారంవాడు పెద్దగా హుంకరించి, శూలం పైకెత్తి, "ఓరే, అలా అయితే, నేనెవర్నైందీ నీకు తెలుసన్న మాట!" అన్నాడు.

"తెలుసు. అరణ్యంలో రాజకుమారుణ్ణీ, కుమార్తెనూ అపహరించుకు పోయినవాడివి నువ్వు! నీ దొక్కలో





వంగిఉన్న కత్తి రాజకుమారుడు కాంచన వర్మది." అన్నాడు జయశీలుడు.

"ఇంత తెలిసినవాడివి నువ్వు బతకటం క్షేమం కాదు." అంటూ మొసలి ఆకారంవాడు తన వాహనాన్ని అదిలించి, జయశీలుడి మీదికి దూకించబోయేంతలో, పక్కనే వున్న వీర నారాయుడు శూలాన్ని రెండు చేతులతో వడిసి పట్టుకుని, "మొసలిదొరా, అంత ఒళ్ళు మరిచిన కోపం, మీకు రక్తపోటు తెస్తుంది, ప్రమాదం!" అని కేక పెడుతూ, జలగ్రహం మీదనుంచి పట్టు తప్పి, శూలంతోపాటు దభీమంటూ కింద పడిపోయాడు.

జయశీలుడు ఆ క్షణంలో మెరుపులా ఎగిరి జలగ్రహం మీదికి పోయి, వెనక నుంచి మొసలిఆకారంవాడి మెడ పట్టుకున్నాడు. ఈ లోపల సిద్ధసాధకుడు కింద పడిన శూలాన్ని చేతిలోకి తీసుకుని, "జై, మహాకాళా!" అంటూ కేకపెట్టాడు.

మొసలిఆకారంవాడు యీ విధంగా కన్ను మూసి తెరిచేంతలో తన శూలాన్ని పోగొట్టుకోవటమే గాక, నిరాయుధుడుగా తన శత్రువుకు దొరికిపోయాడు. జయశీలుడు కత్తిని అతడి మెడకు ఆనించి, "ఒరే, నీ పేరేమిటి? నువ్వు లొంగిపోతావా లేక మెడ నరకమంటావా?" అని అడిగాడు.

మొసలిఆకారంవాడు ఒక నిమిష కాలం నిర్విణ్ణుడైపోయి, అంతలోనే తేరుకుని, "ఒరే, మనిషీ, నీ సాహసానికి మెచ్చాను." అన్నాడు.

ఆ జవాబుకు సిద్ధసాధకుడు పెద్దగా నవ్వి, "జయశీలుడి సాహసాన్ని నీ బోటి పగటివేషం వెధవ మెచ్చటం ఏమిటి? సాక్షాత్తూ ఆ మహాకాలుడే మెచ్చి, అతడి కత్తిని దీవించాడు," అన్నాడు.

"ఎవరన్నావు, మహాకాలుడా? అదెట్లా?" అన్నాడు మొసలి ఆకారంవాడు.

జయశీలుడు అతడి మెడ పట్టుకుని గట్టిగా ఊపి, "ఒరే, మొసలితొడుగూ,

అదంతా చాలా పెద్దకథ! నే నడిగినదానికి జవాబు చెప్పలేదు. నీ పేరేమిటి? లొంగిపోయి మర్యాదగా నా వెంట హిరణ్యపురం రాజుగారి దగ్గిరకు వచ్చి, ఆయన పిల్లల్ని ఎక్కడ దాచావో చెప్పరాదా?" అన్నాడు.

"నా పేరు మకరకేతు. రాజుగారి పిల్లలు ఎక్కడ వున్నదీ చెప్పేందుకు రాజుగారి దగ్గిరకు పోవటం ఎందుకు? ఆ సంగతి నీకే చెప్పతాను," అన్నాడు మొసలిఆకారంవాడు.

వాడు అంత తేలిగ్గా, తానపహరించిన యువరాజూ, యువరాణులను గురించి చెప్పతాననటం, జయశీలుడికి నమ్మశక్యంగా కనిపించలేదు. ఇందులో ఏదో మోసం వున్నదని అతడు అనుకున్నాడు. ఏమైనా, ఈ దుర్మార్గుణ్ణి రాజుగారి సమక్షానికి తీసుకుపోవటమే అన్నివిధాలా మంచిదనుకున్నాడు, జయశీలుడు. రాజుగారూ, మంత్రి యితణ్ణి ప్రశ్నించి, నిజం రాబట్టి, తరవాత ఏం చేయాలో నిర్ణయిస్తారు ...

జయశీలుడు యిలా ఆలోచించి, మకరకేతుడితో, "కేతూ, నీ సంకరజాతి ఏనుగును వెనక్కు తిప్పి, హిరణ్యపురం వైపు పోనివ్వు. దారిలో పారిపోయేందుకేమైనా కుటిలప్రయత్నం చేశావో, ఒక్క వేటుతో నీ మెడ నరికివేస్తాను." అన్నాడు.



మకరకేతు కిక్కురుమనకుండా జలగ్రహాన్ని అదిలించి వెనక్కు తిప్పాడు. సిద్ధసాధకుడు గబగబా ఏనుగు దగ్గిరకు పోయి, "జయశీలా, నేనూ వస్తున్నాను. కాస్త చేయి సాయంయిచ్చి, ఏనుగు పైకి లాగు." అన్నాడు.

జయశీలుడు, సిద్ధసాధకుణ్ణి ఏనుగు మీదికి గుంజాడు. ఏనుగు యిక కదలబోయేంతలో, వీరనారాయుడూ, చరణదాసీ చప్పట్లు చరుస్తూ, "అయ్యలారా, ఆగండి! ఇక్కడికి మా గ్రామం దగ్గిర్లోనే వున్నా, అక్కడికి చేరాలంటే, యీ కీకారణ్యం దాటాలి. దారిలో పులీ, ఎలుగూ, తోడేలూ!" అన్నాడు.







"మీకొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. మీ ఇద్దరూ, యీ దుర్మార్గుడికి వైద్యంచేసే ప్రయత్నంలో వుండబట్టే, వీడు మాకు దొరికాడు. ఏనుగు మెల్లిగా నడుస్తుంది, వెనగ్గా మీరురండి," అన్నాడు జయశీలుడు.

అందరూ హిరణ్యపురం దిక్కుగా బయలుదేరారు. నాలుగైదు నిమిషాల నిశ్శబ్దం తరవాత చరకాచారి గట్టిగా ఓమారు గొంతు సవరించుకుని, "జయశీల ప్రభూ, మా దొక మనవి." అన్నాడు.

జయశీలుడు కొంచెం ఆశ్చర్యపడి, "ఏమిటా మనవి?" అని అడిగాడు.

"నేనూ, యీ వీరనారాయుడూ పొద్దుటి నుంచి, యీ మొసలితొడుగువాడికి వైద్యం చేసేందుకు నానాహైరానా పడ్డాం. మరొక మరొక మనిషైతే, అంత పొడవుకత్తి డొక్కలో దిగబడినందుకే క్షణాల మీద చచ్చేవాడు. కాని, వీడు ఆ విరిగిన కత్తిని, ఏదో ఆభరణంలా ధరించినట్టు కనబడుతున్నాడు. పైగా, వాడి నాడి పరీక్షించాను; వాడి శరీరంలో ప్రవహిస్తున్నది శీతలరక్తం. వీడేదో జలప్రాణి!" అన్నాడు చరకాచారి.

"అంటే వీడు, నీటిలోనూ, నీటి బయటా కూడా బతగ్గలిగే, ఏ కప్పలాంటి జీవే అంటావు? కనకాకరరాజుగారికి వీడితో పనితీరిన తరవాత, వీడిని, వీడి వాహనాన్ని మీకు బహుమతిగా యిప్పిస్తాను. అప్పుడు వీడి మీద, ఏవైనా వైద్యపరిశోధనలు చేద్దువుగాని, చరకాచారీ," అన్నాడు జయశీలుడు.

ఈ సంభాషణ విని మకరకేతు పళ్ళు పటపట కొరికాడు. జయశీలుడు కత్తిని వాడి కంఠం మీద గట్టిగా ఆనించి పట్టుకుని, "ఓయ్, మకరకేతూ, జాగ్రత్త! ఏదైనా దుస్సాహసానికి పూనుకున్నావో, మొండెం నుంచి తల తెగి కింద పడుతుంది," అన్నాడు.

"ఆహా, జయశీలా! ఆ రోజు రాత్రి నీ కత్తివేటుకు శ్మశానంలో, ఆ మహాభూతం ఆవహించిన కాటికాపరి తల తెగి





కిందపడి. ఎలా చిందులాడింది! ఆ దృశ్యం అమోఘం, అపూర్వం!" అన్నాడు సిద్ధ సాధకుడు ఉత్సాహం ఆపుకోలేక చేతిలోని శూలాన్ని గిరగిరా తిప్పుతూ.

ఏనుగుకు వెనకగా నడిచి వస్తున్న వీరనారాయుడు, పక్కన వున్న చరకాచారి కేసి కోపంగా చూస్తూ, "ఆచారిగారూ, మీరు చేయదలచిన మనవి మాట మరిచి, ఆ మొసలిపీనుగు వెధవ శరీరతత్వాన్ని గురించి, చాలా మాట్లాడారు," అన్నాడు.

"అవునురే, నారాయుడూ!" అంటూ చరకాచారి నాలుక కరుచుకుని, గొంతెత్తి జయశీలుడితో, "జయశీల ప్రభూ! నేను తమకు విన్నవించాలనుకున్న మనవి మాట మరిచిపోయాను. పొద్దుటినుంచి ఈ మొసలిఆకారంవాడి కోసం నేనూ, వీరనారాయుడూ నానాప్రయాసపడ్డాం. వాడికి కష్టంచేసి కత్తి బయటికి లాగ లేవసుకొంది—అయినా మా శ్రమ గుర్తించి, వైద్యానలహా రుసుమయినా ఇప్పించండి," అన్నాడు.

జయశీలుడు చిన్నగా నవ్వి, ఏదో జవాబు ఇవ్వబోయేంతలో పక్కనేవున్న ఒక పెద్ద చెట్టుకొమ్మల్లో నుంచి రివ్వుమంటూ ఒక బాణం వచ్చి, మకరకేతు భుజంలో దిగింది. బాణంపట్టు తింటూనే మకరకేతు బాధతో పెద్దగా ఒక కేకపెట్టి, "జయశీలా, ఇది దురన్యాయం! నీకు లొంగి, నీ ఆజ్ఞల్ని శిరసావహిస్తున్న నన్ను, శూలంతో పొడుస్తావా?" అన్నాడు.



హఠాత్తుగా యిలా బాణం వచ్చి మకరకేతుకు తగలగానే జయశీలుడూ, సిద్ధసాధకుడూ కూడా ఉలిక్కిపడ్డారు. జయశీలుడు తలఎత్తి చెట్టుకొమ్మల్లోకి చూసేంతలో, అక్కడినుంచి వికవికమనే నవ్వూ, "ఒరే, మొసలిముచ్చూ! నేను కొట్టిన అడవికోడిని దొంగిలించుకుపోతావా? నువ్వు భూతానివి కాదు; మనిషివే. ఆ సంగతి తెలిసిపోయింది. ఇదుగో, యీ బాణం నీ గుండెల్లో దిగబోతున్నది." అన్నమాటలు వినిపించినై.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ కూడా ఆ గొంతు గుర్తించారు. ఆ మాట్లాడుతున్నవాడు, బోయ భీమన్న. వెంటనే సిద్ధసాధకుడు తన మంత్రదండాన్ని పైకెత్తి, "ఒరే, బోయ భీమన్నా, యింకో బాణం వదిలావో, నిన్ను మహాకాళుడికి ఆహారంగా చేస్తాను. చెట్టు దిగిరా." అంటూ కేక పెట్టాడు.

"ఎవరది? రాజుగారి దయ్యాలపోతా?" అంటూ బోయభీమన్న అరుస్తున్నాడు.

"నేను దయ్యాలపోతును కాదు, మాంత్రికుణ్ణి. సిద్ధసాధకుణ్ణి. నోరు మూసుకుని చెట్టు దిగి వస్తావా లేక, మంత్రం ప్రయోగించి, అక్కడే కొమ్మల్లో నిలువునా మంటల్లో కాల్చివేయమంటావా?" అన్నాడు సిద్ధసాధకుడు.

"నన్ను బాణంతో కొట్టినవాడు, ఆ బోయ వెధవా? ఎంత గొప్ప మాయాసరోవరేశ్వరుడి బంటును, ఎంత దుర్దశ పట్టింది! వాణ్ణి చెట్టుతోపాటు జలగ్రహం చేత నేల పడగొట్టించి, సున్నంలోకి ఎముక లేకుండా తొక్కిస్తాను." అంటూ మకరకేతు, జలగ్రహాన్ని గట్టిగా హెచ్చరించాడు.

జయశీలుడు వారించేలోపలే జలగ్రహం ఒకసారి ఘీంకరించి, దూకుతూ పోయి బోయ భీమన్న ఎక్కివున్న చెట్టును తలతో ఒకసారి ఢీకొట్టి, తొండంతో పట్టుకుని కూకటివేళ్ళతోపాటు పెకలించింది. చెట్టుకొమ్మల్లో వున్న బోయ భీమన్న కిందా, మీదా అవుతూ ఆర్తనాదాలు చేయసాగాడు. —(ఇంకా వుంది.)







# మాయాసరోవరం

## 10

[మరకతాచారి దగ్గిరకు వచ్చిన మొసలితలకాయవాణ్ణి, నేర్పుగా పట్టుకుని, అతడి వాహనం జలగ్రహం మీద ఎక్కి జయశీలుడూ, సిద్ధసాధకుడూ హంసద్వీపం కేసి బయలుదేరారు. వారిలో ఒకడు చెట్టు మీదినుంచి పోయేటప్పుడు, మొసలితలకాయవాణ్ణి బాణంతో కొట్టాడు. జలగ్రహం పోతూ వారున్న చెట్టును కూకటివేళ్ళతోపాటు పెకలించింది. తరవాత-]

బోయవాడున్న ప్రాణభయంతో కేకలు పెడుతూనే, చెట్టుతోపాటు కిందపడ్డాడు. జయశీలుడు, మకరకేతు భుజం పట్టుకుని గట్టిగా కుదిలిస్తూ, "ఒరే, మొసలి తొత్తుగు ముష్టుడా! ఇప్పుడు నువ్వు చేసిన పనేమిటి? నా అనుమతి లేకుండా జలగ్రహాన్ని చెట్టును పెళ్ళగించేందుకు ఎందుకు ఉసిగొల్పావు?" అన్నాడు కోపంగా.

మకరకేతు తన ఎడమ భుజంలో దిగిన బాణం కేసి తలతిప్పి చూసి, బాధతో ఒకసారి మూలిగి, "జయశీలా, నేను ఆ బోయవాణ్ణి యిలా నేల పడగొట్టించక పోతే, వాడు మరో బాణాన్ని వదిలి, నా గుండెల్ని చీల్చేవాడు. అది నిజం కాదంటావా?" అన్నాడు.

ఈ మాటల్లో వున్న సత్యాన్ని జయశీలుడు గ్రహించాడు. కానీ, అతడికి







మకరకేతు తన ఆజ్ఞను ధిక్కరించటం చిరాకు తెప్పించింది. ఈ లోపల సిద్ధసాధకుడు జలగ్రహం మీదినుంచి కిందికి దూకి, కొమ్మల్లో చిక్కుకుని, బయటికి వచ్చేందుకు నానా అవస్థా పడుతున్న బోయభీమన్నను బయటికి లాగాడు.

"ఒరే, బోయవెధవా! నీ కాళ్ళూ, చేతులూ ఏమైనా విరిగినయ్యేమో చూసుకో." అన్నాడు సిద్ధసాధకుడు, బోయభీమన్న కేసి జాలిగా చూస్తూ.

బోయభీమన్న ఎగిరిగంతేసి, "దయ్యాల పోతు దొరా! నాకేం దెబ్బలు తగల్లేదు; ఆలా చెట్టు మీదినుంచి గరుడపక్షి కిందికి వాలినట్టు వాలాను. ఈ మొసలిముచ్చు నా బాణం దెబ్బ తినీ, యింకా యీ పిశాచి ఏనుగు మీద కూర్చుని వుండటం, నాకు తల తీసేసినట్టుగా వున్నది. ఈసారి నా బాణం వాడి గుండెల్లో దిగబోతున్నది! మీరే చూస్తారు." అంటూ బాణం ఎక్కుపెట్టబోయాడు.

సిద్ధసాధకుడు చప్పున వాడి చెయ్యి పట్టుకుని, జలగ్రహం మీద వున్న జయశీలుడితో, "జయశీలా! అప్పుడు యీ బోయభీమన్నకు, మొసలి ఆకారం వాడి గుండెలు చీల్చేందుకు అనుమతి యిద్దామంటావా?" అన్నాడు

ఆ ప్రశ్న వింటూనే జయశీలుడు జలగ్రహం మీదినుంచి కిందికి దూకి, బోయభీమన్న మెడ పట్టుకుని, "ఒరే, పొగరుబోతు వెధవా! ఆ ఏనుగు మీద నేనుండటం చూసి కూడా, బాణం వదులుతావా? అది గురి తప్పి నాకు తగలవచ్చునన్న ఆసుమాత్రం కూడా నీకు కలగలేదా?" అని అడిగాడు.

"దొరా, నా బాణం గురి తిరుగు లేనిది. కావాలంటే ఆ మొసలి వేషం గాడి రెండు కనుబొమల మధ్య దిగేలా బాణం కొట్టగలను." అంటూ భుజానున్న విల్లంబు ఎత్తాడు.

జయశీలుడు వెంటనే వాడి చేతిలో వున్న విల్లంబులను గుంజుకుని దూరంగా

పారవేసి. "ఇప్పుడు ఆ మకరకేతు నా అధీనంలో వున్నాడు. వాణ్ణి రాజుగారి దగ్గరకు తీసుకుపోతున్నాను. నువ్వు అతడికెలాంటి హాని కలిగించినా, నిన్ను ప్రాణాలతో వదలను," అన్నాడు కోపంగా.

"మరి, నా అడవి కోడి మాటేమిటి, దొరా? దాన్ని వాడు దొంగిలించాడు," అన్నాడు బోయభీమన్న.

"ఒరే, భీమా, యిక నోరు మూసుకో. కావాలంటే పోయి ఆ కోడి సంగతి రాజుగారితో చెప్పుకో," అన్నాడు సిద్ధసాధకుడు, బోయవాణ్ణి భుజం పట్టుకుని పక్కకు లాగుతూ.

ఆ సమయంలో అక్కడికి వరహాచారి, వీరనారాయుడూ వచ్చారు. వరహాచారి జలగ్రహం మీద వున్న మకరకేతుడి కేసి చూస్తూనే ఆశ్చర్యపోయి, "ఇదేమిటి? డొక్కలో దిగిన కత్తితోపాటు, భుజంలో గుచ్చుకున్న బాణం కూడానా! ఈ మొసలి వేషగాడి రోజులు ఏమీ బాగోలేవు." అన్నాడు.

"ఛీ, యింతమంది మానవమాత్రుం వల్ల అవమానం పాలై, చావుదెబ్బలు తిని యింకా బతికి వుండటం కన్న చావు మేలు! ఏదీ, నా వాడి శూలం ఎక్కడ?" అంటూ మకరకేతు జలగ్రహం మీద వెతకబోయాడు.

సిద్ధసాధకుడు తన చేతిలో వున్న శూలాన్ని పైకెత్తి, "ఓయ్, మకరకేతూ! నీకున్న ఆ కాస్త బుద్ధీ పెడతలపట్టినట్టు





"జయశీల ప్రభూ, అలా చేయటం మంచిది కాదు. ముందు శస్త్రం చేసి ఆ కత్తిని, బాణాన్ని బయటికి తీయక పోతే, మకరకేతుడి శవం మాత్రమే హిరణ్యపురం చేరుతుంది. కావాలంటే వీరనారాయణ్ణి అడగండి." అన్నాడు చరకాచారి.

"ఆచారిగారు చెప్పింది అక్షరాలా నిజం. వీణ్ణి ముందు మా గ్రామం తీసుకుపోయి, అక్కడ వైద్యం చేసి, ఒకటి రెండు రోజుల విశ్రాంతి తరవాత రాజుగారి దగ్గరకు తీసుకుపోవటం తెలివైన పని." అన్నాడు వీరనారాయుడు.

స్థితి. ఆ శూలాన్ని నా సొంతం చేసుకుని ఎంత సేపాయె!" అన్నాడు.

మకరకేతు కళవెళపడిపోతూ చేతులు రెండూ పైకెత్తి, "హా, మాయాసరోవరేశ్వరా!" అంటూ ఒక కేక పెట్టి, "ఇంతకూ నన్నేం చేయబోతున్నారు? డొక్కలో, భుజంలో దిగిన ప్రాణాంతకమైన యీ కత్తి, బాణం మాటేమిటి?" అన్నాడు.

జయశీలుడు, చరకాచారిని దగ్గిరకు పిలిచి, "ఆచారీ! యీ మకరకేతుణ్ణి యిలాగే హిరణ్యపురం వరకూ తీసుకుపోవచ్చంటావా? ఏమిటి నీ సలహా?" అని అడిగాడు.

జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ అదే మంచి మార్గంగా తోచింది. మకరకేతుని ప్రాణాలతో శశాంకరాజుగారి దగ్గిరకు తీసుకుపోయి, అతడిచేత రాజుగారి పిల్లలు ఎక్కడ వున్నదీ చెప్పించితే, తరవాత చేయవలసిందేమిటో రాజే నిర్ణయిస్తాడని జయశీలుడు భావించాడు.

ఆ వెంటనే జయశీలుడూ, సిద్ధసాధకుడూ విగ్రహం విడిచి పోయి, మకరకేతుడితో, "కేతూ! నీకొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. నిన్ను ముందుగా యిక్కడికి దాపులనే వున్న గ్రామానికి తీసుకుపోయి, అక్కడ చికిత్స చేయించి, గాయాలు మానిన తరవాతే నిన్ను హిరణ్య





శ్వర రాజుగారి దగ్గిరకు తీసుకుపోతాం." అన్నారు.

మకరకేతు చేతులు రెండూ ఎత్తి, "అంతా, ఆ మాయాసరోవరేశ్వరుడి దయ! వాళ్ళలో మరొక బోయవెధవ, యీసారి తుది భుజంలో బాణం కొట్టకుండా మాత్రం నన్ను కాపాడండి. అంతే చాలు!" అన్నాడు.

"నీకలాంటి భయం ఏమీ వద్దు నేస్తం. సిద్ధసాధకులమూ నీకు అభయం ఇస్తున్నాం. ఊఁ, జలగ్రహాన్ని అదిలించు." అన్నాడు జయశీలుడు.



జలగ్రహం కదిలి, చరకాచారి చెప్పిన మార్గాన, వాళ్ళ గ్రామాని కేసి బయలు దేరింది. జయశీలుడు ఆలోచనలో పడ్డాడు. మకరకేతు యింతవరకు రెండు సార్లు నేను వింటూ వుండగా, మాయా సరోవరేశ్వరుడనే వాడి పేరు భక్తితో స్మరించాడు. ఎవరీ మాయాసరోవరేశ్వరుడు? యీ ప్రశ్న మకరకేతును అడిగి ప్రయోజనంలేదు; వాడు ఎన్నటికీ నిజం చెప్పడు...

జయశీలుడు యిలా పరి పరి విధాల ఆలోచిస్తూండగా, హఠాత్తుగా ఎదురుగా వున్న చెట్ల గుంపుల్లో నుంచి డప్పుల మోతలూ, ఈలలూ వినిపించినై. ఆ గొడవ చేస్తున్న వాళ్ళు ఎవరై వుంటారా అని జయశీలుడు చూసేంతలో, ముందు బోయవాళ్ళ దస్యూలపోతూ, వాడి పక్కన డప్పులూ, పిల్లంగ్రోవులూ పట్టుకున్న పది పన్నెండుమంది బోయవాళ్ళూ, చెట్ల గుంపుల చాటునుంచి బయిటికి వచ్చారు.

బోయ దస్యూలపోతు చిందులు తొక్కుతూ, "బలి! బలి! నేను బోయ మహాంకాళిని! మొదటి మనిషి గొంతు కొరికి పుక్కిట పట్టిన రక్తంతో, నా కాళ్ళకు పారాణి పెట్టాలి! అలా చేయకపోతే, లోకంలో వున్న బోయకులాన్నే విరుచుకు తింటాను! సర్వ నాశనం చేస్తాను." అని అరుస్తున్నాడు.



తన జాతి వాళ్లను చూస్తూనే జలగ్రహం వెనగ్గా, చరకాచారి, వీరనారాయుళ్ళతో నడుస్తున్న బోయ భీమన్న, "తల్లీ, మాంకాళీ!" అంటూ ఒక కేకపెట్టి, సిద్ధసాధకుడితో, "రాజుగారి దయ్యాల పోతు, దొరా! మా గణాచారి పోతుగాణ్ణి, మా కులదేవత మాంకాళి ఆవేశించింది. ఆ తల్లి, యీ ముసలి ఆకారంగాడి నెత్తురు కావాలంటున్నది. వెంటనే వాణ్ణి ఏనుగు మీంచి కిందికి తోసెయ్యమంది. తరవాత పని, మా గణాచారి చూస్తాడు." అన్నాడు.

వాళ్ళ దయ్యాలపోతును చూసి భీమన్నకూ ఆవేశం కలుగుతున్నదని గ్రహించిన జయశీలుడు, వీరనారాయుడికి కనుసైగ చేశాడు. వెంటనే వీరనారాయుడు, భీమన్న దగ్గిరున్న విల్లంబులు లాగేసుకున్నాడు. అదే సమయంలో జయశీలుడు, మకరకేతు చెవిలో ఏదో మెల్లిగా చెప్పాడు.

మకరకేతు భయం భయంగా ఒక క్షణం దిక్కులు చూసి, "జలగ్రహా! ఈ అడవి అనాగరిక వెధవని తొండానికి చుట్టి, పైకెత్తు! ప్రాణాలు మాత్రం తీయకు." అని కేకపెట్టాడు.

జలగ్రహం చప్పున తల తిప్పి, మెరుపులా పోయి, తొండంతో బోయ భీమన్న నడుం పదిలి పట్టుకుని పైకెత్తింది. భీమన్న కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ చావుకేకలు ప్రారంభించాడు.

"కేతూ, ఇప్పుడు జలగ్రహాన్ని ఆ బోయవాళ్ళ కేసి నడుపు. నీ ప్రాణానికి వచ్చిన ముప్పేంలేదు. మంచిగా నామాట వినకపోతే, నేనూ, సిద్ధసాధకుడూ వాళ్లందర్నీ హతమారుస్తాం." అని భీమన్నతో, "ఒరే, భీమన్నా! మీ వాళ్ళనందర్నీ గొడవ చెయ్యకుండా వెనక్కు తిరిగి పొమ్మని చెప్పు. మా పైకి బాణాలు వదలటంలాంటి పిచ్చి పనులేమైనా చేశారో, ముందు నువ్వు జలగ్రహం కాళ్ళ కింద నలిగి చస్తావు. తరవాత మీ వాళ్లందర్నీ

నరికి పోగులు పెడతాను." అన్నాడు జయశీలుడు.

"జయశీల ప్రభో, అవేం మాటలు? బోయ మాంకాళి, మొసలి ముఖం వాడి నెత్తురు కావాలంటూంటే, మనం కాదని కాళీమాతకు కోపం తెప్పించగలమా?" అన్నాడు బోయ భీమన్న గడగడ వణికిపోతూ.

"ఒరే, భీమన్నా, నాతో మొండిగా వాదించకు. ఈ మకరకేతు రాజుగారి బంధీ. ఇతణ్ణి రక్షించవలసిన బాధ్యత నా మీద వున్నది. అర్థమైందా?" అన్నాడు జయశీలుడు ఏనుగు మీదినుంచి ముందుకు వంగి, కత్తిని భీమన్న వెన్ను మీద ఆనించి.

"జయశీల ప్రభో, నన్ను కత్తితో పొడవకండి. మాంకాళి కోరలకన్న మీ కత్తి వాడిగా వున్నట్టుంది!" అన్నాడు భీమన్న గిలగిల్లాడుతూ.

అంతలో అక్కడికి బోయగణాచారి జుట్టు పీక్కుంటూ, కీచుమని అరుస్తూ వచ్చాడు. వాడి వెంట వున్న బోయవాళ్లు, జలగ్రహం మీద వున్న వాళ్ళకేసి బాణాలు ఎక్కు పెట్టారు.

"జయశీలా, యిప్పుడేం చెయ్యటం?" అన్నాడు మకరకేతు వణికిపోతూ.

"ప్రభో, ఆ మాటే మేమూ అడుగుతున్నాం!" అన్నారు చరణాచారి, ఏర నారాయుడూ జలగ్రహం వెనక దాక్కుంటూ.



"ఒరే, భీమన్నా, నే చెప్పేసదేమిటి?" అంటూ జయశీలుడు భీమన్న వెన్ను మీద ఆనించిన కత్తిని కాస్త గట్టిగా వత్తాడు. ఆ సమయంలో సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ తన చేతి లోని శూలాన్ని గిరగిరా తిప్పి, చప్పున బోయవయ్యాల పాటు గుండెల కేసి గురిపెట్టాడు.

భీమన్న రెండు చేతులూ పైకి ఎత్తి వణుకుతున్న గొంతుతో, "ఒరే, గండు మామా, ఒక్క చిన్మాటా! బాణాలు వదలకండి! దయ్యాలపాలయ్యేం. జాగ్రత్త! ఈ మొనగాడి తలవాడు రాజుగారి మనిషట! ఆయన్ని జయశీల దొర హిరణ్యపురానికి తీసుకు పోతున్నారు," అన్నాడు.

"నా కాళ్ళ పారాణి మాటేమిటి? వాడి రక్తం పారాణిగా పెట్టుకోందే నేను శాంతించను. నేను కాళిని, బోయమహంకాళిని!" అంటూ బోయగణాచారి జలగ్రహం కేసి రెండడుగులు ముందుకు వేశాడు.

జయశీలుడికి వాడి మొండితనం, అహంకారం చాలా కోపం తెప్పించింది. అతడు జలగ్రహం మీది నుంచి కుప్పించి కిందికి దూకి, మెరుపులాపోయి గణాచారి జుట్టుపట్టుకుని, వాణ్ణి నేలమీద విసిరికొట్టి, కత్తిని వాడి గుండెల కానించి, "అబద్ధాల మారి వెధవా? ఇప్పుడు నిజం చెప్పు, నిన్నావేశించింది మహంకాళా? చెప్పు, తాటిచెట్టు కల్లా?" అని అడిగాడు.

"సమ్మతినమ్మా, బోయ మహంకాళమ్మా, రక్షించు!" అంటూ గణాచారి కేకపెట్టాడు.

అతడి పక్కన వున్న బోయవాళ్ళు విల్లంబులెత్తబోయేంతలో, సిద్ధసాధకుడు, "జై మహాకాళా!" అంటూ జలగ్రహం మీది నుంచి కిందికి దూకి, శూలం ఎత్తి వాళ్ళ కేసి పరిగెత్తాడు.

ఆ సమయంలో, "ఆగండి! ఆగండి!" అంటూ పది మంది అశ్వికులు ఈటెలు ఝళిపిస్తూ వేగంగా వచ్చి, అందరిని చుట్టుముట్టారు. —(ఇంకా వుంది)





# మాయాసరోవరం

## 11

[కనకాకరరాజుగారి కుమారుణ్ణీ, కుమార్తెనూ అపహరించినవాడు మకరకేతు అని, జయశీలుడికి నమ్మకం కలిగింది. ఆతడికి ముందుగా చికిత్స చేయించి, రాజుగారి దగ్గిరకు తీసుకుపోదామనుకున్నాడు. కాని, దారిలో కొందరు బోయవాళ్ళు అతణ్ణి అటకాయించారు. ఆ సమయంలో పదిమంది ఆశ్వికులు వచ్చి అందరినీ చుట్టుముట్టారు. తరవాత—]

తమను చుట్టుముట్టిన ఆశ్వికులు రాజుగారి సైన్యంలోని వాళ్ళని జయశీలుడు గుర్తించాడు. వెంటనే అతడు ఎత్తిన కత్తిని దించి, వాళ్ళతో, "అదుగో, ఆ పెంతపినుగు మీద మొసలిఆకారంలో కనిపిస్తున్నవాడు కనకాకరరాజుగారి బందీ. పారిపోకుండా చూడండి." అన్నాడు.

ఆశ్వికుల నాయకుడు మకరకేతునూ, అతడు ఎక్కి ఉన్న బల(గహస్పి పరీక్షగా చూసి, ఒక క్షణకాలం స్తంభించిపోయి, "ఏడెవడు? రాకసుడా, ఏదైనా దుష్ట పిశాచమా?" అని అడిగాడు.

"అయ్యా, వాడు ఆ రెండూ కాదు. అట్లని వాడు ఫలానా జాతివాడని తేల్చి చెప్పటం కూడా కష్టమే," అన్నాడు జయశీలుడు.

ఇంతలో సిద్ధసాధకుడు, బోయ గణాచారిని, జయశీలుడి పట్టునుంచి తప్పించి,







కొంతదూరం తీసుకుపోయి నిలబెట్టి, విల్లంబులు పట్టిన బోయవాళ్ళతో, "ఒరే, అమాయకుల్లారా! వీడు నిజమైన కాళీ భక్తుడు కాడు; ఒట్టి కపటి. మహాకాళుడి భక్తుణ్ణయిన నేను, వీణ్ణి చూస్తూనే ఆ సంగతి గ్రహించాను. మీరు బాణాలను వీడిగుండెల్లో దూసుకుపోయేలా కొట్టండి." అన్నాడు.

సిద్ధసాధకుడి మాటలు విని బోయవాళ్ళందరూ భయకంపితులైపోయారు. పదిమంది రాజుగారి సైనికులు; నల్లని దుస్తులతో, పొడవాటి గడ్డంతో మాంత్రికుడిలా వున్న సాధకుడు; కత్తిపట్టి నిలబడిన జయశీలుడు—వీళ్ళందరినీ మించి ఏంతపెనుగు పెద్ద కూర్చుని వున్న భయంకర రూపుడు!

ఇక తమకు అక్కడినుంచి ప్రాణాలతో పారిపోయే అవకాశం లేదనీ, తమను చుట్టుముట్టినవాళ్ళు బలవంతులనీ భావించిన ఒక బోయవాడు, తనతోటివాళ్ళతో, "ఒరే, యిప్పుడేంచేద్దామంటారు? ఈ మాంత్రికయ్య చెప్పినట్టు, మన గణాచారిని బాణాలతో కొడదామంటారా? అలాచెయ్యకపోతే మనందరికీ చావు తప్పేట్టున్నది," అన్నాడు.

"ఇంతమంది మన కోసం, మన జాతి వాళ్ళకయి చావటం న్యాయమైన మాటే! ఏం గణాచారయ్యా, బాణాలు కొట్టమంటావా?" అని అడిగాడొక బోయవాడు.

ఈ ప్రశ్న వింటూనే బోయ గణాచారి ప్రాణభయంతో గడగడలాడిపోతూ, జయశీలుడితో, "అయ్యా, నన్ను మా బోయ అమాయక వెధవల నుంచి రక్షించండి. బాణం దెబ్బలు, కత్తి దెబ్బలకన్న మహాబాధ కలిగిస్తవి!" అన్నాడు.

"చచ్చేందుకు బాణం దెబ్బయితేనేం, కత్తిపోటు అయితేనేం? ఇక అట్టే వాగక, కదలా మెదలక నిలబడు," అన్నాడు సిద్ధసాధకుడు కోపంగా.

బోయవాళ్ళు బాణాలు గురిచెయ్య బోయేంతలో జయశీలుడు ఆగమని







వాళ్ళను హెచ్చరించి, సిద్ధసాధకుడితో, ''సాధకా, నువ్వు చెయ్యబోయే యీ మతి మాలిన పనేమిటి? నువ్వేమైనా రాజువా, మరణశిక్షలు విధించటానికి?'' అన్నాడు కోపంగా.

జయశీలుడి కోపం చూసి సాధకుడు వెలవెలపోతూ, ''ఇదంతా నిజం అను కుంటున్నావా, జయశీలా? ఈ దొంగ గజ చారిణి బుద్ధిగరిపేందుకు, యీ తమాషా చేశాను. రాజుగారి అశ్వికులు సమయానికి రాకపోతే, యీ నటికి మనసూ, యీ బోయ గణానికి వాళ్ళవాళ్ళు చావటం జరిగేది కదా?'' అన్నాడు.

అప్పటివరకూ జరుగుతున్నదంతా ఆశ్చర్యంతో చూస్తున్న అశ్వికభటుల నాయకుడు, ''అయ్యా, మీరేనా జయ శీలుడు? మంత్రిగారు యీ దాపులనే వున్న కొండవెదురుపల్లె గ్రామంలో విడిది చేశారు. మీరు, రాజుగారి పిల్లల్ని ఎత్తుకు పోయినవాళ్ళని పట్టుకున్నట్టు నగరంలో తెలిసింది. మీ కోసం వెతుకుతూ యీ అరణ్యానికి వచ్చాం,'' అన్నాడు.

''ఆహా, అశ్వికభటులనాయకా, చాలా తెలివైన పనిచేశావు! నేనూ—అంటే సిద్ధ సాధకుణ్ణి—ఈ జయశీలుడూ కలిసి యువరాజునూ, యువరాణినీ ఎత్తుకు పోయినవాళ్ళని అరణ్యమంతా గాలించి పట్టుకున్నాం. వాళ్ళే వీరు! మనిషి వింతగా లేరా?'' అన్నాడు సాధకుడు.

''వింతగా కాదు, భయోత్పాతం కలిగిం చేలా వున్నారు. డొక్కల్లో, మెడ మీదా కత్తినీ, బాణాన్ని ఆభరణంలా ధరించటం మాత్రం, నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది.'' అన్నాడు అశ్వికులనాయకుడు.

''అవి ఆభరణాలు కావు, వాడి ప్రాణం తీయనున్న ముసలాళ్ళు! నేనూ, చరకాచారిగారూ వాడికి చికిత్సచేయాలను కుంటున్నాం. మంత్రిగారు మా గ్రామం లోనే విడిదిచేశారని తెలిసి మహ సంతోషంగా వున్నది.'' అన్నాడు వీర నారాయణుడు పొదుగు చాటునుంచి వస్తూ.







స్వయంగా, నీ ప్రాణాలు కాపాడేందుకు తన మంత్రిని పంపాడు. అవసరం అయితే నీకు చికిత్స చేసేందుకు ఆయన నగరం నుంచి రాజవైద్యులను కూడా పంపగలడు. నాకు ఆయుర్వేదం," అన్నాడు.

మకరకేతు పెద్దగా ఒకసారి మూలిగి, "డొక్కలో దిగబడిపోయిన కత్తి కన్న భుజంలో గుచ్చుకున్న యీ బాణం ఎక్కువ బాధపెడుతున్నది. విప్పి కట్టిన యీ దుర్మార్గుడు జలగ్రహణ తంత్రం మీద ప్రాణాలు వదిలినట్టున్నాడు. వాడిలో చలనం లేదు. వాణ్ణి దూరంగా విసిరి వేయించమంటావా?" అని అడిగాడు.

జయశీలుడికి యిక అక్కడ కాలయాపన చెయ్యటం మంచిది కాదనిపించింది. తాను సాధ్యమైనంత త్వరగా, గ్రామానికి పోయి మంత్రి ధర్మమిత్రుడికి సంగతి సందర్భాలు చెప్పటం బావుంటుంది. రాజుగారి పిల్లలు అంతత్వరగా దొరికే అవకాశం లేదని మంత్రికి విన్నవించాలి. ముందు యీ మకరకేతు చావకుండా చూడాలి. వాడిద్వారామాత్రమే, యువరాజూ, యువరాణీ ఎక్కడ వున్నదీ తెలుసుకోవటం సాధ్యం అవుతుంది...

జయశీలుడు యిలా ఆలోచించి, మకరకేతుతో, "కేతూ, యిక నీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. కనకాక్షరాజుగారే

జయశీలుడు పోయి బోయ తిమ్మన్న ముఖం తేరి పరకగా చూశాడు. వాడు గాలి పీలుస్తున్న సూచన కూడా లేదు. భయంకొద్దీ వాడి గుండె ఆగి చచ్చాడేమో అన్న అనుమానం కలిగింది, జయశీలుడికి. అంతలో చరకాచారి అక్కడికి వచ్చి తిమ్మన్న నాడి పరీక్షించి చూసి, "జయశీల ప్రభూ! వీడింకా బతికే వున్నాడు. నాడి మందంగా కొట్టుకుంటున్నది. మొసలి అకారంవాయ చెప్పినట్టు, పిట్టి శవం కంద జమవేసి దూరంగా పారవేయటం హత్యతో సమానం." అన్నాడు.

"ఆ మాట నిజమే! కాని, మనం వీడిలో చలనం కలిగించటం ఎట్లా? వీణ్ణి





యీ అరణ్యంలోనే. వాడి జాతివాళ్ళ వశంచేసి వెళ్ళటం మంచిది. వీణ్ణి కూడా గ్రామానికి ఎక్కడ మోసుకుపోగలం?" అన్నాడు జయశీలుడు.

జయశీలుడు మాట ముగించేలోపలే సిద్ధసాధకుడు, బోయ భీమన్న చెవిలో, పెద్దగొంతుతో, "ఒరే, భీమన్నా, యిక నీ పని! నువ్వు కట్టిన అడవికోడిని మంత్రిగారు, మొసలిఆకారంవాళ్ళనుంచి తిరిగి యిప్పించారు. దాన్ని తీసుకుని మీ గణాచారి పారిపోతున్నాడు." అని, గట్టిగా చప్పట్లు చరిచాడు.

ఆ వెంటనే బోయ భీమన్న మెరుపు వేగంతో ఎగిరి, జలగ్రహం తొండం నుంచి కిందపడిలేచి, దాపులనున్న ఒక అశ్వికుడి చేతిలోంచి చప్పున ఈటె లాక్కుని, "ఎక్కడ? ఆ దయ్యాలపోతు గణాచారి ఎక్కడ? నా కోడి ఏమైంది?" అంటూ దిక్కులు చూడసాగాడు.

సిద్ధసాధకుడు, భీమన్న భుజంతట్టి, "ఒరే, భీమన్నా, నీకు దృష్టి సరిగా ఆనటంలేదా? అటు చూడు; ఆ కనబడే వాళ్ళెవరు? వాళ్ళ ముందు నిలబడిన వాడు మీ గణాచారేమో, కాస్త జాగ్రత్తగా చూడు మరి!" అని హెచ్చరించాడు.

సాధకుడు ఇలా చెప్పగానే భీమన్న, అల్లంతదూరంలో నిలబడిన తన జాతివాళ్ళకేసి, వాళ్ళముందు భయంతో వణికిపోతూ నిలబడివున్న దయ్యాలపోతు గణాచారికేసి చూశాడు. వెంటనే వాడికి సిద్ధ





సాధకుడు చెప్పిన తన ఆఖరికోరిక మాట మరోసారి గుర్తుకొచ్చింది.

"మొసలిపిశాచంవాడు యిచ్చిన, నా కోడి ఎక్కడ? దాన్నెక్కడ దాచావు గణాచారి? దాన్ని యివ్వకపోయావో.... ఆకలి! ఆకలి!" అంటూ భీమన్న ఈటె ఎత్తి గణాచారి కేసి ఉరికాడు.

గణాచారి ఒక చావుకేకపెట్టి, "మన వాణ్ణి కుక్కుటపిశాచం పట్టింది. దానికి పిల్లి మంత్రం వేస్తేగాని, అది వదలదు. ముందు వాడి ఈటె దెబ్బ తప్పుకోవాలి. పరిగెత్తండి!" అంటూ వెనుదిరిగి పారిపో సాగాడు. వాడి వెంట తతిమ్మా బోయ వాళ్ళు కూడా పరుగు ప్రారంభించారు.

భీమన్న రౌద్రంగా అరుస్తూ, ఈటె ఎత్తి పట్టుకుని, వాళ్ళ వెంటపడ్డాడు.

"బతికిపోయాం, జయశీలా! శని విరగడ అయింది." అంటూ సిద్ధసాధకుడు పెద్దగా నవ్వాడు.

పారిపోతున్న బోయవాళ్ళ కేసీ, వెంట పడి తరుముతున్న భీమన్న కేసీ ఓ మారు చూసి, జయశీలుడు, "సాధకా, యీ గొడవ కంతా నువ్వే బాధ్యుడివి. అరణ్యంలో చిన్నా పెద్ద పిట్టల్నీ, జంతువుల్నీ కొట్టుకు బతికే ఆ బోయవాళ్ళకు, భీమన్న అన్న పెద్ద బిరుదు యిచ్చి, వాడిలో లేనిపోని అహానికి కారణం అయినావు." అన్నాడు.

"జయశీలా, ఆ మాటా కొంత నిజమే కాని యిప్పుడు ఆ మాయలమారి గణాచారికి, వాడు సరైన ప్రత్యర్థి. ఇక యిప్పట్లో వాళ్ళిద్దరూ పానకంలో పుడక ల్లాగా మన కార్యసాధనకు అడ్డురారు." అన్నాడు సిద్ధసాధకుడు.

"అయ్యా, యిక బయలుదేరదామంటారా?" అన్నాడు అశ్వికుల నాయకుడు.

"అలాగే," అని జయశీలుడు, చకచకా దాటిసి, వీరనారాయుణ్ణి దగ్గరకు పిలిచి, "ఇక మీరు ముందుండి దారితీయండి. మంత్రిగారు మీ గ్రామంలోనే విడిది దిగారట." అన్నాడు.

"ఆయన ఊరి పక్కనవున్న కొండ చెరువు దగ్గిర గుడారం వేయించి, అందులో వున్నారు. తమరు అరణ్యంలో కనిపించితే, అక్కడికే తీసుకురమ్మన్నారు," అన్నాడు అశ్వదళ నాయకుడు.

జయశీలుడు, చరకాచారి, వీరనారాయుళ్ళతో, "విన్నారా?" అన్నాడు.

"ఆఁ, వినకేం జయశీల ప్రభో! ఈ మొసలితొడుగు ధరించినవాడిని, ఆ శ్రీ మంత్రిగారి సమక్షంలోనే శస్త్రం చేసి, శెభ్ అనిపించుకుంటాం." అన్నాడు చరకాచారి.

"అవును, చరకాచార్యగారూ. ఆ విధంగా మనకు కనకాక్షిరాజుగారి కొలువులో వైద్యాచార్య పదవులు దొరికే అవకాశం వుంది. ఏమంటారు?" అన్నాడు వీరనారాయుడు ఆశ్చర్యసంభ్రమాలతో.

"ఆచార్య పదవులేమోగాని, శస్త్రంచేసి యీ మకరకేతును మీరు ప్రాణాపాయం నుంచి కాపాడలేకపోతే, మంత్రిగారి మిమ్మల్నిద్దర్నీ, ఆ చెరువుగట్టునే తల నరికించేస్తారు!" అన్నాడు జయశీలుడు.

"ఆ పని మంత్రిగారు నాకు ఒప్పచెప్పితే, వీళ్ళిద్దర్నీ సమంత్రకంగా మహాకాళుడికి బలిపెడతాను. అందువల్ల మనకే కాక, లోకానికూడా ఎంతో మేలు జరుగుతుంది, జయశీలా!" అన్నాడు సిద్ధసాధకుడు ఆవేశపడిపోతూ.

"ఇక మాటలు కట్టిపెట్టి కదలండి." అన్నాడు జయశీలుడు.



ఒక ఆరగంటకాలం గడిచేలోపలే అందరూ కొండచరువు గట్టున వున్న మంత్రిగారి గుడారాన్ని సమీపించారు. మంత్రి ధర్మమిత్రుడు అందరికేసి ఒకమారు చూసి, జయశీలుడితో సాదరంగా, "రాజుగారి పిల్లల్ని అపహరించినవాణ్ణి పట్టినందుకు నిన్ను అభినందిస్తున్నాను. ఆ దుర్మార్గుడు వాళ్ళను ఎక్కడ దాచాడు?" అన్నాడు.

జయశీలుడు, మంత్రికి అన్ని విషయాలూ చెప్పి, "అయ్యా, వీడికి ముందు శస్త్రంచేసి, ఆ కత్తినీ, బాణాన్నీ బయటికి లాగి, గాయాలు మానిన తరవాత ప్రశ్నించటం బాగుంటుంది." అన్నాడు.

"అలాగేచేద్దాం. అప్పుడు నిజం చెప్పకపోతే, ఈ మొసలిముచ్చును ఏనుగుల చేత తొక్కించి మరీ చంపిస్తాను," అన్నారు మంత్రి ధర్మమిత్రుడు.

ఈ సంభాషణంతా జాగ్రత్తగా వింటున్న మకరకేతు, "జయశీలా! జలగ్రహం నీరు తాగి చాలారోజులైంది. ఈ పెద్ద చెరువులో దింపి, దాని దాహం తీర్చుతాను." అన్నాడు.

"అలాగేచెయ్యి. కాని నేనూ, సాధకుడూ కూడా నీ పక్కనే జలగ్రహం మీద వుంటాం. అలాకాకపోతే, నువ్వు ఏదైనా మోసంచేసే అవకాశం వున్నది." అంటూ జయశీలుడు పోయి, జలగ్రహం మీద నిలబడ్డాడు. సిద్ధసాధకుడు కూడా చప్పున పోయి అతడి పక్కన నిలబడ్డాడు.

మకరకేతు, జలగ్రహాన్ని అదిలించి చెరువులో దింపి, దాన్ని బాగా లోపలికి తీసుకుపోయి, "జయశీలా, నాకు చావు ఎలాగూ తప్పనట్టున్నది. అది గాయాలు మానిన తరవాత నైతేనేం, ముందుగా నయితేనేం?" అని ఒకక్షణం ఆగి, పెద్ద గొంతుతో, "హాం, మాయాసరోవరేశ్వరా!" అంటూ కేక పెట్టి, "జలగ్రహా! నీట మునిగి దారితియ్యి!" అన్నాడు.

వెంటనే జలగ్రహం, జయశీలుడూ, సిద్ధసాధకులతోపాటు చప్పున నీళ్ళలో మునిగింది. —(ఇంకా వున్నది)





# మాయాసరోవరం

## 12

[అశ్వికభటుల ద్వారా జయశీలుడికి, మంత్రి ధర్మమిత్రుడు కొండచెరువు దగ్గిర విడిది చేసినట్టు తెలిసింది. మకరకేతును అతడు అక్కడికి తీసుకు వెళ్ళాడు. తనకెలాగూ చావు తప్పదని భయపడిన మకరకేతు, జలగ్రహానికి నీరు పెట్టి పంపించి, దాన్ని కొండచెరువు లోకి తీసుకుపోయి, జయశీలుడూ, సిద్ధసాధకుడితో పాటు నీళ్ళలో మునిగాడు. తరవాత—]

జలగ్రహం హఠాత్తుగా నీట మునగటమే గాక, నీటి అడుగున వేగంగా కదలటంతో, జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ, దానిమీది నుంచి పైకి తేలే అవకాశం లేకుండా పోయింది. ఆ ఇద్దరూ తమకు జలగండం సంప్రాప్తించిందను కున్నారు. సిద్ధసాధకుడు, తనకు చావు సమీపించిందని. "జై, మహాకాళా!" అంటూ తను ఆరాధించే దైవాన్ని తలుచుకున్నాడు.

ఆ కేక జయశీలుడికి స్పష్టంగా వినిపించింది. తన ముందున్న మకరకేతు కూడా కనిపిస్తున్నాడు! అంటే నీటి అడుగున తను చూడగలుగుతున్నాడు; ధ్వనులు వినగలుగుతున్నాడు. ఏమిటి చిత్రం?

జయశీలుడు మతిపోయిన వాడిలా చప్పున మకరకేతు భుజం పట్టుకుని, "ఒరే, దుర్మార్గుడా! నువ్వు చేసిన







పనేమిటి? నిన్ను కావాలంటే ఎప్పుడో ప్రాణాలు తీసివుండేవాళ్ళం. అయినా అలా చెయ్యలేదు. అందుకు ప్రతిఫలంగా మమ్మల్ని నీటముంచి చంపదలిచావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు మకరకేతు బిగ్గరగా నవ్వి, "అబ్బా!" అంటూ పొట్టపట్టుకుని, "జయశీలా, నీ కేమన్నా మతి చాంచల్యం కలగలేదు గదా? మనం యిప్పుడు తామ్రపహాజంగల చెరువు నీటి అడుగున వున్నాం. మామూలుగా మనిషి అయినవాడు యింతలోతు నీటి అడుగున గాలి పీల్చగలడా? మాట్లాడగలడా? చూడగలడా?" అని ప్రశ్నించాడు.

"అవును, జయశీలా, ఏమిటి వింత! ఇదంతా ఆ మహాకాళుడి దయ," అంటూ సిద్ధసాధకుడు చుట్టూ కలయచూశాడు.

ఆ కొండ చెరువు అడుగున వున్న అనేక నీటిప్రాణులు వాళ్ళపక్కనుంచే ఈదుకుపోతున్నవి. వాటిలో పెద్ద పెద్ద చేపలు, మొసళ్ళు, పొతవాటి సర్పాలు— ఇలా అనేక జంతువులు వాళ్ళకంట బడినై. జలగ్రహం మాత్రం తల ఎత్తి సూటిగా ముందుకు దూసుకుపోతున్నది. ఎదురుగా ఒక చోట నీటి అడుగున వున్న పెద్ద కొండగుహలోంచి, నీరు మహా వేగంగా, ఉరవడితో వచ్చి పడుతున్నది.

మకరకేతు, "జలగ్రహా!" అని ఒక సారి తన వాహనాన్ని హెచ్చరించి, "జయశీలా, సిద్ధసాధకా! మాట్లాడరేం, ఆలోచిస్తున్నారా? నీటి అడుగున వుండి, మీ యిద్దరూ ప్రాణాలతో వుండటానికి కారణం అర్థమైందా?" అన్నాడు.

జయశీలుడు కత్తి దూసి, "ఆఁ, అర్థమైంది! నిన్నూ, నీ జలగ్రహాన్నీ అంటపెట్టుకు వున్నంత వరకూ, మామూలు మనుషులక్కూడా నీటిలో గాలి పీల్చుతూ బతగ్గలిగిన శక్తి వుంటుందన్న మాట!" అన్నాడు.

"బాగా గ్రహించావు! మరి కత్తి దూశావెందుకు?" అన్నాడు మకరకేతు.





"ఏ తల నరకటానికి! ముందు జల గ్రహాన్ని నీటిపైకి తీసుకుపోతావా, లేదా?" అన్నాడు జయశీలుడు.

సిద్ధసాధకుడు తన చేతిలో వున్న శూలాన్ని ఎత్తి, "జై, మహాకాళా! నీటి అడుగున మహాకాళుడికి. ఏ ప్రాణిని బలియిచ్చిన భక్తుడు యీనాటివరకూ లోకంలో వుండాడనుకోను. ఆ మహాదక కాళాన్ని నాక్కలిగించు, జయశీలా!" అంటూ, శూలాన్ని మకరకేతు పీకకు ఆనించాడు.

మకరకేతు నవ్వబోయి, శూలం మొన గుచ్చుకోవటంతో, చేత్తో దాన్ని కాస్త పక్కకు నెట్టి, "మహావీరుడికీ, మహాకాళుడి భక్తుడికీ ఇద్దరికీ మతులు పోయినై. నేను ఏ పరిస్థితుల్లోనూ జల గ్రహాన్ని నీటిపైకి నడిపి, తిరిగి మీకు బందీని కాను. బహుశా, మీ ఆజ్ఞ పాటించనందుకు మీరు, నా తల నరుకుతారు. ఆ మరుక్షణం మీ ఇద్దరికీ నీటిలో బతగ్గలిగిన శక్తి పోయింది. నలభై యాభై అడుగుల లోతున్న యీ నీటి అడుగు నుంచి మీరు ప్రాణాలతో పైకి తేలలేరు. బహుశా, ఆ తేలేవి మీ ఇద్దరి శవాలు మాత్రమే!" అన్నాడు.

జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ అతడి మాటల్లోని సత్యం అర్థంకాగానే, యిప్పుడు తాము మకరకేతుడికి బందీలమన్న వాస్తవం తెలిసి, భయంకలిగింది. కాని, చేయగలిగిందేమీ లేదు. జలగ్రహం కొంత





గుహ లోంచి వేగంగా బయటికి వస్తున్న నీటి కేసి పోసాగింది.

"మకరకేతూ! మా ఇద్దర్నీ బందీలుగా పట్టుకుని ఎక్కడికి తీసుకుపోతున్నావు?" అని అడిగాడు జయశీలుడు.

మకరకేతు జవాబు చెప్పబోయేంతలో ఒక పెద్ద మొసలి, ఒక చేపను తరుము కుంటూ వాళ్ళకేసి వచ్చింది. జయశీలుడు కత్తి దూసి మొసలిని పొడవబోయేంతలో మకరకేతు దానితోక పట్టుకుని కిందికీ మీదికీ గట్టిగా ఊపి, దూరంగా విసిరివేసి, "జయశీలా, మీ యిద్దరూ నాకు బందీలు కారు; నేనూ మీకు బందీని కాను. అదుగో, ఆ కనబడే గుహ నీటినుంచి జలగ్రహం పోయి, కొండ మీది జలాశయం చేర గానే—అక్కణ్ణించి మీ దారిన మీరు పోవచ్చు." అన్నాడు.

మకరకేతు మాట ముగించే లోపలే జలగ్రహం గుహ నీటిలో ప్రవేశించింది. ఇప్పుడు అంతా చీకటి. జయశీలుడు తాను ఏనుగు మీది నుంచి జారి, నీటిలో పడి కొట్టుకుపోకుండా, మకరకేతు నడుం పట్టుకున్నాడు. సిద్ధసాధకుడు, "హా, మహాకాళా, నువ్వే రక్ష!" అంటూ జయశీలుడి నడుం ఒడిసి పట్టుకున్నాడు.

నాలుగైదు క్షణాలకాలం గడిచీ గడవక ముందే జలగ్రహం కొండ మీది జలాశయాన్ని చేరింది. మకరకేతు ఆజ్ఞాపించ గానే అది అక్కడ నీటిమీదికి తేలి, తొండం ఎత్తి పెద్దగా ఘీంకరించింది.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒకసారి గట్టిగా గాలి పీల్చుకుని, ప్రాణాలతో బయటపడినందుకు సంతోషిస్తూ చుట్టూ కలయజూశారు. చుట్టూ ఎత్తుగా వున్న కొండ; మధ్య వున్న పల్లంలో నీరు. ఆ నీటిలోంచి ఒక పాయ కొండకు మరో వైపు నుంచి, వేగంగా ప్రవహించి పోతున్నది.

ఇదంతా చూసిన జయశీలుడికి చప్పున ఒక అనుమానం వచ్చింది. మకరకేతు మధ్య మధ్య, 'సరోవరేశ్వరా!' అంటూ అరుస్తూండేవాడు. ఆ సరోవరం యిదేనా?





అతననే సకోపరేశ్వరుడు యిక్కడే వుంటాడా?

జయశీలుడు యీ ప్రశ్న అడిగినప్పుడు మకరకేతు తల అడ్డంగా తిప్పి, ''జయశీలా! నీ ఊహ తప్పు. మా రాజు సకోపరేశ్వరుడుండే మాయాసరోవరం యిది కాదు. దాన్ని చూసిన మానవ మాత్రులెవరూ ప్రాణాలతో యీనాటి వరకూ, ఆ ప్రాంతాలను వదిలి రాలేదు.'' అన్నాడు.

''అయితే మమ్మల్ని అక్కడికి తీసుకుపోతున్నావా?'' అని అడిగాడు జయశీలుడు.



మకరకేతు నుంచి అవునన్న జవాబు వస్తే, అతణ్ణి శూలంతో పొడిచి చంపేందుకు సిద్ధసాధకుడు వెనకనుంచి అతడి వీపుకు శూలాన్ని గురిచేశాడు.

మకరకేతు అంతా గమనించి ఏమాత్రం తొణకకుండా, ''మీ యిద్దరిదీ తొందరపాటు స్వభావం. అరణ్యంలో అనవసరంగా నన్ను పట్టుకుని, యింత గొడవకూ కారణం అయినవాళ్ళు మీరు! డొక్కలో వున్న కత్తికి తోడు. ఆ బోయవాడి చేత భుజంలో బాణం కూడా కొట్టించారు. మీకు ఈత వచ్చుగదా? అంత రాకపోతే, కొండ మీది చెట్లూ అవీ నీటి వేగానికి కొట్టుకువస్తున్నవి. వాటిల్లో దేన్నయినా పట్టుకుని ప్రాణాలు కాపాడుకోండి.'' అని తృటికాలం ఆగి, ''జలగ్రహ!'' అంటూ కేక పెట్టాడు.

జయశీలుడు రానున్న ప్రమాదాన్ని గుర్తించి, సిద్ధసాధకుణ్ణి హెచ్చరించాడు. పీనుగు నీట మునుగుతూండగానే ఇద్దరూ చప్పున ఎగిరి ఈదుకుంటూ పోయి, నీటి వాలున పడి వస్తున్న ఒక పెద్ద చెట్టును పట్టుకున్నారు. వాళ్ళు నీట పడి లేస్తూ, దాని కొమ్మల మీదికి పోయే సరికి, చెట్టు బోదె మీద బోర్లా పడుకుని, ముందు కాళ్ళతో విరిగిన కొమ్మలను పట్టుకుని వున్న ఒక పెద్దపులి కంట బడింది.







వాళ్ళు పెద్దపులినీ, పులి వాళ్ళనూ ఒకేసారి చూడటం జరిగింది. పులి చప్పున వెనక కాళ్ళమీద లేచి, పెద్దగా అరుస్తూ కొంచెం దగ్గిరలో వున్న సిద్ధసాధకుడి మీదికి దూకబోయేవానిలా తోక ఆడించింది. సాధకుడు తన చేతిలోని శూలం ఎత్తబోయేంతలో జయశీలుడు అతణ్ణి వారించి, "సాధకా, జాగ్రత్త! అదీ మనలాగే నీటబడి ప్రాణం కాపాడుకునేందుకు యీ చెట్టుమీద చేరింది. శూలంతో పొడిచావో, మీద పడాలని చూస్తుంది. మీ గర్ధం కుమ్ములాటల్లో చెట్టు నీళ్ళల్లో మునిగిందంటే, అందరికీ నీటి గండమే!" అన్నాడు.

"అది నిజమే. కాని యీ తెప్పి పోయిన పులి!" అంటూ సిద్ధసాధకుడు శూలాల్ని గురి చేసి, దాని ముఖం కేసి తీవ్రంగా చూస్తూ, "జయశీలా, నేను తల తిప్పితే పులి మీద పడుతుందేమో! విన్నావా? ఈ నది దాపులనే ఎక్కడో దిగువనున్న పల్లంలోనికి. జలపాతంలా పడుతున్నట్టున్నది." అన్నాడు.

జయశీలుడు ఆశ్చర్యం, భయం సమ్మిళితమైన గొంతుతో, "సాధకా, మనం జలపాతపు నీటిలో చిక్కుకుని, ఇంత ఎత్తునుంచి ఎక్కడో కిందికి పడబోతున్నాం. ఇంకొక రెండూ, మూడు వందల గజాల దూరం, అంతే!" అన్నాడు.

సిద్ధసాధకుడు భయవిహ్వలుడైపోయి, "మనం కిందపడి నజ్జునజ్జయిపోక ముందే చెట్టును వదిలితే?" అన్నాడు.

"చెట్టు ఆధారంవల్ల మనం బతికే అవకాశం వున్నది. వదలకు!" అన్నాడు జయశీలుడు.

అంతలో పెద్దపులి పెద్దగా గాండ్రించి, సిద్ధసాధకుడి మీదికి దూకబోయింది. ఆ సరికి నీటి వేగం హెచ్చి, చెట్టు జుయ్యిఁ అంటూ పోయి జలపాతంలో చిక్కి, దాదాపు రెండువందల అడుగుల ఎత్తునుంచి, నీటితోపాటు కిందవున్న పల్లంలోకి పడింది.





తాము పట్టుకుని వున్న చెట్టు నీటిలో మునుగుతూ, తేలుతూ జలపాతం వెంట కిందికి పడుతూండగా. ఇది తమకీ లోకంలో ఆఖరి క్షణాలనుకుంటూ జయశీలుడూ, సిద్ధసాధకుడూ గట్టిగా కళ్ళు మూసుకున్నారు. జలపాతం పడే చోట వున్న పెద్ద అనేకమైన కొండ రాళ్ళున్నవి. చెట్టు మధ్య భాగం అలాంటి కొండరాయి మీద పడి, చెట్టు రెండుగా విరిగింది. ఒక భాగం మీద జయశీలుడూ, రెండవ భాగం మీద సిద్ధసాధకుడూ, చిక్కి వున్నారు.

కొంతసేపటికి జయశీలుడు కళ్ళు తెరిచి చూశాడు. అతడిప్పుడు నీటి అంచున వున్నాడు. నడుము నుంచి దిగువ భాగం నీటిలో తడుస్తున్నది. తల మాత్రం కొంచెం మెట్టప్రదేశాన వున్నది. దూరంగా జలపాతం ధ్వని వినిపిస్తున్నది.

"నేను బతికే వున్నానన్నమాట! కాళ్ళూ, చేతులూ సరిగా వున్నట్టా, విరిగినట్టా?" అనుకుంటూ జయశీలుడు పక్కకు కదిలాడు. కుడి మోచేయి బాగా నొప్పి పెట్టింది. నిదానంగా కాళ్ళను కదిలించి చూశాడు; కొంచెం బాధ కలిగింది.

"అదృష్టవంతుణ్ణి! అంత ఎత్తునుంచి పడి ప్రాణాలు పోగొట్టుకోకపోవటమేగాక, కాళ్ళూ, చేతులూ విరక్కుండా బయట పడ్డాను," అనుకుంటూ జయశీలుడు లేచి నిలబడి, కాళ్ళకూ, చేతులకూ తగిలిన



చిన్న చిన్న గాయాలకేసి ఒకసారి చూసుకుని, ఒడిలో కత్తిని సవరించుకుని, హఠాత్తుగా సిద్ధసాధకుడు జ్ఞాపకం రాగా, "సాధకుడెక్కడ?" అంటూ ప్రవాహం కేసి చూశాడు.

ప్రవాహం మధ్య అక్కడక్కడా చిన్నా, పెద్ద గండ రాళ్ళు చాలా వున్నవి. జయశీలుడు జలపాతం వెంట కిందపడిన చెట్టు భాగం, రెండు పెద్దరాళ్ళ మధ్య చిక్కుకుని వున్నది. కొంచెం దిగువగా విరిగిన రెండవ భాగం ఒడ్డుకువట్టి వున్నది. కాని, సిద్ధసాధకుడు మాత్రం కనిపించలేదు.

"సాధకుడు దురదృష్టవంతుడు! జలపాతంలోంచి కిందపడుతూనే, ఏ రాయికో కొట్టుకుని చనిపోయి వుంటాడు. శవం నదీ ప్రవాహంతో కొట్టుకుపోయి వుంటుంది." అనుకున్నాడు జయశీలుడు.

వెంటనే అతడికి ఎన్నో రోజులుగా తనకు మిత్రుడై కష్టాల్లో భాగం పంచుకున్న సాధకుడి మీద ఎంతో జాలి కలిగింది. సాధకుడి శవం నీళ్ళల్లో నాని, ఏ మొసళ్ళకో ఆహారం కాకముందే, దాన్ని వెతికి పట్టుకుని, తగిన విధంగా దహన సంస్కారం చేయాలనుకున్నాడు జయశీలుడు.

అతడు చప్పున కదిలి నది ఒడ్డున అల్లిబిల్లిగా పెరిగిన చిన్న చిన్న పొదల మధ్యగా దారి చేసుకుంటూ కొంతదూరం పోయేసరికి, హఠాత్తుగా పెద్దపులి అరుపు వినిపించింది. జయశీలుడికి జలపాతంలో చిక్కుకున్న పులి గుర్తుకువచ్చింది.

"సాధకుడు పులికి ఆహారం కాలేదు గదా?" అనుకుంటూ జయశీలుడు చప్పున కత్తి దూసి, ఆ ధ్వని వచ్చిన వైపుకు గబగబా నడిచాడు.

ఒకచోట సిద్ధసాధకుడు కదలా మెదలక నీటి ఒడ్డున పడివున్నాడు. వెనక కాళ్ళు రెండూ రాళ్ళ దెబ్బలకు విరిగిపోయిన పులి, చిన్నగా గాండ్రిస్తూ, ముందు కాళ్ళమీద పాకుతూ, సాధకుణ్ణి సమీపిస్తున్నది. —(ఇంకావుంది)





# మాయాసరోవరం

## 13

[కొండ చెరువులో మునిగిన ఖడ్గవర్మను, మకరకేతు కొండ మీది జలాశయంలోకి తీసుకుపోయి, అక్కడ జయశీలుణ్ణి, సిద్ధసాధకుణ్ణి వదిలి, ఖడ్గవర్మతోపాటు నీట మునిగాడు. జయశీలుడూ, సిద్ధసాధకుడూ జలపాతంలో చిక్కుకుని, దిగువకు పడ్డారు. స్పృహ కోల్పోయిన సిద్ధసాధకుణ్ణి, పులి ఒకటి సమీపిస్తూండగా జయశీలుడు అక్కడికి వెళ్లాడు. తరవాత-]

పులి నుంచి సిద్ధసాధకుడికి రానున్న ప్రమాదాన్ని గుర్తించి, జయశీలుడు వేగంగా పరిగెత్తుతూ, పులి తన ముందు కాళ్ళతో సాధకుడి తలను కొట్టబోయే సమయానికి, దాని దృష్టిని మరల్చేందుకు, "హాయ్!" అంటూ పెద్దగా అరిచి, సమయానికి చేతికందిన ఒక చిన్న రాయిని తీసుకుని దానిమీదికి గురిగా విసిరాడు.

ఆ సమయంలో జయశీలుడు ఇంకా పులికి ఇరవై ముప్పై అడుగుల దూరంలో ఉన్నాడు. మనిషి కేకతోపాటు, రాయి వచ్చి శరీరానికి తగలగానే పులి చప్పున తలతిప్పి వెనక్కు చూసింది. అదే అదనుగా జయశీలుడు వేగంగా ముందుకు పరిగెత్తి, అందుబాటులో ఉన్న పులి వెనక కాళ్ళను పట్టుకుని గుంజాడు. పులి ముందు కాళ్ళ మీద లేవబోయి,







పట్టు దొరకక, కోపంతో భీకరంగా గాండ్రించింది.

అప్పటివరకూ స్పృహలేకుండా పడి వున్న సిద్ధసాధకుడు తృళ్ళిపడి తల ఎత్తి, పులి కంటబడగానే, "జై, మహా కాళీ!" అంటూ అలవాటు ప్రకారం శూలం ఎత్తబోయాడు. కాని, శూలం చేతిలో లేకపోవటంతో, భయంకొద్దీ వెనక్కుపోబోయి నీటిలో పడ్డాడు.

ఈ లోపల జయశీలుడు, అది వెనక కాళ్ళు రెండూ విరిగిన పులి అని గ్రహించి, దాని విరిగిన కాళ్ళు పట్టుకుని దూరంగా లాగి, సిద్ధసాధకుడితో, "సాధకా! నీ దృష్టికి పులి తప్ప, దాని వెనకనే వున్న నేను కనిపించినట్టు లేదే!" అన్నాడు.

ఆ ప్రశ్న వింటూనే సాధకుడు నీళ్ళల్లో లేచి నిలబడి, "జయశీలా, నువ్వు యిక్కడే వున్నావా? జలపాతం నుంచి కిందపడటం వరకు తెలుసు; ఆ తరవాత ఏం జరిగిందీ నాకు తెలియదు. పులి అరుపుతో నాకు ప్రాణం తిరిగొచ్చింది," అన్నాడు.

"ఎలాగైతేనేం, ఇద్దరం ప్రాణాలతో వున్నాం." అని జయశీలుడు తల తిప్పి, దూరంగా నేల మీద పొర్లుతూ, చిన్నగా అరుస్తున్న పులి కేసి చూసి, "పాపం. జలపాతంలోంచి రాళ్ళ మీద పడి యీ పులి రెండు కాళ్ళూ విరగ్గొట్టుకున్నది. ఇక దీనికి ఆహారం సంపాయించే శక్తి లేదు. ఆకలితో కృశించి చచ్చేకన్న, యీ క్షణాన చావటమే దానికి హాయి." అంటూ కత్తి ఎత్తి పులి తల నరికేందుకు దాని కేసి కదిలాడు.

ఈ లోపల సిద్ధసాధకుడు కనిపించకుండాపోయిన తన శూలం కోసం వెతక సాగాడు. అది నీటి ఒడ్డున కొంచెం దిగువగా అతడికి దొరికింది. అతడు ఉత్సాహంగా శూలం పట్టుకుని జయశీలుడి కేసి బయలుదేరాడు. జయశీలుడు తలవంచి పులి కేసి చూస్తూ, "సాధకా,



యీ పులి మనకు చేసిన హాని ఏమీ లేదు గదా? దీన్ని చంపడానికి నాకు చేయి రావటం లేదు." అన్నాడు.

సిద్ధసాధకుడు, జయశీలుడి చేతి నుంచి కత్తి తీసుకుని, "ప్రాణాలతో నరక బాధపడే యీ పులికి, బాధా నివృత్తి చేస్తున్నాం. అలా చేయటం పుణ్యం!" అంటూ కత్తితో ఒక్క వేటుకు పులి తలను మొండెం నుంచి వేరుచేశాడు.

జయశీలుడు చుట్టూ ఓ మారు కలయ చూసి, "సాధకా, ఇప్పుడు మన ప్రయాణం ఎటువైపు? మన కాశీరాజుగారి పిల్లలను అపహరించుకుపోయినవాడి జంటను మనం వదిలేశాం. వాణ్ణి వదలవలసింది కాదు." అన్నాడు.

"జయశీలా, వాణ్ణి మనం వదిలామా లేక వాడే మనను వదిలించుకున్నాడో చెప్పటం కష్టం. ఆ జలగ్రహంతో పాటు మనం నీటిలో ఎంతకాలం జరగ్గలం? అయినా, ఇప్పుడు ఆలోచించవలసింది, జరిగిపోయినదాన్ని గురించి కాదు. మనం ఎలాంటి ప్రాంతానికి చేరాం? ఈ ప్రాంతాల ఎక్కడైనా మానవనివాసాలున్నవా? అది ప్రశ్న!" అన్నాడు సిద్ధసాధకుడు.

సిద్ధసాధకుడి ప్రశ్నకు జవాబా అన్నట్టు, అతడు మాట ముగించే లోపలే, నదికి దిగువనున్న గుబురుచెట్ల ప్రాంతాన్నుంచి ఒక మనిషి పెట్టిన చావు కేకా, కొండగొర్రె అరుపూ వినిపించినై.

"కొండగొర్రె మనిషిని పట్టిందా? లేక మనిషి కొండగొర్రెను పట్టాడా? ఇద్దరూ ప్రాణభయంతో అరిచినట్టుందే!" అన్నాడు సిద్ధసాధకుడు, ఆ ధ్వని వచ్చినవైపుకు తిరిగిచూస్తూ.

"సాధకా, ఆ ఇద్దర్నీ మరేదో బలమైన క్రూరమృగం పట్టినట్టున్నది! ఊఁ, పరిగెత్తు," అంటూ జయశీలుడు నది దిగువ కేసి పరిగెత్తాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ అలా కొంతదూరం వెళ్ళేసరికి, వాళ్ళకు భయా



శ్వర్యాలు కలిగించే దృశ్యం ఒకటి కంట బడింది. నీటి ఒడ్డున వున్న ఒక మహా వృక్షం కొమ్మ నుంచి, ఒక గొర్రెపొటేలూ, ఒక మరుగుజ్జుమనిషీ వేళ్ళాడుతున్నారు. చెట్టుకొమ్మలకు చాలా చిన్న చిన్న ఆకులున్నవి.

"ఇదేదో చాలా వింతగా వున్నది! కొమ్మ మీద ఏలాంటి ప్రాణీ లేదు. పొటేలునూ, మరుగుజ్జుమనిషినీ పైకి లాగుతున్న దెవరు?" అన్నాడు జయశీలుడు.

"ఆ పని చేస్తున్నది అదృశ్యంగా వున్న ఏదో పిశాచి! నా శూలంతో దాని గుండెల్ని చీల్చబోతున్నాను," అంటూ సిద్ధ సాధకుడు కొమ్మ కిందికి పోయి. శూలం ఎత్తబోయేంతలో మరొక చెట్టుకొమ్మ. అతడి కేసి వంగి భుజం పట్టుకున్నది.

ఎవరో బలమైన మనిషి ఒకడు తన భుజం పట్టుకుని పైకి గుంజబోయినట్టు అనుమానం కలగ్గానే సిద్ధసాధకుడు ఎగిరి ఇవతలికి ఒక్క గంతువేసి, "జయశీలా, జాగ్రత్తసుమా! ఇదేదో రాక్షసవృక్షం." అన్నాడు.

"రాక్షసవృక్షమో, పిశాచివృక్షమో నాకు తెలియదుగాని, ఇది అందుబాటులోకి వచ్చిన పశువులనూ, జంతువులనూ పట్టుకుతినే చెట్టు మాత్రం అవును," అంటూ జయశీలుడు ఒక్కఎగురునపోయి, కత్తితో మరుగుజ్జువాణ్ణీ, కొండగొర్రెనూ పట్టుకున్న చెట్టుకొమ్మను నరికాడు. వెంటనే కొమ్మకు వేళ్ళాడుతున్న యిద్దరూ దిగువనున్న నీళ్ళలో పడ్డారు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ గబగబా పోయి, నీటిలోపడిన మరుగుజ్జువాణ్ణి ఒడ్డుకులాగారు. గొర్రెపొటేలు గట్టుమీదికి ఎక్కి, ఒంటికిపట్టిన నీటిని ఒకటి రెండు సార్లు విదిలించుకుని. తలఎత్తి పెద్దగా అరిచింది.

"జయశీలా, ఇది మామూలు కొండ పొటేలు కాదు; దానికి సవారీ గుర్రానికి వున్నట్టు జీనూ, కళ్ళెమూ—అన్నీ వున్నవి." అన్నాడు సిద్ధసాధకుడు.







అప్పటివరకూ చావుభయం, ఆ తరవాత నీళ్లమునకతో వడవడ వణికిపోతున్న మరుగుజ్జువాడు, జయశీలుడూ, సిద్ధసాధకుల కేసి కళ్ళు చికిలించి చూస్తూ, "అయ్యా, తన సేనానాయకుణ్ణి, మనుషులను తినే చెట్టు నుంచి కాపాడినందుకు, మా గడేకారిరాణి తమకు తప్పక మంచి బహుమానం యిస్తుంది," అన్నాడు.

జయశీలుడు, మరుగుజ్జువాడి కేసి ఆశ్చర్యపోతూ చూసి, "ఈ ప్రాంతాలను పాలిస్తూ ఒక రాణీ, ఆ రాణీకి సైనికులూ, ఆ సైనికులకు పొట్టివాడు సేనానాయకుడూ వున్నారన్నమాట! వింతగా వుంది," అన్నాడు.

"జయశీలా, అన్నిటికన్నా వింత, యీ ప్రాణులను తినే చెట్టు. ఇలాంటి చెట్లు వున్నవని వినటమే తప్ప, యీనాటి వరకూ చూడలేదు," అంటూ సిద్ధసాధకుడు చెట్టు వెనక్కు వెళ్ళి, గట్టిగా చప్పట్లు చరుస్తూ, "జయశీలా, యీ రాకాసి చెట్టుది మామూలు ఆకలి కాదు; కుంభకర్ణుడి ఆకలి! ఇక్కడికొచ్చి చూడు, ఎన్ని జంతు, మానవ కంకాళాలు పడి వున్నవో," అన్నాడు.

జయశీలుడు, సిద్ధసాధకుడి దగ్గిరకు పోయి, దిగువున వల్లంలోనూ, పొదల మీదా చెల్లాచెదరుగా పడి వున్న చాలా కంకాళాలను చూశాడు. అలా చూస్తూ, అతడు చెట్టుకొమ్మల కిందికి వచ్చేసరికి, దిగువగా వున్న కొమ్మ ఒకటి జుయ్‌మంటూ వంగి, అతణ్ణి పట్టుకోబోయింది. జయశీలుడు చప్పున దూరంగా పరిగెత్తిపోయి, వింతపడుతూ చెట్టు కేసి చూడసాగాడు.

మరుగుజ్జు సేనాని, తన వాహనం అయిన కొండ పొట్టేలును కళ్ళెం పట్టుకుని నడుపుతూ, జయశీలుడూ, సిద్ధసాధకుల ముందుకు వచ్చి, "అయ్యా, నన్ను ప్రాణాపద నుంచి కాపాడి, గడేకారిజాతికి చాలా మేలు చేశారు. రండి, రాణిగారి దగ్గరకు వెళదాం," అన్నాడు.



ఆ మాటలకు సాధకుడు గట్టిగా విసుక్కుని, "ఛీ, ప్రాణాలు తీస్తుందని ఎరిగి వున్న చెట్టు నుంచి, నిన్ను నీవు కాపాడుకోలేని వాడివి, ఒక సేనానాయకుడివా? మీ రాణి మాకేం బహుమానం ఇస్తుంది? బహుశా ఇన్ని చిలకడదుంపలూ, ఒక సోలెడు వెదురు బియ్యమూ, అంతేనా? ఇక నీ దారిన నువ్వు పో, మా దారి మేం చూసుకుంటాం," అన్నాడు.

ఆ యీసడింపుకు మరుగుజ్జు సేనాని ముఖం చిన్నబుచ్చుకుని ఏం చేయటమా అని దిక్కులు చూసేంతలో, చెట్లచాటున పెద్ద కలకలం బయలుదేరింది. జయశీలుడూ, సాధకుడూ, ఆ ధ్వని వచ్చిన వైపుకు తలలు తిప్పారు. రెండు కొండ పొట్టేళ్ళను పూన్చిన రథం మీద జింక చర్మాలు ధరించి, కొంగ, నెమలి ఈకలు కలిపి కుట్టిన కిరీటం పెట్టుకున్న ఒక స్త్రీ వాళ్ళ కేసి వచ్చింది. ఆ రథం వెనకా, పక్కలా పొట్టేళ్ళను ఎక్కి, చేత బల్లాలను పట్టుకున్న చాలామంది మరుగుజ్జు వాళ్ళు వున్నారు.

వాళ్ళను చూస్తూనే మరుగుజ్జు సేనాని ముందుకు పోయి, "మహారాణీ!" అంటూ రథంలో వున్న మరుగుజ్జు స్త్రీకి వంగి నమస్కారం చేసి, ఆమెకు, జయశీలుణ్ణీ, సాధకుణ్ణీ చూపుతూ, "ఈ ఇద్దరూ నన్ను జీవభక్షకవృక్షం నుంచి కాపాడారు," అని చెప్పాడు.

మరుగుజ్జు రాణి రథాన్ని జయశీల, సిద్ధసాధకుల ముందు ఆపి, "ఓ, మహాకాయుల్లారా, రాత్రి నా కలలో కనిపించి, మా గడేకారియాతి శత్రువుల నందరినీ హత మార్చి, మాకు శాశ్వత రక్షణ కల్పిస్తామని మాట ఇచ్చిన వాళ్ళు, మీరే కదా?" అని అడిగింది.

"ఈ రాణీ ఏదో పెద్ద గడుసుపిండం లాగుందే! జయశీలా, మనం తగు జాగ్రత్తలో వుండాలి," అన్నాడు సాధకుడు మెల్లిగా, జయశీలుడితో.





"మంచి మాట చెప్పావు! పాపం, ఈ పొట్టి మనుషులకు ఎవరి నుంచి ప్రమాదం రానున్నదో! వీలైతే సాయం చేద్దాం." అన్నాడు జయశీలుడు.

ఆ మాటలకు సాధకుడు అయిష్టంగా ముఖం పెట్టి, "జయశీలా, మనం ఒక మహోన్నత కార్యం సాధించేందుకు బయలుదేరాం. ఆ సంగతే మరిచి, ఈ పిల్లిపెసర గింజలు వేరే పనుల్లో పడ్డామంటే, ఎందుకూ కొరగాకుండా పోతాం," అన్నాడు.

"సాధకా, కనకాక్షిరాజుగారి పిల్లల ప్రాణాల్లాంటివే, ఈ మరుగుజ్జు మనుషుల ప్రాణాలు కూడా. 'వీళ్ళకు ఎవరి నుంచి ప్రమాదం రానున్నదో విని చేతనైన సాయంచేయటం అన్నివిధాలా ధర్మం అనిపించుకుంటుంది." అన్నాడు జయశీలుడు.

జయశీలుడు మాట ముగించే లోపలే దాపులనున్న ఒక కొండ గుట్ట మీదినుంచి భయం గొల్పే అరుపు వినిపించింది. జయశీలుడితో పాటు అందరూ అటు కేసి తలలు తిప్పి చూశారు. పది పన్నెండు అడుగుల ఎత్తున్న వికృతాకారం ఒకటి గుట్టమీద నిలబడి వున్నది. అది రెండు చేతులతో ఒక పెద్ద బండరాయిని ఎత్తి పట్టుకుని వున్నది. దాని నడుముకు కట్టిన ఇనపగొలుసును ఒక చేత్తో పట్టుకుని, రెండవ చేతిలో కత్తి పట్టుకుని, ఒక మనిషి నిలబడి వున్నాడు.



ఆ వికృతాకారాన్ని చూస్తూనే, మరుగుజ్జురాణితో పాటు, ఆమె అనుచరులందరూ గడగడ వణికిపోసాగారు. అంతలో వికృతాకారం పక్కన నిలబడినవాడు, కర్రతో దాన్ని వెన్నుమీద గిచాడు. వికృతాకారం రాయిని అలాగే పట్టుకుని, అరుస్తూ అటూ యిటూ గెంతసాగింది.

జయశీలుడు, సిద్ధసాధకుడితో, "సాధకా, ఆ భయంకర జంతువును మచ్చిక చేసి ఆడిస్తున్నవాడు మరుగుజ్జు కాదు; మనలాంటివాడే! ఇది, ఏ జాతి జంతువై వుంటుంది?" అని, మరుగుజ్జు రాణితో, "మహారాణీ! మీకు శత్రువులన్నారే, వాళ్లు ఆ కనబడే భయంకర జంతువూ, దాని వెంటవున్న మనిషేనా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నతో రాణి కాస్త స్థిమితపడి, రథం దిగి జయశీల, సిద్ధసాధకుల ముందుకు వచ్చి, "మహాకాయుల్లారా, మా శత్రువులు, కొండ అవతల వున్న మాలాంటి పొట్టి జాతివాళ్ళే. కాని, వాళ్ళు తాము యక్షజాతి నుంచి ఉద్భవించామనీ, మా కన్న ఉన్నతులమనీ అహంకరించి, మమ్మల్ని నాశనం చేయ చూస్తున్నారు." అన్నది.

"అంత పెద్ద భయంకర ప్రాణిని మచ్చిక చేసినవాళ్ళు, మిమ్మల్ని ఏనాడో లొంగదీసుకుని వుండవలసిందే!" అన్నాడు సిద్ధసాధకుడు.

"మహాకాయుల్లారా! ఆ భయంకర జంతువు, నరవానరం. దానిచేత మా మీదికి రాళ్ళు విసిరిస్తున్నవాడు, మీలాంటి మనిషి. ఆ ఇద్దరూ పది పన్నెండు రోజుల క్రితమే. మా శత్రువులతో వచ్చి చేరారు," అన్నది మరుగుజ్జు రాణి.

రాణి మాట ముగించే లోపలే, నరవానరం ప్రళయ భయంకరంగా అరిచి, ఎత్తి పట్టుకుని వున్న బండరాయిని, కొండమీది నుంచి మరుగుజ్జు జాతి వాళ్ళ కేసి విసిరింది. —(ఇంకావుంది)







# మాయాసరోవరం

## 14

[జలపాతం నుంచి ప్రాణాలతో బయటపడిన జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒక మరుగుజ్జు వాణ్ణి, ప్రాణులను తినే చెట్టు నుంచి కాపాడారు. ఆ సమయంలో అక్కడికి మరుగుజ్జుజాతి వాళ్ళ రాణి వచ్చింది. ఆమె తమ శత్రువులను గురించి చెబుతున్నంతలో, కొండ మీది నుంచి ఒక భయంకర జంతువు, వాళ్ళ కేసి ఒక బండరాయిని విసిరింది. తరవాత—]

జయశీలుడూ, సిద్ధసాధకుడూ కొండ గుట్ట మీద వున్న భయంకర జంతువును గాక, దాని పక్కన నిలబడివున్న మనిషి కేసి ఆశ్చర్యపోతూ చూడసాగారు. జయశీలుడికి ఆ మనిషిని తానెక్కడో చూశానన్న అనుమానం బాధించసాగింది. అంతలో భయంకర జంతువు విసిరిన బండరాయి, వేగంగా వచ్చి, వాళ్ళు నిలబడివున్న చోటుకు చేరువై, ముప్పై అడుగుల దూరంలో దభీమంటూ నేల మీద పడింది.

మరుగుజ్జు వాళ్ళంతా భయకంపితులై పోయి, తమ పొట్టేళ్ళవాహనాలను అదిలించి, కొంచెం దూరంగాపోయి నిలబడ్డారు. మరుగుజ్జు రాణి కూడా కొంచెం ఎడంగాపోయి, జయశీల, సిద్ధసాధకులతో, "మహాకాయుల్లారా, ఆ భయంకర నరవానరం, దానిని మచ్చికచేసిన మహా







గాయుడూ పదిపన్నెండు రోజులుగా మమ్మల్ని నానాహింసా పెడుతున్నారు. అరణ్యంలోకి వేటకుపోయిన మా జాతి వాళ్ళు నలుగుర్ని. ఆ మహాకాయుడు చంపాడు కూడా. ఏ క్షణాన అయినా, మా శత్రుజాతివాళ్ళు, ఆరడి ఆసరాతో మా మీద దాడిచేయవచ్చు." అన్నది.

జయశీలుడికీ, సిద్ధసాధకుడికి గరికారి రాణి మీద చాలా జాలికలిగింది. ఆవిడా, ఆవిడ జాతివాళ్ళూ అయిన మరుగుజ్జు మనుషులూ ధైర్యవంతులనీ, సాహసికు లనీ తెలుస్తూనే వున్నది; కాని వాళ్ళు నరవానరాన్నీ, దాని వెంటవున్న మనిషిని చూసి భయభ్రాంతులవుతున్నారు.

"జయశీలా, ఆ నరవానరం పక్కన కత్తి పట్టివున్న వాడెవడో మనరాజ్యంవాడు కాడుగదా? కొంచెం జాగ్రత్తగా చూడు!" అన్నాడు సిద్ధసాధకుడు.

జయశీలుడికూ్కడా, నరవానరం వెంట వున్నవాడు ఫలానా అయివుండ వచ్చునన్న అనుమానం కలిగింది. కాని, వాడు తనలాగే యిన్ని అరణ్యాలూ, కొండలూ, నదులూ దాటి యిక్కడి కొచ్చే అవకాశం లేదు....

జయశీలుడు యిలా ఆలోచిస్తు న్నంతలో నరవానరం పక్కన వున్నవాడు, వానరాన్ని కత్తి పిడితో పొడిచి, ఏదో. ఆజ్ఞ యిచ్చాడు. నరవానరం గెంతుతూ పోయి దాపులనున్న ఒక బండరాయిని పైకెత్తేందుకు ప్రయత్నిస్తున్నది. కాని, రాయి చాలా పెద్దదవటంతో, దానికి ఒక పట్టాన ఎత్తటం సాధ్యంకాక, గింజు కుంటూ అరుస్తున్నది.

"సాధకా, వాడు మళ్ళీ మన కేసి బండరాయిని నరవానరం చేత విసిరించా లని చూస్తున్నట్టున్నది. పట్టపగలు అంత పెద్ద రాయిదెబ్బ నుంచి తప్పుకోవటం చాలా సులువని, ఆ బుద్ధిహీనుడికి తెలిసి నట్టు లేదు." అని, జయశీలుడు గరికారి రాణితో, "మీ వాళ్ళు అరణ్యంలో వేటా డేందుకు విల్లంబులను ఉపయోగిస్తారు







గదా? అలాంటి ఒక విల్లంబు వెంటనే తెప్పించు," అన్నాడు.

గడిశాని మరుగుజ్జులు సర్వసాధారణంగా బళ్ళాలతోనే వేటాడతారు. అది వాళ్ళ జాతి కట్టడి. ఆ కారణం వల్లనే, వాళ్ళకు గడిశాని జాతి అన్న పేరు వచ్చింది. కాని, వాళ్ళ సేనానాయకుడికి చాలా కాలం క్రితం అరణ్యంలో ఒకచోట పెద్దవిల్లూ, అయిదారు అంబులూ దొరికినై. వాటిని అతడు భద్రంగా దాచివుంచాడు. ఆ సంగతి మరుగుజ్జురాణికి తెలియదు.

జయశీలుడు విల్లంబుల సంగతి తేగానే మరుగుజ్జుసేనాని భయంగా ఒకసారి రాణి కేసి చూసి, ఏదో చెప్పబోయి భయంతో గొంతు పెగలక ఊరుకున్నాడు. అది గమనించిన సిద్ధసాధకుడు, అతడితో, "ఏమోయ్, మరుగుజ్జు యోధుడా! మాట్లాడేందుకే భయపడే నువ్వు, ఇక యుద్ధంలో సైనికుల్ని, పొట్టేలు రౌతుల్ని ఎలా నడిపించగలవు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు మరుగుజ్జుసేనాని వెలవెలపోతూ, రాణితో, "మహారాణీ! మన జాతివాళ్ళు విల్లంబులు అంటరాదన్న నియమం వున్నది. కాని, నేను నియమభంగం చేసి, అరణ్యంలో దొరికిన విల్లంబులను, నా ఇంట దాచివుంచాను," అన్నాడు.

మరుగుజ్జురాణి ఆ మాటలు వింటూనే రౌద్రం తెచ్చుకుని ఏమో అనబోయేంతలో, జయశీలుడు చేయెత్తి, ఆమెను శాంత పరుస్తూ, "రాణీ, నీ సేనాని చేసిన పని, మీ జాతివాళ్ళ దృష్టిలో ఎంత గొప్పనేరమో నాకు తెలియదు. కాని, ఆ విల్లంబులను తక్షణం తెప్పించావంటే, ప్రస్తుతానికి ఆ నరవానరం పీడ వదిలిస్తాను. తరవాత నేనే, నా విల్లంబులు తయారుచేసుకుని, ఆ మనిషినీ, వానరాన్నీ ఎలా హత మార్చాలో పథకం వేయగలను," అన్నాడు.

మరుగుజ్జురాణి మారుమాట్లాడకుండా, తన సేనానాయకుడి కేసి చూసింది. మరుగుజ్జుసేనాని వెంటనే తన వాహనాన్ని



అదిలించి, వేగంగా చెట్ల వెనక వున్న తన ఇంటి కేసి వెళ్ళాడు.

ఈలోపల నరవానరం మరొక బండ రాయిని ఎత్తి పట్టుకున్నది. దాని నడుముకు కట్టిన ఇనుపగొలుసును పట్టుకున్నవాడు, పెద్ద గొంతుతో అరిచి, కత్తిపిడితో దాని వీపు మీద కొట్టాడు. నరవానరం గిరుక్కున పక్కకు తిరిగి బండరాయిని వాడి మీదికి విసరబోయింది. ఈసారి వాడు కత్తిమొనను వానరం గొంతుకు ఆనించి, బిగ్గరగా కేక పెట్టాడు.

నరవానరాన్ని మచ్చికచేసినవాడి కేక, కొండగుట్ట దిగువున వున్న జయశీలుడినీ, అతడి వెంట వున్నవాళ్ళందరినీ విస్మయపరిచింది. జయశీలుడు చిన్నగా ఈలవేసి, "సిద్ధసాధకా! ఆ మనిషి ఎవడో యిప్పుడు నాకు తెలిసిపోయింది. వాడు, మీ హిరణ్యపురంవాడు కాదు; మా అమరావతీనగరం వాడు. నేను పుట్టి పెరిగిన నగరం వదిలి, దేశాలుపట్టుకుని, మీ హిరణ్యపురం చేరటానికీ, అక్కడినుంచి యిలా అరణ్యాల వెంట తిరగటానికీ—వాడే కారకుడు. వాడొకప్పుడు మా రాజు చంద్రసేనుడి దగ్గిర అశ్వదళనాయకుడు. వీడు కృపాణజిత్తు!" అన్నాడు.

ఆ మాటలకు సిద్ధసాధకుడు ఎక్కడ లేని ఆశ్చర్యం కనబరుస్తూ, "జయశీలా! యిది అద్భుతంగాదా! అమరావతీనగరం ఎక్కడ? ఈ మహారణ్యాలూ, యీ మరుగుజ్జుజాతి వాళ్ళూ ఎక్కడ? ఇంతకూ యిప్పుడు నువ్వేం చేయాలనుకుంటున్నావు?" అని అడిగాడు.

జయశీలుడు కొంచెంసేపు కొండగుట్ట కేసి చూస్తూ వూరుకుని, "సిద్ధసాధకా! తనను బాణంతో చావుదెబ్బ కొట్టినవాడెవడో తెలియకుండా కృపాణజిత్తు, యీ లోకాన్ని వదలటం నా కిష్టం లేదు. వాడు ఆ నరవానరంతో చేసిన పనే చేయిస్తున్నాడు. దానికి గుండ్రని బండరాళ్లు పదిలేపాటి శక్తి కూడా వున్నట్టు లేదు. పైగా, కోపం కొద్దీ అది తనను మచ్చిక





చేసినవాళ్ళే రాయితో కొట్టబోతున్నది.'' అన్నాడు.

జయశీలుడు యిలా మాట్లాడుతున్నంతలో, విల్లంబులు తెచ్చేందుకు పోయిన మరుగుజ్జు సైనాని, అక్కడికి తిరిగివచ్చి, పక్షులవాహనం దిగి, తాను తెచ్చినవాటిని జయశీలుడి పాదాలముందు పెట్టాడు. జయశీలుడు విల్లును పరీక్షించి చూశాడు; అది చాలా దృఢంగా వున్నది. దానితోపాటు ఆరు వాడిగల బాణాలు!

సిద్ధసాధకుడు ఆ విల్లంబుల కేసి చూసి, "జయశీలా! నీ శత్రువు ఆ కృపాణజిత్తునూ, నరవానరాన్ని అస్త్రం దెబ్బతో పరలోకానికి పంపబోతున్నావా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు జయశీలుడు నవ్వి, "సాధకా, ఇంతదూరాన్నుంచి ఆ యిద్దర్నీ బాణంతో గురిగా కొట్టటం అంత తేలిక అనుకుంటున్నావా? ఇవి మామూలు బాణాలు; బ్రహ్మాస్త్రాలో, నాగాస్త్రాలో కావు.'' అన్నాడు.

ఈ లోపల కొండగుట్ట మీద చిన్న కల్లోలం లేచింది. రెచ్చిపోయిన నరవానరం, తనను మచ్చికచేసినవాడి మీద ఎదురుతిరిగి, బండరాయితో వాణ్ణి కొట్టాలని చూడటం, వాడు కత్తిమొనతో దాన్ని మెల్లిగా పొడుస్తూ, అటూ యిటూ గెంతుతూండటం ప్రారంభమైంది. అంతలో అక్కడికి నలుగురైదుగురు మరుగుజ్జు వాళ్ళు తాళ్ళతో వచ్చి, కొంచెం దూరాన





వుంది. వాళ్ళు వినిరి నరవానరం కాళ్ళనూ, చేతులనూ బంధించారు. కాని, నరవానరం రాయి కింద పడవేసి యింకా పెనుగు లాడుతూనే వున్నది.

మరుగుజ్జుసేనాని అది చూసి ఉత్సాహంగా జయశీలుడితో, "అయ్యా, ఆ భయంకర జంతువును చంపటానికి యిదే మంచి సమయం. బాణం వదలండి." అన్నాడు.

మరుగుజ్జురాణి కూడా అవునన్నట్టు తలవూపి, "వెంటవున్న మనిషిని చూసి కాక, ఆ నరవానరాన్ని చూసే మేం ఎక్కువ భయపడుతున్నాం. దాని అడ్డు తొలగించా వంటే, ఆత్మాహంకారంతో మమ్మల్ని నాశనం చేయాలని చూస్తున్న గడెకొండ దుష్టుణ్ణీ, వాడి అనుచరులనూ, ఒకటి రెండు రోజుల్లో హతమార్చగలం," అన్నది.

జయశీలుడికి మాత్రం ఇంతదూరా న్నుంచి, కొండగుట్ట మీద వున్న వాళ్ళను బాణంతో గురిగా కొట్టటం సాధ్యంగా కనిపించలేదు. అయినా శత్రువులకు భయంతోపాటు, తాను ఆ ప్రాంతానికి వచ్చావన్న సంగతి కృపాణజిత్తుకు తెలపటం, యుద్ధ ధర్మం అనిపించు కుంటుందని అతను కొంత ముందుకు పోయి, అక్కడవున్న ఒక ఎత్తయిన రాయి మీద నిలబడి కత్తిదూసి పైకెత్తి పట్టుకుని, "ఏమరా కృపాణజిత్తూ! ఇదుగో, నేను జయశీలుణ్ణి—వచ్చాను," అంటూ పెద్దగా కేకపెట్టాడు.

ఆ కేకను కొండగుట్ట మీదవున్న వాళ్లు వినిపించుకున్నట్టులేదు. కృపాణజిత్తుతో పాటు, మిగతా మరుగుజ్జువాళ్ళు, నర వానరాన్ని అదుపులోకి తెచ్చుకునేందుకు నానా అవస్థపడుతున్నారు. కృపాణజిత్తు, వానరం నడుముకు బిగించిన ఇనుప గొలుసును బలంగా పట్టుకుని వెనక్కు లాగుతూంటే, మరుగుజ్జు వాళ్ళు, దాని కాళ్ళకూ, చేతులకూ తగిలించిన తాళ్లను ముందుకులాగుతున్నారు. వానరం భయంకరంగా అరుస్తూ, విడిపించుకునేందుకు పెనుగులాడుతున్నది.

కత్తి ఎత్తి నిలబడివున్న జయశీలుడి దగ్గిరకు సిద్ధసాధకుడూ, మరుగుజ్జు రాణీ వచ్చారు. సిద్ధసాధకుడు, జయశీలుణ్ణి, "జయశీలా! రాణీ, ఆమె సైనికులు కూడా తమ శత్రువులను హతమార్చేందుకు యిదే మంచి అదనుగా భావిస్తున్నారు. నరవానరాన్ని తాళ్ళతో కట్టి లాగుతున్న వాళ్ళలో రాణికి ముఖ్య శత్రువైన గడెకొంద అనేవాడు కూడా వున్నాడట! అక్కడి మరుగుజ్జువాళ్ళలో తల మీద రాబందు ఈకలు కట్టుకున్న వాడు కనిపిస్తున్నాడా?" అని అడిగాడు.

జయశీలుడు ఓసారి కొండగుట్ట మీది వాళ్ళల్లో ప్రతి ఒక్కణ్ణీ పరీక్షగా చూశాడు. వాళ్ళల్లో సిద్ధసాధకుడు చెప్పిన గుర్తులుగల వాడున్నాడు. వాడు గడెకొంద దప్పమాట! వాడు రాణికి శత్రువేమోగాని, యీ క్షణంవరకూ తనకు మాత్రం శత్రువు కాదు. తన శత్రువు కృపాణకేతు! తను కొట్టదలిస్తే, బాణంతో వాణ్ణే కొట్టాలి....

అలా ఆలోచిస్తూ, జయశీలుడు విల్లంబు పైకెత్తి తల తిప్పి చూశాడు. దాపుల్లో చాలా మంది పొట్టేలు కోతులూ, వాళ్ళ వెనగ్గా బల్లాలు చేతబట్టిన మరుగుజ్జు సైనికులూ, కొండగుట్ట ఎక్కేందుకు సిద్ధంగా నిలబడి వున్నారు.

జయశీలుడు, మరుగుజ్జురాణి కేసి చూసి, "రాణీ, మీ వాళ్ళంతా యుద్ధ సన్నద్ధులైనట్టుందే! ఒక్క బాణం దెబ్బతో నేను నరవానరాన్నీ, నువ్వానే మహా



కాయుడైన మనిషిని చంపలేను గదా? నా బలం పర్చిపడగానే, నీ శత్రువులు తగు జాగ్రత్తలో వుంటారు. వాళ్ళతో యుద్ధానికి యిది మంచి సమయం అవునో కాదో ఆలోచించు," అన్నాడు.

మరుగుజ్జువాని, నీ అభిప్రాయం ఏమి టన్నట్టు తన సేనాని కేసి చూసింది. మరుగుజ్జు సేనాని తన వాహనం మీద ధీమాగా బల్లెం ఎత్తి పట్టుకుని జయశీలుడితో, "అయ్యా, మీరు ఆ దుర్మార్గుల కేసి బాణం కొట్టండి. చాలు! ఇంత వరకూ మా శత్రువులు, బల్లెంపోటు ఎలాంటిదో తప్ప, బాణం దెబ్బ ఎరగరు. మీ బాణంపోటు తగలగానే వాళ్ళు భయ కంపితులైపోతారు. అది అవకాశంగా తీసుకుని మేము దాడిచేసి, వాళ్ళను ఆ కొండగుట్ట అవతలికి తరిమి కొడతాము. సాధ్యమైతే వాళ్ళుండే గూడెం మీద పడి, దానికి నిప్పు పెడతాము," అన్నాడు.

"సరే, సేనానీ! నీకున్న ఉత్సాహంలో కత్తి పట్టిన మనిషిని, నరవానరాన్ని కూడా మరిచిపోతున్నావు. అయినా, నీ శక్తి, నీ తోటి సైనికుల శక్తి ఎలాంటిదో చూడాలనివుంది," అన్నాడు జయశీలుడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు శూలం ఎత్తి, "జయశీలా! యిదే మంచి సమయం. బాణం వదులు. నరవానరం కట్టుతాళ్ళు తెంచుకుని, ఒక మరుగుజ్జువాణ్ణి పట్టుకున్నది." అంటూ కేకపెట్టాడు.

జయశీలుడు బాణం ఎక్కుపెట్టి, నరవానరం కేసి వదిలాడు. బాణం రివ్వు మంటూపోయి వానరం నడుముకు తగిలింది. మరుక్షణం అది భీకరంగా అరిచి, తన చేతికి దొరికిన మరుగుజ్జువాణ్ణి, కొండగుట్ట కిందికి విసిరివేసింది.

మరుగుజ్జువాడు ప్రాణభయంతో గినుముంటూ గాలిలో కొట్టుకుని వస్తుండగా, మరుగుజ్జు సేనానాయకుడు తన అనుచరులను హెచ్చరించాడు. గొర్రెపొట్టేలు రౌతులూ, కాలిభటులూ కేకలువేస్తూ, బల్లాలు ఎత్తి పట్టుకుని కొండగుట్ట మీదికి పరిగెత్తసాగారు. —(ఇంకా వుంది.)





# మాయాసరోవరం

## 15

[మరుగుజ్జు రాణికి శత్రువైన గడెకొండ, అనేవాడు నరవానరాన్ని అదుపు చేసేందుకు పాటుపడసాగాడు. ఆ సమయంలో జయశీలుడు, నరవానరం వెంట వున్నవాడు తన శత్రువు కృపాణజిత్తు అని గుర్తించాడు. జయశీలుడు బాణంతో నరవానరాన్ని కొట్టగానే, మరుగుజ్జు సేనాని తన భటులంతో, శత్రువులున్న కొండగుట్ట మీదికి దాడికయి బయలుదేరాడు. తరవాత—]

మరుగుజ్జురాణి సైనికులు కొండగుట్ట మీదికి రావటం చూస్తూనే, రాణి శత్రువైన గడెకొండ, గుట్ట వెనుక భాగంలో వున్న తన అనుచరులను పైకి రావలసిందిగా ఆజ్ఞాపించాడు. అతడి మరుగుజ్జు అనుచరులు బల్లాలు చేతబట్టి, కేకలు పెడుతూ కొండగుట్ట మీదికి రాసాగారు. నరవానరాన్ని తాళ్ళతో కట్టి అదుపులోకి తెచ్చుకునేందుకు కృపాణజిత్తూ, మరి కొందరు మరుగుజ్జులూ నానాప్రయాస పడుతున్నారు.

జయశీలుడు గుట్ట మీదికి వస్తున్న గడెకొండ అనుచరుల కేసి చూసి, సిద్ధసాధకుడితో, "సాధకా, మనం రాణీ సైనికులకు సాయపడకపోతే, ఆ విధ శత్రువులు, వాళ్ళను తేలికగా ఓడించగలరు. కృపాణజిత్తును చూశావా? వాడు ఆటవికుడిలా వేషం ధరించాడు. అయినా







నేను వాణ్ణి గుర్తించాను; వాడూ నన్ను గుర్తించి వుండవచ్చు." అన్నాడు.

సిద్ధసాధకుడికి కూడా తాము స్వయంగా వెళ్ళి, రాణి సైనికులకు సహాయపడటం అవసరమనిపించింది. అతడు రాణి కేసి తల తిప్పి, "రాణీ, నువ్వు యిక్కడ వుండటమే క్షేమం. మేము, నీ సైనికుల వెంట పోయి, నీ శత్రువైన గడెకొండడితో పాటు, మా శత్రువైన కృపాణజిత్తును కూడా హతమార్చి వస్తాం." అన్నాడు.

సాధకుడు మాట ముగించేలోపలే నరవానరం భయంకరంగా అరిచింది. ఆ అరుపు వింటూనే జయశీలుడూ, సాధకుడూ కొండగుట్ట కేసి తలలు తిప్పారు.

ఇప్పుడు నరవానరాన్ని కృపాణజిత్తు ఒక్కడే నడుముకు బిగించిన గొలుసుతో పట్టుకుని వున్నాడు. అది నిటారుగా నిలబడి గుట్ట దిగువకేసి చూసి, భుజాలు చరుచుకుంటూ అరుస్తున్నది.

"సాధకా, నరవానరం మళ్ళీ వాడి అదుపులోకి వచ్చినట్టున్నది. ఈ సారి ఆ జంతువు రాయి విసరటం జరిగితే, రాణి సైనికుల్లో సగం మందికి చావుమూడినట్టే. ఊం, పద!" అంటూ జయశీలుడు గుట్ట కేసి పరిగెత్తాడు. సిద్ధసాధకుడు అతణ్ణి అనుసరించాడు.

ఇద్దరూ వేగంగా గుట్ట మీదికి కొంత దూరం పరిగెత్తి, మరుగుజ్జు సేనానిని చేరి, అతడితో, "సేనానీ, నీ భటుల్ని కొంచెం ఆగమను. వానరం తిరిగి మీ మీదికి రాళ్ళు విసిరే ప్రమాదం వున్నది." అన్నారు.

"అయ్యా, మీరు ఆ భయంకర జంతువు నుంచీ, వెంట వున్న మహాకాయుణ్ణుంచీ మాకు హాని కలక్కుండా చూడండి. మేము పోయి అక్కడ గుట్ట మీద నిలబడివున్న గడెకొండ దుర్మార్గుణ్ణి, వాడి అనుచరులనూ బళ్ళాలకు గుచ్చి, కొండ కిందికి విసిరివేస్తాం." అన్నాడు మరుగుజ్జు సేనాని.

"ఆహా, నీ మాట పలుకు, నీ చేతి బళ్ళెం మొన అంత వాడిగానే వున్నది. కాని, నువ్వు తలచినదంతా తలచినట్టు





చేయటానికి దేవతవో, రాక్షసుడివో కాదు; మరుగుజ్జు మనిషివి! తెలిసిందా?" అన్నాడు సిద్ధసాధకుడు కోపంగా.

జయశీలుడు శాంతించమన్నట్టుగా సాధకుడి కేసి చేయి చూపాడు. అంతలో నరవానరం ఒక బండరాయిని ఎత్తి పట్టుకున్నది. అది చూసి సిద్ధసాధకుడు విసుక్కుంటూ, "ఛీ, ఛీ! ఈ వానరానికి రాళ్ళు విసరటం తప్ప, మరే విద్యా చేతనైనట్టులేదు. నా శూలంతో ఒక్కపోటుపొడిచి, పీడ విరగడ చేస్తాను," అంటూ శూలం పైకెత్తి, వేగంగా వానరం కేసి బయలుదేరాడు.

సాధకుడు దుస్సాహసం చేయబోయి, ప్రాణం మీదికి తెచ్చుకుంటాడని గ్రహించిన జయశీలుడు, సాధకుణ్ణి ఆగమని, బాణం ఎక్కుపెట్టి వానరం కేసి వదిలాడు. బాణం గురి తప్పి, కృపాణజిత్తు చేతిలో వున్న ఇనుపగొలుసుకు తగిలింది. ఆ దాటికి గొలుసు అతడి చేతినుంచి జారి కింద పడింది. వెంటనే వానరం రాయిని కింద పడవేసి పారిపోబోయింది. కాని, కృపాణజిత్తు చప్పున గొలుసు పట్టుకుని, నరవానరాన్ని వెనక్కు గుంజాడు. ఆ క్షణంలోనే అతడు తన మీదికి బాణం వదిలినవాడు, తన శత్రువైన జయశీలుడని గుర్తించాడు.

కృపాణజిత్తు భయాశ్చర్యాలతో వణికిపోయాడు. ఆ నిమిషం వరకూ అతడికి, ఆ వచ్చినవాళ్ళు ఎవరో మామూలు





"అయ్యా మహారాజా! మీ ఆజ్ఞను కాదనను. కాని, మీరు నరవానరంతో ఒక్క ఊపున పోయి పడి, ఆ విల్లంబులు పట్టినవాణ్ణి చంపలేరా? మేము ఆ సమయంలో దుష్టరాజు సైనికులందరినీ, మా బల్లాలతో నిలువునా చీల్చి చెండాడగలం." అన్నాడు.

ఆ మాటలకు కృపాణజిత్తు కళ్ళెర్రచేసి, నరవానరాన్ని గుట్ట దిగువకు లాక్కుపోతూ, "గడెకొండా, నీ వేమైనా, నీ తలలో వున్న ఈకలజాతి పక్షివైన రాబందు అనుకున్నావా. అలా గాలిలో ఎగిరిపోయి వాళ్ళ మీద పడటానికి? వాళ్ళను చంపే ఉపాయం వేరే వున్నది. ముందు అందరూ ప్రాణాలతో గూడేనికి పారిపోయి రండి. తెలిసిందా?" అన్నాడు.

గడెకొండ తన అనుచరులకు కొండ గుట్ట దిగి గూడేనికి పరిగెత్తమని ఆజ్ఞ యిచ్చాడు. ఆ వెంటనే అతడి పొట్టేళ్ళ రౌతులూ, బల్లాలు పట్టుకున్నవాళ్ళూ వెనుదిరిగి, గుట్ట దిగువ కేసి బయలుదేరారు. శత్రువులు పారిపోతున్నారని చూస్తూనే జయశీలుడు, మరుగుజ్జు సేనానితో, "సేనానీ, యిదే నీకు మంచి అవకాశం. అందిన శత్రువుల మీద బల్లాలు ప్రయోగించు. అందనివాళ్ళ మీద గుట్ట మీది నుంచి రాళ్ళు దొర్లించి, ఎంత

మనుషులని తప్ప, జయశీలుడని తెలియదు. సిద్ధసాధకుణ్ణి అతడెన్నాడూ చూసి వుండలేదు.

"గడెకొండా! ఇది శత్రువులను హతమార్చటానికి తగిన సమయం కాదు. ఆ విల్లంబులు పట్టినవాడు దూరం నుంచే మన ప్రాణాలు తీయగలడు. నరవానరం జంతువు గనక, బాణం తగిలినా నిలబడగలిగింది. మనమైతే ఆ దెబ్బకు నేల కొరిగేవాళ్ళం," అన్నాడు కృపాణజిత్తు, నరవానరాన్ని కొండగుట్ట వెనక్కు మళ్ళించే ప్రయత్నం చేస్తూ.

గడెకొండ, జయశీల, సిద్ధసాధకుల కేసి ఓమారు చూసి, కృపాణజిత్తుతో,







మందిని పరలోకానికి పంపగలడో చూడు," అని హెచ్చరించాడు.

శత్రువులు వెన్నిచ్చి పారిపోతూండటం మరుగుజ్జు సేనానికి మరింత ధైర్యాన్ని కలిగించింది. అతడు తన భటులను పెద్దగా హెచ్చరించి, "ఒరే, వీర శూర గదాధారి భటులారా! బెబ్బులుల్లా, కొదమ సింగాల్లా ముందుకురికి, గడెకొండ ముఠా వాళ్ళను బల్లాలతో పొడవండి. భయంకర జంతువు పారిపోతున్నది. దాని భయం మనకికలేదు," అన్నాడు.

తమ నాయకుడి మాటలతో మరుగుజ్జు భటులందరూ ఉత్సాహం పొంది; పెద్దగా కేకలు పెడుతూ గుట్ట మీదికి పోయారు. అక్కడ వాళ్ళకు పారిపోతున్న గడెకొండ పొట్టేలు రౌతులూ, ఒళ్ళెం భటులూ కొందరు చిక్కారు. భటులు వాళ్ళను బల్లాలతో పొడిచి, ఏటవాలుగా వున్న గుట్ట కిందికి దొర్లించసాగారు.

మరుగుజ్జు సేనాని బల్లెం ఎత్తి పట్టుకుని, తన పొట్టేలు వాహనాన్ని, గుట్టమీద అటూ యిటూ పరిగెత్తిస్తూ, వాళ్ళను ఉత్సాహపరుస్తున్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఆ సమయంలో అక్కడికి వెళ్ళారు. వాళ్ళకు కొండగుట్ట దిగి పారిపోతున్న గడెకొండ అనుచరులతో పాటు, పరవానరాన్ని



ముందుండి లాక్కుపోతున్న కృపాణజిత్తు కూడా కనిపించాడు.

సిద్ధసాధకుడు శూలం ఎత్తి పట్టుకుని, "జై, మహాకాళా!" అంటూ కొండలూ, గుట్టలూ దద్దరిల్లేలా కేకపెట్టి, "జయశీలా, అలా చూస్తావేం? పద. ఆ గడెకొండ మరుగుజ్జు నివసించే గూడెం, గుట్ట కింద చెట్లచాటున కనిపించేది. పోయి హఠాత్తుగా మీదపడి, కృపాణజిత్తునూ, వాడి అండె కొతిసి, గడెకొండగాడి మరుగుజ్జుల్ని చీల్చి చెండాడదాం," అన్నాడు.

సిద్ధసాధకుడి మాటలకు జయశీలుడు చిన్నగా నవ్వి, "సాధకా, శత్రుబలాన్ని చులకన చేయటం ప్రమాద కారణం



అవుతుంది. వాళ్ళను యిక్కడ గుట్ట మీద హడలకొట్టి పారిపోయేలా చేయటం వేరు: సూటిగాపోయి వాళ్ళ ఇళ్ళ మీద పడి చంపాలని ప్రయత్నించటం వేరు. పైగా మనకు యీ గడెకొండ అనుచరులైన మరుగుజ్జులను చంపవలసిన అవసరం కూడా లేదు. వాళ్ళకూ, మరుగుజ్జురాజుకీ ఏదైనా రాజీ కుదిర్చే ప్రయత్నం చేద్దాం. అదే ఆలోచిస్తున్నాను. నువ్వు తొందర పడకు," అన్నాడు.

"మరి మన శత్రువైన శ్వేతజిత్తు మాటేమిటి? వాడు మచ్చికచేసిన నరవానరం సంగతేమిటి? దాని సాయంతో ఆ దుర్మార్గుడు, యీ చుట్టుపక్కల వెయ్యి కోసుల ప్రాంతానికి చక్రవర్తి కాగలడే! మనం యిదంతా చూస్తూ ఎలా వూరుకోవటం?" అన్నాడు సిద్ధసాధకుడు.

జయశీలుడు ఏదో జవాబివ్వబోయేంతలో మరుగుజ్జు సేనాని అతడి ముందుకు వచ్చి, "అయ్యా, మీ సెలవై, మీ సహాయం కూడా వుంటే—అప్పుడే గుట్ట దిగిపోయి, గడెకొండ గూడెం మీదపడి శత్రువుల్ని దుంపనాశనం చేస్తాం. ఏమిటి మీ ఆజ్ఞ?" అన్నాడు.

జయశీలుడు చుట్టూ ఓమారు కలయ చూసి, "సేనానీ, నీ ధైర్యసాహసాలు మెచ్చదగినవి. ఇక్కడ అందినంతమంది శత్రువులను చంపావు. మిగిలినవాళ్ళూ, నరవానరం వాళ్ళ గూడెం చేరుతున్నారు. ఇప్పుడు వాళ్ళు తగుహెచ్చరికలో వుంటారు. మనం దాడిచేయటం అనవసర రక్తపాతానికి తప్ప, మన విజయానికి సహాయపడకపోవచ్చు," అన్నాడు.

"అయితే యిప్పుడు మమ్మల్ని ఏం చేయమని తమ ఆజ్ఞ?" అని అడిగాడు మరుగుజ్జు సేనాని.

"అందరూ గుట్ట దిగి మీ రాజు దగ్గిరకు వెళ్ళండి. తరవాత మీ గూడేనికి తగిన రక్షణ ఏర్పాటుచేసుకోండి. మన ఆలోచన లాంటిదే శత్రువులకు కూడా కలిగివుండ

వచ్చు. వాళ్ళు హఠాత్తుగా మీద పడకుండా తగు జాగ్రత్తలో వుండండి. మేం ఇద్దరం త్వరలోనే మీ గూడెనికి వస్తాం." అన్నాడు జయశీలుడు.

మరుగుజ్జుసేనాని తన భటుల్లో ఒకణ్ణి, జయశీల, పెద్దసాధకులకు దారి చూపేందుకు అక్కడ వదిలి, తతిమ్మావాళ్ళతో విజయధ్వానాలు చేస్తూ, కొండగుట్ట కింద మరుగుజ్జురాణి వున్న చోటుకు బయలుదేరాడు.

జయశీలుడు కదలా మెదలక గడి కొండ గూడెం కేసి చూస్తూ నిలబడ్డాడు. పెద్దసాధకుడు అతడి కేసి కొంచెం సేపు చూసి, "జయశీలా! ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? మనం అనవసరంగా ఈ మరుగుజ్జు వెధవల మధ్య వచ్చి పడటం, మనదే తప్పు. మనం బయలుదేరిన పనేమిటి?" అన్నాడు.

"మనం రావాలని ఇక్కడికి వచ్చి పడలేదు, సాధకా! అందుక్కారణం ఆ మొసలి ఆకారం దుష్టుడు మకరకేతు! మనం జలపాతంలో చిక్కుకుని, కొండ మీది నుంచి ప్రాణాలతో ఇక్కడికి చేరాం. అపహరించబడ్డ హిరణ్యపురం రాజు కనకాక్షుని పిల్లల్ని తిరిగి తెచ్చేందుకు బయలుదేరిన మనం, ఇలా అరణ్యవాసుల తగవుల మధ్య చిక్కుకు పోవటం ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఏమైనా, మనం ఈ ప్రాంతం నుంచి బయలుదేరి పోయే లోపల, ఆ శృపాణి చిత్తును మాత్రం



నరలోకానికి పంపి తీరాలి," అన్నాడు జయశీలుడు.

"మహాకాళుడి దయవల్ల ఆ పనితో పాటు, వాడి వెంటవున్న క్రూరమృగాన్ని కూడా చంపి, చర్మం వలిపించాలి. ఇక పద, శోషవచ్చేటంత ఆకలిగా వుంది. మరుగుజ్జు రాణి గూడేనికి చేరదాం." అంటూ సిద్ధసాధకుడు వెనుదిరిగి బయలుదేరాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ యిలా కొండగుట్ట మీద మాట్లాడుకుంటూ వుండగా, దిగువునవున్న చెట్లచాటున నిలబడి మరుగుజ్జు గడెకొండా, కృపాజిత్తూ తమకు కలిగిన ఓటమికి నువ్వే కారణం అంటూ, ఒకరి నొకరు నిందించుకోసాగారు.

"అయ్యా మహాకాయా! మీది భారీ శరీరమే కాని, దానికి సరితూగే భారీ గుండెబలం మాత్రం మీలో లేదు. మాకన్న మీరే ముందుగా పారిపోయే ప్రయత్నం చేశారు. మీరు మచ్చికచేశామని చెప్పే, యీ నరవానరం మిమ్మల్నే చంపే ప్రయత్నం చేసింది," అన్నాడు గడెకొండ.

ఆ మాటలకు కృపాజిత్తు గట్టిగా పళ్ళు కొరికి, "ఒరే, గుడ్డిగాండ్రా! నేను శత్రువుల నుంచి పారిపోలేదు; సమయం కాదని తిరోగమించాను—అంతే! నాకేసి బాణం కొట్టిన జయశీలు డనే పరమ శత్రువును రేపు సూర్యోదయం లోపల చంపకపోతే, నా పేరు కృపాజిత్తు కాదు, నకృజిత్తు! ఇక నా నరవానరం సంగతా? అది కోతిపిల్లలా నే చెప్పినట్టు విని తీరుతుంది. అందుకు రుజువు..." అంటూ నరవానరానికి, గడెకొండను చూపి, చేతులు ఊపాడు.

నరవానరం మెరుపులాపోయి గడెకొండను ఎత్తి పట్టుకుని, భయంకరంగా అరవసాగింది. తమ యజమాని ప్రాణాపాయస్థితిలో వున్నాడని చూస్తూనే, గడెకొండ అనుచరులు బల్లాలు ఎత్తి, కేకలు వేస్తూ నరవానరం, కృపాజిత్తుల మీదికి రాసాగారు. —(ఇంకావుంది)







# మాయాసరోవరం

## 16

[జయశీలుడు వదిలిన బాణం వరాహానికి తగలగానే, కృపాణజిత్తు కొండగుట్ట దిగువకు చూసి, ఆ బాణం వదిలినవాడు తన శత్రువైన జయశీలుడని గుర్తించాడు. ఆ వెంటనే అతడు గడికొండ అనుచరులతో కలిసి, వాళ్ళ గూడెం కేసి పారిపోయాడు. గడికొండ అతణ్ణి హేళన చేయగా, కృపాణజిత్తు తన నరవానరాన్ని అతడిపైకి ఉసికొల్పాడు. తరవాత—]

గడికొండ అనుచరులు ఆయుధాలెత్తి పట్టుకుని తన మీదికి రావటం చూసి, కృపాణజిత్తు భయకంపితుడయ్యాడు. వాళ్ళెంత మరుగుజ్జులైనా, తాను ఒంటరి గాడు! తమ నాయకుడి రక్షణ కోసం వాళ్ళు చావటానికైనా సిద్ధంగా వున్నట్టు కనిపించారు.

కృపాణజిత్తు చప్పున ఒక నిశ్చయానికి వచ్చి, చిరునవ్వు నవ్వుతూ తనను చుట్టుముట్టుతున్న మరుగుజ్జుల కేసి చూసి, "తొందరపడకండి. నేను మీ మిత్రుణ్ణి. నరవానరాన్ని నేనెంత బాగా మచ్చిక చేశానో మీ నాయకుడికి చూపేందుకు, అతణ్ణి పట్టుకోమన్నాను," అంటూ వానరం చేతుల్లో వున్న గడికొండను విడిపించాడు.

గడికొండ ప్రాణభయంతో వణికి పోతూ, దూరంగా వున్న ఒక గుడిసె







ముందుకు పోయి, అక్కడ వున్న ఎండు మోడు మీద కూర్చున్నాడు. అతడి అనుచరులందరూ అతడి చుట్టూ చేరి, ఇప్పుడేం చేయమంటావని అడిగారు. ఎక్కడినుంచో వచ్చిన ఆ మహాకాయుడి సహాయం కోరి, తాను మొదటికే ముప్పు తెచ్చుకున్నానని, ఆ సరికి గడెకొండ గ్రహించాడు.

అతడు తలఎత్తి తన అనుచరులందరి కేసీ ఓసారి చూసి, చిన్న గొంతుతో, "ఒరే, నే చెప్పేది జాగ్రత్తగా వినండి. ఆ ఏనుగు శరీరం వాడు, తన వానరం పక్కనే నిలబడి, మనం ఏం చేయబోతున్నామో అని గుడ్లు మిటకరించి చూస్తున్నాడు. వాడితో ముఖాముఖీ కలబడి మనం జయించలేం. వాడి నుంచి, ఆ వానరాన్ని, కత్తిసి వేరు చేయాలి. అప్పుడు మనలో కొందరం చచ్చినా, వాణ్ణి చంపి పీడ విరగడ చేసుకోవచ్చు," అన్నాడు.

"బాగానే వుంది. మరి ఉపాయం ఏమిటి?" అని అడిగాడొక మరుగుజ్జు.

"ఈ మహాకాయుడు వచ్చిం తరవాత గడెకారి రాణి మనందర్నీ తేలిగ్గా నాశనం చేయగలుగుతుందే! ఇప్పుడా దుర్మార్గురాలికి ఇద్దరు రాకసుల్లాంటి వాళ్ళు సాయం కూడా వున్నారు," అన్నాడు మరొక మరుగుజ్జు.

గడెకొండ ఆ ప్రశ్నించిన వాళ్ళ కేసి కోపంగా చూస్తూ, "ఒకవేళ చావు తప్పక పోతే మన జాతివాళ్ళ చేతుల్లోనే చద్దాం. అంతేకాదు—మనమంతా గడెకారి రాణి దగ్గిరకు పోయి, ఇక నుంచి విధేయులుగా వుండి సేవ చేస్తామంటే, ఆమె మనసు క్షమించకపోదు," అన్నాడు.

"ఆ పని ఇప్పుడే చేద్దాం, పదండి!" అంటూ ఒకడు పెద్దగా గొంతెత్తి అరిచాడు.

గడెకొండ అందుబాటులో వున్న కర్ర తీసుకుని ఆ అరిచినవాణ్ణి ఒక్క బాదు బాదాడు. దూరంగా వుండి అంతా చూస్తున్న కృపాణజిత్తు, గడెకొండ తన





అనుచరులతో ఒక్కసారిగా వచ్చి తన మీద పశాలని ప్రయోగం చేస్తున్నాడని అనుమానించి. నరవానరాన్ని తాడుతో లాక్కుంటూ వాళ్ళ దగ్గరకు వస్తూ, "ఇప్పుడు మీరు చేస్తున్న కుట్ర ఏమిటి? హఠాత్తుగా వచ్చి మీదపడి, నన్ను చంపాలని చూస్తున్నారా? నిజం చెప్పండి!" అంటూ పళ్ళు కొరికాడు.

గడెకొండ తన అనుచరులందరినీ నిశ్శబ్దంగా వుండమన్న సూచనగా చేయి చూపి, ఎండుమోడు మీద లేచి నిలబడి, "అయ్యా, మహాకాయా! మేం చేస్తున్న కుట్ర మరేం లేదు. ఇప్పటి పరిస్థితి ఎలా వున్నదంటే, అటు గడెకారి రాణి గాని, కావాలనుకుంటే మీరు గాని, మా అందర్నీ శూలాలమీద హతమార్చ గలరు. అందుకని, సూర్యాస్తమయానికి ముందే, యీ గూడెం వదిలి, దూరంగా అరణ్యంలో ఎక్కడికైనా పారిపోదా మనుకుంటున్నాను," అన్నాడు.

గడెకొండ యిలా అనగానే, కృపాణ జిత్తు బెదిరిపోయాడు. అతడికి యీ గూడెం చేరే ముందు అరణ్యంలో ఒంటరిగా పడిన బాధలన్నీ గుర్తుకువచ్చినై. ఈ సమయంలో, ఎంత అల్పులైనా యీ మరుగుజ్జుల సాయం లేకపోతే, తన ప్రబల శత్రువైన జయశీలుడు తేలిగ్గా తనను, యీ అరణ్యాల్లో, కొండల్లో వేటాడగలడు!

కృపాణజిత్తు యిలా ఆలోచించి, గడెకొండతో ఎంతో మర్యాదగా, "గడెకొండా,





కేకపెడుతూ, నరవానరాన్ని కత్తిపిడితో గట్టిగా కొట్టాడు.

నరవానరం బాధతో, కోపంతో పెద్దగా అరిచి, కోరల్లాంటి తన పళ్ళను బయట పెట్టి, కృపాణజిత్తును వడిసి పట్టుకునేందుకు చేయి చాపబోయి, అతడి చేతిలోని కత్తి చూసి చప్పున ఒకడుగు వెనక్కు వేసింది.

గజకొండ తృప్తిగా తలాడించి, "ఆయుష్మ మహాగాదరా! మీరు, మీ పెంపుడు వానరాన్ని మరి కాస్త దయగా చూస్తే, అది మధ్య మధ్య మీ పైన ఎదురు తిరక్కుండా వుంటుంది." అన్నాడు.

"ఈ సేవక జంతువును దయగా చూడటమా? ఛీ, ఛీ! అలాఅయితే అది శిబాల మీద నాకు యజమానైపోతుంది. ఈ లోకంలో దెబ్బకు భయపడని ప్రాణి అంటూ ఏమీ లేదు. సరే, మా ఇద్దరి ఆహారం మాటేమిటి? నేను, నా కుటీరానికి పోతున్నాను." అంటూ కృపాణజిత్తు బయలుదేరాడు.

"అంతా అక్కడ సిద్ధంగా వున్నది." అన్నాడు గజకొండ.

కృపాణజిత్తు, గూడెంలోని తతిమ్మా ఇళ్ళకు కొంచెం ఎడంగావున్న తన నివాస స్థానాన్ని సమీపించి, వెనుదిరిగి పెద్ద గొంతుతో, "సూర్యాస్తమించే వరకూ,

నీకు నా నుంచి మేలు తప్ప, ఏ హానీ కీడు జరగదు. నీ శత్రువైన రాణినీ, ఆమెకు సహాయం వచ్చిన నా శత్రువులిద్దర్నీ, తిరిగి సూర్యోదయం లోపల ఆ పరలోకానికి పంపుతాను. ఇవ్వాళ నడిరాత్రి వేళ, మీలో కొందరు నాకు సాయంగా వచ్చి, ఆ రాణీ వుండే గుడిసెనికి ముందుండి దారి తీయండి. నీ నా శత్రువులందర్నీ, నిద్రలో వున్న వాళ్ళను నిద్రలో వుండగానే నేనూ, నా నరవానరం కాలరాచేస్తాం. తరవాత నువ్వు, కంటి కానేంత దూరంలో వున్న కొండలకూ, అరణ్యాలకూ రాజువు: తెలిసిందా? జై, గజకొండ మహారాజుకూ!" అని

నా కెప్పుడూ నిద్రాభంగం కలిగించలేదు. రాత్రల్లా మేలుకునుండవలసి వస్తుంది. సరిగా నడిచేయి శత్రుసంహారం!" అన్నాడు.

గడెకొండ యూసాని మరింత తృప్తిగా తలాడించి, "ఆ నరవానరం, వాణ్ణి ప్రమాద సమయంలో ఆదుకోక: తప్పక పారిపోయి తీరుతుంది. ఇక వాడి కత్తి సంగతి: దాన్ని ముందుగా మనం లాగేసుకోవాలి." అని చుట్టూచేరిన అనుచరులకు చెప్పి, వాళ్ళల్లో నమ్మకస్తులూ, ధైర్యవంతులూ అయిన నలుగురిని, తన గుడిశెకు తీసుకుపోయాడు.



ఆ తరవాత రెండు మూడు గంటల కాలంగడిచిపోయింది. బాగా తిని గుడిశెలో గురకపెట్టి నిద్రపోతున్న కృపాణజిత్తు, హఠాత్తుగా నిద్రమేల్కొని, "ఏమిటబ్బా, యీ మాదెవాసన?" అంటూ చుట్టూ కలయచూసి, "ఎవర్రా బయట! ఏదో కుళ్ళిన ఆముదం వాసన వస్తున్నదేమిటి?" అంటూ కేకపెట్టాడు.

ఆ వెంటనే బయటినుంచి, "అయ్యా మహాకాయా! అది ఆముదం వాసన కాదు; వేప చముదులో మేలిమి బంగారంలాటి తెల్లనువ్వుల నూనె కలిసిన చముదు వాసన. క్రిమికీటకాలూ, దోమలూ రాత్రి వేళ తమకు నిద్రాభంగం కలిగించకుండా వుండేందుకు, మా నాయకుడు తమ కుటీరాన్ని కప్పిన తాటిఆకుల్ని, యీ నూనెతో తడపమన్నాడు." అని ఒక గడెకొండ అనుచరుడు జవాబిచ్చాడు.

"అలాగా! మంచిది, మంచిది." అంటూ కృపాణజిత్తు పెద్దగా ఆవులించి, తిరిగి కళ్ళు మూసుకున్నాడు. గుడిసె మధ్య వున్న గుంజకు బలమైన ఇనుప గొలుసుతో బంధించబడిన నరవానరం మాత్రం, ఆ వాసనను భరించలేక, గొలుసును తెంచుకుని పారిపోయే ప్రయత్నంలో అటూ యిటూ గిరికీలుకొడుతూ గింజుకో సాగింది.

కృపాణజిత్తు ఒళ్లుమరిచి నిద్రపోతున్న గుడిసె ముందుకు గడెకొండ కొందరు



అనుచరులతో వచ్చాడు. తమ నాయకుడు సైగచేయగానే ఒక మరుగుజ్జు నిశ్శబ్దంగా గుడిసె ద్వారం తెరిచి లోపలికి పోయి, కృపాణజిత్తు గోడకు ఆనించిన కత్తిని తీసుకుని బయటికి వచ్చేశాడు.

గడెకొండ ఆ కత్తిని అటూ యిటూ తిప్పిచూసి, "ఆ మహాకాయుడి నిద్ర మత్తు గుడిసె కాలి మీద పడితేగాని వదలదు. ఈ కత్తిని మనం మోయగలమేమో కాని, ఆయుధంగా ఉపయోగించలేం. దీన్ని ఎక్కడైనా దాయండి." అని తిరిగి కత్తిని తన అనుచరుడికిచ్చాడు.

ఆ తరవాత ముందు వేసిన పథకం ప్రకారం గడెకొండ అనుచరులు బళ్ళాలు పట్టుకుని అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో కొందరు పొట్టేలుపోతులు కూడా వున్నారు. గడెకొండ అందరికేసి ఓసారి చూసి, "ఇక మన వంతే. ఆ దుర్మార్గుడైన మహాకాయుడి చావో తేలిపోవాలి. గుడిసెకు అన్నివైపులా నిప్పు పెట్టండి. వాడు ప్రాణాలతో బైటికి వస్తే, బళ్ళాలతో పొడవండి. నరవానరం బహుశా ఇనపగొలుసు తెంచుకుని బయటికి రాలేదు. అది అక్కడే మంటల్లో కాలి చస్తుంది!" అన్నాడు.

తమ నాయకుడిలా అనగానే మరుగుజ్జు భటుల్లో నలుగురు మండుతున్న కాగడాలు తీసుకుపోయి గుడిసెకు అన్ని వైపులా నిప్పు పెట్టారు. బాగా చమురుతో తడిసి వున్న తాటి ఆకుల గుడిసె, ఒక్కసారిగా భగ్గుమంటూ ముట్టుకుని, పెద్ద పెద్ద మంటలు పైకిలేచినై.

ఒకటి రెండు క్షణాలు గడిచే లోపలే నిద్రపోతున్న కృపాణజిత్తుకు శరీరమంతా భగ్గుమన్నట్టయి మెలుకువ వచ్చింది. అతడు కళ్ళు తెరిచి చూస్తూనే, తానున్న గుడిసె కాలిపోతున్నట్టు గ్రహించి, ప్రాణభయంతో ఒక్క చావుకేక పెట్టి, "మోసం! మోసం! ఇందుకు ప్రతీకారం చేస్తాను!" అని గంతులు వేస్తూ, తన కత్తి కోసం గోడ కేసి చూశాడు. కత్తి వుండవలసిన చోట లేదు.

కృపాణజిత్తు వడవడ వణికిపోతూ ఏమి చేయటమా అని ఆలోచించేలోపలే, కాలిన తాటి ఆకు ఒకటి కప్పుమీది నుంచి జారి అతడి మీద పడింది. నరవానరం భీకరంగా ఒక్క అరుపు అరిచి, బలంగా గుంజేసరికి, దాని నడుముకు కట్టి వున్న ఇనుప గొలుసు తెగిపోయింది. అది కృపాణజిత్తును పట్టుకోబోయినదల్లా, చుట్టూ కమ్ముకు వస్తున్న మంటలకు జడిసి, బంధించి వున్న గుడిశె ద్వారం కేసి పరిగెత్తింది.

ఇక తనకు చావు తప్పదన్న భయంతో కృపాణజిత్తు సాహసించి నరవానరం నడుమునుంచి వేళ్ళాడుతున్న తెగిన ఇనుప గొలుసును పట్టుకున్నాడు. వానరం ఒక్క ఊపునపోయి, ద్వార బంధాలను విరగకొట్టి, బయటికి దూకింది. కృపాణజిత్తు కూడా దాని నడుము నుంచి వేళ్లాడుతూ పోయి గుడిశె ముందు దొర్లి పడిపోయాడు. ఆ సమయంలో ఇనుప గొలుసు అతడి చేతి పట్టునుంచి జారిపోయింది.

హఠాత్తుగా నరవానరం, దాని వెనకగా కృపాణజిత్తూ కాలుతున్న గుడిసె నుంచి ప్రాణాలతో బయటపడటం చూసి గడికొండా, అతడి అనుచరులూ భయకంపితులైపోయారు. కాని, ఇప్పుడు కృపాణజిత్తు నిరాయుధుడు; నరవానరం వీలు దొరికితే అరణ్యాల్లోకి పారిపోయేందుకు ఎప్పుడూ ప్రయత్నిస్తూనే వున్నది!



గడికొండ చప్పున ధైర్యం తెచ్చుకుని, పారిపోజూస్తున్న తన అనుచరులను హెచ్చరిస్తూ, "ఒరే, నరవానరాన్ని దాని దారిన దాన్ని పోనివ్వకండి. ఈ దుర్మార్గుణ్ణి మాత్రం వదలకండి. బల్లాలతో పొడవండి." అంటూ కేకపెట్టాడు.

మరుగుజ్జుభటులకు తమ నాయకుడి హెచ్చరికతో కొంత గుండెనిబ్బరం కలిగింది. కాని, అంతలో నరవానరం పెద్దగా అరుస్తూ పోయి మరుగుజ్జుభటులను అందినవాళ్ళను అందినట్టు పట్టుకుని, అటూ యిటూ విసిరివేయసాగింది. వాళ్ళల్లో కొందరు అక్కడినుంచి పారిపోయేందుకూ, మరికొందరు తెగించి నరవానరాన్ని బల్లాలతో పొడిచేందుకూ ప్రయత్నించసాగారు.

ఈ గందరగోళం కృపాణజిత్తుకు మంచి అవకాశం కలిగించింది. అతడు ఏదైనా ఆయుధం దొరుకుతుందా అని చుట్టూ కలయచూసేసరికి, ఒకచోట పొడవాటి ఎండుచెట్టు కొమ్మ కనిపించింది. అతడు చప్పున దాన్ని చేతికి తీసుకుని, భీకరంగా ఒక కేకపెట్టి, పోయి గడికొండ అనుచరులను ఎడా పెడా కొట్టసాగాడు.

గడికొండా, అతడి మరుగుజ్జులు కూడా ప్రాణాలకు తెగించి, సాహసంతో కృపాణజిత్తును ఎదుర్కొని తమ బల్లాలతో గాయపరచసాగారు.

మరుగుజ్జువాళ్ళ గూడెంలో రేగుతున్న మంటలూ, పొగతోపాటు; అక్కడినుంచి వస్తున్న అరుపులూ, కేకలూ—దాపుల నున్న అరణ్యంలో ఇద్దరు వింతమనుషులు విన్నారు. వాళ్ళు గుర్రాల రూపంలో వున్న రెండు అద్భుత జంతువులను ఎక్కి వున్నారు. ఆ జంతువుల శరీరాలు చేప పొలుసుల లాంటి పొలుసులతో కప్పబడి వున్నవి. చూడగా వాటి ఆకారాలు మకరకేతు వాహనమైన జలగ్రహాన్ని పోలి వున్నవి. రౌతులిద్దరూ సాంబరు చర్మంతో కుట్టిన దుస్తులు ధరించి వున్నారు. వాళ్ళ నడుముల నుండి పొడవాటి కత్తులు వేళ్ళాడుతున్నవి. —(ఇంకా వుంది)







మీద నిలబడి, ఎగిరి అందుబాటులో వున్న చెట్టుకొమ్మను పట్టుకుని వేళ్ళాడుతూ గూడెం కేసి చూసి, "అన్నా, ఇదేదో బహు చిత్రంగా వున్నది. భయంకరమైన నరవానరం ఒకటి, ఒక మామూలు మనిషీ కలిసి, మరుగుజ్జు వాళ్ళను చిత్రవధ చేసేస్తున్నారు. చూస్తూ ఊరుకోవటం ఎలా?" అన్నాడు.

"అలాగా! అయితే ఆ నరవానరాన్నీ, మనిషినీ ప్రాణాలతో పట్టుకోవటం అవసరం. వాడి ద్వారా తప్పిపోయిన మనవాడి సమాచారం ఏమన్నా తెలుస్తుందేమో!" అంటూ సర్పనఖుడు తన గుర్రాన్ని అదిలించి, జీను నుంచి చుట్టలా వేళ్ళాడుతున్న తామరకాడల మోకును చేతికి తీసుకున్నాడు.

ఇద్దరూ తమ గుర్రాల మీద వేగంగా గరికొండ గూడాన్ని చేరేసరికి, నరవానరం గంతుతూ, తన బలమైన చేతులతో పట్టి గుడిసెలను కూలదోస్తున్నది. కృపాణజిత్తు పిచ్చిఎత్తిన వాడిలా అరుస్తూ, తన పైకి వస్తున్న మరుగుజ్జులను చెట్టుకొమ్మలతో కొడుతున్నాడు.

"అన్నా, నేను నరవానరం సంగతి చూస్తాను; నువ్వు ఆ ఎనుబోతులాంటి మనిషిని పట్టి బంధించు," అంటూ సర్పస్వరుడు తన గుర్రాన్ని నరవానరం కేసి పరిగెత్తించాడు.

సర్పనఖుడు తామరకాడల మోకును పైకెత్తి, దాని ఉచ్చును కృపాణజిత్తు కంఠానికేసి విసురుతూ, "మాయా నగోపరేశ్వరుడుకీ, జై!" అంటూ అరిచాడు.

వింతగుర్రాల మీద, హఠాత్తుగా తమ మీదికి వచ్చి పడిన సర్పనఖ, సర్పస్వరులను చూస్తూనే, మరుగుజ్జులూ, కృపాణజిత్తూ నిశ్చేష్టులైపోయారు. సర్పనఖుడు విసిరిన తామరకాడల తాడు కృపాణజిత్తు కంఠానికి చుట్టుకున్నది. దాని ఉచ్చు కంఠాన్ని బిగించి పట్టేలోపల కృపాణజిత్తు ఒక చావు కేకపెట్టి, "అయ్యో,



నన్ను చంపకు! నీలాంటి మనిషి— ఒక వింత ఏనుగునెక్కిన మహాబలుడికి, నేను లోగడ చాలా సహాయం చేసి వున్నాను." అన్నాడు.

ఆ మాటలకు సర్పసఖుడు ఆశ్చర్య పోతూ, "అయితే, నీకు మకరకేతు తెలుసునన్నమాట! అంత గొప్ప యోధుడు నీ నుంచి సహాయం కోరాడంటే, అతడు చాలా పెద్ద యిక్కట్టులలో చిక్కి వుండాలి. ఆ మకరకేతు యిప్పుడెక్కడ వున్నాడు?" అని అడిగాడు.

కృపాణజిత్తు చేతులు రెండూ ముందుకు చాచి, "తమ ప్రశస్తమైన తామరతాడల లాటి ఉచ్చు, నా గొంతును బాగా బిగించి పట్టి వున్నది. మాట్లాడటం కష్టసాధ్యమవుతున్నది. కొంచెంగా వదులు చేసేందుకు అనుమతిస్తారా?" అని అడిగాడు.

"అలాగే అనుమతిస్తాను. పారిపోయేందుకు ప్రయత్నించావా, ఆ తాడు నీ పాలిటి యమపాశమవుతుంది." అన్నాడు సర్పసఖుడు.

కృపాణజిత్తు తామరతాడల తాడును రెండు చేతులతో పట్టుకుని, ఉచ్చును కాస్త పక్కకు లాగి, గట్టిగా ఓసారి గాలి పీల్చుకుని, "అయ్యా, ఆ మకరకేతు యిప్పుడెక్కడున్నాడో నాకు తెలియదు. మిమ్మల్ని చూసిన తరవాత యిప్పుడు సంగతి సందర్భాలన్నీ తేటతెల్లమవుతున్నై. ఇప్పటికి కొద్దిరోజుల క్రితం అమరావతీనగరం ప్రభువైన జయశీలుడనే వాడూ, వాడి మిత్రుడైన కాపాలికుడొకడూ, మకరకేతును అరణ్యంలో నానా హింసలపాలూ చేశారు. ఈ సంగతి నేను అరణ్యప్రాంతాల నివసించే వాళ్ళ ద్వారా విన్నాను," అన్నాడు.

ఆ జవాబుకు సర్పసఖుడు కళ్ళెర్ర చేసి, "ఒరే, మాయలమారి! నేనడిగిన దేమిటి? నువ్వు చెపుతున్నదేమిటి? మకరకేతుకు ఏదో సాయం చేశానని



చెప్పావు. అతడిప్పుడెక్కడున్నాడని అడిగాను. నువ్వు అర్థంలేని మాటలతో కాలయాపన చేస్తావెందుకు?'' అన్నాడు.

కృపాణుజిత్తు ఆ వనవాసి ప్రాణాపద నుంచి బయటపడేందుకు మకరకేతు తనకు తెలుసునన్నాడుగాని, నిజానికి ఆతడు మకరకేతును చూసింది కూడా లేదు. అయితే, అతడు అరణ్యాల్లో తిరుగుతున్నప్పుడు. అక్కడ నివసించే పల్లెవాసుల ద్వారా మకరకేతును గురించి కొంత విని వున్నాడు.

ఈసారి ఏలాంటి అబద్ధం యింకొకటి చెప్పి, ప్రాణ రక్షణ చేసుకుందామా అని కృపాణుజిత్తు ఆలోచించేంతలో, మరుగుజ్జు వాళ్ళంతా ఒక్కసారిగా గొల్లుమన్నారు. సర్పనఖుడు కోపంగా తల తిప్పి వాళ్ళకేసి చూశాడు. గడెకొండ వంగి ఆతడికి నమస్కారం చేసి, ''అయ్యా, నిటి గుర్రం కూరుడా! మీరు యీ దుర్మార్గుడితో మాట్లాడుతూ, తమ తోటివాడికేమైనదీ గమనించని లేదు,'' అన్నాడు.

గడెకొండ యిలా అనేసరికి సర్పనఖుడికి చెప్పిన తన తమ్ముడైన సర్పస్వరుడి మాట గుర్తుకొచ్చింది. వాడు తల తిప్పి అటూ యిటూ చూసి, ''ఒరే, తమ్ముడూ, సర్పస్వరా ఎక్కడ? ఆ సర వానరం ఏమైంది?'' అని కేకపెట్టాడు.

రెండు మూడు క్షణాలు చూసినా తన తమ్ముడి నుంచి జవాబు రాకపోయేసరికి సర్పనఖుడు పళ్ళు కొరుకుతూ మరుగుజ్జుల కేసి చూశాడు. వాళ్ళందరూ తలలు వంచుకుని నేల చూపులు చూస్తున్నారు.

''ఒరే మందమతి మరుగుజ్జు వెధవల్లారా! అలా మొదలు నేళ్ళాడవేసి చూస్తారేం? ఏం జరిగింది?'' అని మరుగుజ్జులను గద్దించి అడిగాడు సర్పనఖుడు.

గడెకొండ తల ఎత్తి, ''నిటి గుర్రం కూరుడా! నీ తమ్ముడూ, నరవానరం







కలిసి అలా ఆ కనబడే చెట్ల గుంపు కేసి పోయారు. నీటి గుఱ్ఱం మరొక వైపుకు దౌడు తీసింది. ఆ వానరం యీ కృపాణ జిత్తు అనే దుర్మార్గుడి పెంపుడు జంతువు. అది వీడు చెప్పకుండానే వీడి మనో భావాలను గ్రహించి—ఆజ్ఞలు నెరవేరుస్తుంది. నీ తమ్ముణ్ణి వెంట పట్టుకుని ఎత్తి, భుజాన వేసుకుని అరణ్యంలోకి పారిపోమ్మని, నరవానరాన్ని వీళ్ళ సంజ్ఞల ద్వారా ఆజ్ఞాపించి వుంటారు." అన్నాడు.

"ఓరీ, చావు కబురు ఎంత చల్లగా చెప్పావురా, మరుగుజ్జా వెధవా!" అంటూ సర్పనఖుడు బాధగా కేకపెట్టి, కృపాణజిత్తు కంఠానికి వేసిన తామర కాడల తాడును గడెకొంత చేతికి యిస్తూ, "ఈ దుర్మార్గుడు పారిపోకుండా చూసే బాధ్యత నీది: ఆ నరవానరాన్ని చంపి, నా తమ్ముణ్ణి యిప్పుడే విడిపించుకు వస్తాను," అంటూ జలాశ్వాన్ని అదిలించి, వేగంగా గడెకొంత చెప్పిన చెట్ల గుంపు కేసి పరిగెత్తించాడు.

మరుగుజ్జుల గూడెంలో ఇళ్ళు తగలబడుతూ లేచిన పొగా, కృపాణజిత్తూ, నరవానరాలతో గడెకొంత అనుచరులు తెగించి పోరాడుతున్నప్పుడు రేగిన కల్లోలం, వాళ్ళుగుట్ట అవతల వున్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ విన్నారు. దానికి కారణం ఏమిటో తెలుసుకోమని వాళ్ళు, మరుగుజ్జు సేనానికి చెప్పారు.

మరుగుజ్జు సేనాని ఇద్దరు అనుచరులను వెంటబెట్టుకుని స్వయంగా గుట్ట మీదికి పోయి గడెకొంత గూడెం కేసి చూశాడు. ఇళ్ళు తగలబడుతున్నవి. కృపాణజిత్తూ, నరవానరం మరుగుజ్జులను నానా హింసా పెడుతున్నారు.

ఈ జరుగుతున్న దానికి సేనానాయకుడు చాలా సంతోషించి, యీ శుభ వార్త జయశీలుడికి చెప్పేందుకు వెనుదిరగబోయేంతలో, హఠాత్తుగా జలాశ్వాల మీద యిద్దరు వింత మనుషులు వచ్చి, పోట్లాడుకుంటున్న వాళ్ళమీద పడ్డారు!







"ఆ వింత గుర్రాలేమిటి? ఆ వింత మనుషులెవరు?" అంటూ మరుగుజ్జు సేనాని ఆశ్చర్యపడుతున్నంతలో, జలాశ్వం మీద వున్న వాడొకడు పొడవాటి తాడును కృపాజిత్తు మీదికి విసిరి, అతడి కంఠాన్ని ఉచ్చులో బిగించాడు. రెండవ జలాశ్వికుడు కత్తి పైకెత్తి నరవానరం మీదికి పోయాడు....

మరుగుజ్జు సేనాని పరమానందంతో పెద్దగా నవ్వి, తన అనుచరులను అక్కడే వుండమని, "ఒరే, గడెకొండ ముఠా వాళ్ళనందర్నీ సరికి పోగులు పెట్టటానికి యిది మనకు మంచి అవకాశం. ఈ సంగతి రాణితో, ఆ మహాకాయులతో చెప్పి, మన భటుల్ని వెంట పెట్టుకు వస్తాను. మీరు మాత్రం యిక్కడే వుండండి," అని గూడెం కేసి పరిగెత్తాడు.

మరుగుజ్జు సేనాని తిరిగివచ్చి గడెకొండ గూడెంలో ఏం జరుగుతున్నదో చెప్పగానే సిద్ధసాధకుడు ఎగిరి గంతేసి శూలం పైకెత్తి, "జై, మహాకాళా!" అంటూ అరిచి, జయశీలుడితో, "జయా, యిక మనం వచ్చిన పని నెరవేరినట్టే! ఈ వింత గుర్రాల మీద వచ్చినవాళ్లిద్దరూ, ఆ వింత పసుపు జలగ్రహాన్ని ఎక్కి వచ్చిన మకరకేతు గుంపులో వాళ్ళనే దాంట్లో సందేహం లేదు. ఆ మకరకేతు మన నుంచి పారిపోయాడు. ఇప్పుడు యీ ఇద్దర్నీ పట్టుకుని, నయానో భయానో వాళ్ళ ద్వారా, ఆ మాయాసరోవరేశ్వరుడుండే చోటు తెలుసుకోవచ్చు. ఆ తరవాత కనకాక్షరాజుగారి పిల్లలు–కాంచనసపర్ణ, కాంచనమాలలను బంధవిముక్తుల్ని చేయుటం క్షణాలమీద పని!" అన్నాడు.

జయశీలుడు, సిద్ధసాధకుడి మాటలు విని, అతడి కేసి మౌనంగా చూస్తూ వూరుకున్నాడు. సాధకుడు కొంచెం విసుగ్గా, "జయశీలా, నేను చెప్పిందేమిటో సువ్వు విన్నట్టే లేదే!" అన్నాడు.

జయశీలుడు చిన్నగా నవ్వి, "సాధకా, అన్ని క్షణాలపాటు పాఠంలా చదివిన

నీ మాటలు వినకపోవటం ఏమిటి? కాని, నా కొకటే ఆశ్చర్యం. ఎవరో ఇద్దరు మనుషులు వింతగుర్రాల మీద వచ్చారని వింటూనే, నువ్వు కనకాశీ రాజుగారి పిల్లలు మనకు దొరికినంత ఉత్సాహంగా మాట్లాడుతున్నావు!" అన్నాడు.

ఆ జవాబు సిద్ధసాధకుణ్ణి చాలా నిరుత్సాహ పరిచింది. అతడు గట్టిగా శూలంతో నేలనొకసారి పొడిచి, "జయా, యిలా అయితే యిక ఏనాటికి మనం ఆ రాజుగారి పిల్లలు ఎక్కడ వున్నారో కనుక్కునేట్టు? ఈ లోపల మనం యీ అరణ్యాల్లో తిరుగుతూనే ముసలి వాళ్ళమైపోతాం," అన్నాడు.

"ఆ ముసలితనం నగరాల్లో పెద్ద పెద్ద భవనాల్లో నివసించినా మనను పట్టుకు తీరుతుంది. నే నాలోచిస్తున్నదేమిటంటే, యీ ఇద్దరు వింత మనుషులూ, యీ ప్రాంతాలకు ఎందుకు వచ్చారన్న దొకటి; రెండోది వాళ్ళను ప్రాణాలతో పట్టుకోవటం ఎలా అన్నది." అన్నాడు జయశీలుడు.

ఈ జవాబు వింటూనే సిద్ధసాధకుడు నిరుత్సాహ పడిపోయి, శూలాన్ని కింద పడవేసి, "జయా! ఆ వింతమనుషుల్ని ప్రాణాలతో పట్టుకునే పథకం ఏదో నువ్వే ఆలోచించు," అన్నాడు.



జయశీలుడు సరేనన్నట్టు తల ఊపి, "అయితే నువ్వు శూలం కింద పడవేశా వెందుకు? ఇకనుంచి నీ మంత్రశక్తినే నమ్ముకోదలిచావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సిద్ధసాధకుడు, "జై మహాకాళా!" అంటూ చిన్నగా మూలిగి, పక్కన శూలాన్ని చేతికి తీసుకుని, "జయశీలా! నా మంత్రశక్తి యింకా పరిపక్వం కాలేదు. ఆ నాడు శ్మశానంలో మహాకాళుని బంటు కాలకాలుడే నా ప్రాణాలు పుచ్చుకునేంత పనిచేశాడు గదా?" అన్నాడు.

"అవునవును! ఆ కాలకాలుడికి బదులు, మనిద్దరి ప్రాణాలనూ, ఆ మాయా

సరోవరేశ్వరుడికే. వాడి ఇంట్లో ఎత్తుకు పోయే ప్రమాదం వున్నది." అని జయశీలుడు మరుగుజ్జు సేనాని కేసి తల తిప్పి, "సేనానీ, నువ్వు కొందరు భటులతో మా వెంట రావలసి వుంటుంది," అన్నాడు.

"అయ్యా, అలాంటి ఆజ్ఞ కోసమే నేను ఎదురు చూస్తున్నాను!" అని మరుగుజ్జు సేనాని, దూరంగా నిలబడి వున్న మరుగుజ్జు భటులకు సంజ్ఞ చేశాడు.

అందరూ కలిసి రాళ్ళగుట్ట కేసి కొంతదూరం నడిచేసరికి, వాళ్ళకు కుడి వైపున వున్న అరణ్యవృక్షాల్లో మంచి నరవానరం భయంకరంగా అరవటం వినిపించింది. జయశీలుడితోపాటు అందరూ ఆశ్చర్యపోతూ అటు కేసి చూశారు. నరవానరం చెట్ల కిందుగా గెంతుతూ నడుస్తున్నది. దాని భుజాల మీద వింత దుస్తుల్లో వున్న మనిషి ఒకడు కదలా మెదలక పడి వున్నాడు.

"జయా! మనం ప్రాణాలతో పట్టుకుని, మాయాసరోవర రహస్యాలు తెలుసుకోవాలనుకున్న వాళ్ళల్లో ఒకడు న
వానరం చేతుల్లో హతమైపోయినట్టున్నది
ఆ రెండో వాడి మాటేమిటి?" అన్నాడ
సిద్ధసాధకుడు.

జయశీలుడు ఒకటి రెండు క్షణాల
నిశ్చేష్టుడైపోయి, "ఆ రెండోవాడు కృపాణ
జిత్తు చేతిలో చావలేదుగదా!" అన్నాడు

"అలా జరిగితే యిక కృపాణజిత్తుక
పట్టపగ్గాలుండవు! ఒక వింత మనిషి
వాడి పెంపుడు నరవానరం ఎత్తుకె
పోతున్నది. రెండవవాణ్ణి...."

సిద్ధసాధకుడు మాట ముగించే లోప
జలాశ్యం మీద సర్పసఖుడు వేగం
చెట్ల కిందికి వస్తూ, "సర్పస్వరా! ఎక్కడ
సర్పస్వరా!" అంటూ కేకలు పె
సాగాడు

జయశీలుడు చప్పున చేయెత్తి
"అందరూ వాడి కంటబడకుండా
దాక్కోండి. ఎలా అయినా సరే, వా
ప్రాణాలతో పట్టుకోవాలి!" అని హెచ్చ
రించాడు. —(ఇంకా వుంద







# మాయాసరోవరం

## 18

[సర్పనఖుడు, సర్పస్వరుడు అనే అన్నదమ్ములిద్దరు, జలాశ్వాల పైన మరుగుజ్జుల గూడేనికి వచ్చారు. సర్పనఖుడు, కృపాణజిత్తు వెంటగ రాగా వెళ్ళాడు. నరవాహనం, సర్పస్వరుడి పైనబడి, అతన్ని ఎత్తుకుపోయింది. ఈ సంగతి విన్న మరుగుజ్జులూ, నిర్ఘాంతపోతుండగా గూడెం కేసి వచ్చేంతలో, సర్పనఖుడు వాళ్ళకు జలాశ్వం పైన వస్తూ కనిపించాడు. తరవాత—]

సర్పనఖుడు ఒక పెద్ద చెట్టు కిందికి వచ్చి, తన వాహనాన్ని ఆపి, చుట్టూ ఓ మారు కలయ చూశాడు. అక్కడ ఆకాశాన్నంటే మహా వృక్షాలూ, వాటికి పాదుల ఒత్తుగా పెరిగిన ముళ్ళపొదలూ తప్ప, అతడి తమ్ముడి జాడలేమీ కనిపించలేదు. ఈసారి సర్పనఖుడు మరింత పెద్దగా, "సర్పస్వరా!" అంటూ కేక పెట్టాడు.

ఆ కేకకు జవాబులేదు. సర్పనఖుడు దిగాలుపడిపోయి, అంతలోనే పట్టరాని కోపంతో ఒరలో నుంచి కత్తిలాగి, దాన్ని పక్కనే వున్న చెట్టు బోదెలో బలంగా గుచ్చి, "ఇదే, నా ప్రతిజ్ఞ! నా తమ్ముణ్ణి ప్రాణాలతో చూడలేకపోయానా, వాణ్ణి చంపిన నరవాహనాన్ని, దాని యజమానుని కంఠాలు నరికిగాని, నా ప్రాణాలు వదలను!" అంటూ అరిచాడు.







పొదల వెనక దాగివుండి యీ మాటలు విన్న జయశీలుడు తృప్తిగా నవ్వి, సిద్ధసాధకుడితో, "సాధకా, యీ సర్పనఖుడి ప్రతిజ్ఞ విన్నావుగదా? వాడు అరణ్య వృక్షాల సాక్షిగా గొప్ప కఠోర ప్రతిజ్ఞ చేశాడు." అన్నాడు.

"జయశీలా, తమ్ముడు కనబడలేదన్న దిగులులో వాడికి మతిస్థిమితం తప్పిందని నా అనుమానం. సరే, వాణ్ణి ప్రాణాలతో పట్టుకునే సంగతేమిటి?" అని అడిగాడు సిద్ధసాధకుడు.

సర్పనఖుడు తీవ్రావేశంలో వున్నట్టు తెలుస్తూనే వున్నది. అలాంటి వాణ్ణి ఎదటపడి లొంగిపొమ్మని ఆజ్ఞాపించటం వృథా. వాడు తప్పక ప్రాణాలకు తెగించి పోరాడేందుకు సిద్ధపడతాడు. వాణ్ణి ఏదైనా ఉపాయంతో పట్టుకోవాలి....

జయశీలుడు యిలా ఆలోచిస్తూ, సిద్ధసాధకుడితో, "సాధకా, నీ రూపం, మాట తీరూ కూడా మామూలు మనుషులకు భిన్నంగా వుంటుంది. కనక నువ్వే వాణ్ణి పట్టగలవు. ఈ సర్పనఖుడు మనకు ప్రాణాలతో దొరకటం మీద, మనం మాయాసరోవరాన్ని చేరటం, చేరలేకపోవటం ఆధారపడుతుంది, ఏమంటావు?" అన్నాడు.

"అవును. మనం తలిసి బోగడ ఆ భయంకరకేతువును పడిచాం. ఇప్పుడు వాడి మిత్రుడైన యీ సర్పనఖుడు, మనను మాయాసరోవరం దగ్గిరకు తీసుకుపోయే వరకూ, వదలరాదు." అన్నాడు సిద్ధసాధకుడు.

"అదే చేయబోతున్నాం. నువ్వు ఏదో విధంగా వాణ్ణి సమీపించి, వాడి దగ్గిర నుంచి ఆ కత్తి తీసుకోవాలి. నిరాయుధుడుగా వున్న వాణ్ణి బంధించి, వాడి ద్వారా ఆ సరోవరానికి పోయే దారి తెలుసుకునే పని నేను చూస్తాను," అన్నాడు జయశీలుడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు పొదల వెనక నక్కుతూ, దూరంగా వున్న చెట్ల







చాటుకు బయలుదేరాడు. జయశీలుడు, మరుగుజ్జుసేనానితో. "సేనానీ, యీ వింత రూపుడి శక్తిసామర్థ్యాలేమిటో మనకు తెలియవు. అవసరం పడితే సాధకుడికి సహాయపడేందుకు సిద్ధం. నీ పొట్టిలు వాహనంతో ఏ చెట్టుచాటున అయినా దాగి వుండగలవా?" అని అడిగాడు.

"అయ్యా, అదెంతపని! ఈ సరి గుర్రంవాణ్ణి కావాలంటే నేనే చెట్టు కొమ్మల్లోంచి మీదికి దూకి, కాళ్ళూ చేతులూ కట్టెయ్యగలను," అంటూ మరుగుజ్జుసేనాని తన వాహనం పట్టిచేసి పుస్తు రేగుపొదల కేసి బయలుదేరాడు.

తరవాత ఒకటి రెండు నిమిషాలు గడవే లోపల సిద్ధసాధకుడు శూలాన్ని ఎత్తి పట్టుకుని, చెట్ల చాటునుంచి బయటికి వస్తూ, "ఎవర్రా, నా పెంపుడు పాలపుర్వాన్ని కత్తితో పొడిచి గాయ పరిచింది? దాని మూలుగు విని, నాకు నిద్రాభంగమైంది," అంటూ కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే సర్పనఖుడు చప్పున కత్తిని పట్టుబొదె నుంచి లాగి, సాధకుడి కేసి దాన్ని గురిచేసి నిబ్బరంగా నిల బడ్డాడు. సాధకుడు అతణ్ణి సమీపిస్తూ, "ఓరి, నువ్వు చూడగా మాయాసరోవ రేశ్వరుడి బంటులావున్నావు. అవునా?" అన్నాడు.

ఇంత భయంకరాకారుణ్ణంలో తనను చూస్తూనే, తన యజమాని ఎవరైనది గ్రహించిన బుతకొపనేగాని, గొప్ప మంత్ర వేత్త అయివుంటాడనుకుని సర్పనఖుడు ఆశ్చర్యంతో, భయంతో పరికిసాగాడు. సిద్ధసాధకుడు తన ఎత్తు పారినందుకు లోలోపల సంతోషిస్తూ, "మాయాసరోవ రేశ్వరుని బంటుననే గర్వంతో, అలా గుర్రం మీద ఠీవిగా కూర్చుంటావా? ముందు గుర్రం దిగు," అన్నాడు గద్దిస్తూ.

సర్పనఖుడు చప్పున బలాశ్వంపై నుంచి కిందికి దూకాడు. సాధకుడు అతడి ముందుకు వచ్చి, "ఏదీ, ఆ కత్తి యిటివ్వు," అన్నాడు.



ఆ మాట వింటూనే సర్పనఖుడు చప్పున నాలుగైదడుగులు వెనక్కు వేసి, సాధకుడి కేసి అనుమానపడుతున్నట్టు చూస్తూ, "నా కత్తితో నీకేం పని? నన్ను నిరాయుధుణ్ణి చేయాలనుకోవటంలో ఏదో మోసం వున్నది. అసలు నీకు మా యజమాని పేరు ఎలా తెలుసు? నువ్వు చెట్టు మాటుగా వినగలిగినంత గొప్ప మంత్రవేత్తవా?" అన్నాడు.

సిద్ధసాధకుడు పెద్దగా నవ్వి, "ఒరే, సర్పనఖా! నీవన్నీ మతిమాలిన ప్రశ్నలు. నేను, నీ మిత్రుడైన మకరకేతుణ్ణి కూడా ఎరుగుదును. ఆ కత్తి నీ చేతిలో వుండటం, నీకే ప్రమాదం. దాన్ని వెంటనే కింద పడవెయ్యి." అంటూ శూలం ఎత్తి, సర్పనఖుడి కేసి చూసాడు.

సర్పనఖుడు ఒకక్షణం నివ్వెరపోయి, అంతలోనే తేరుకుని, అప్పటికి తెగించిన వాడిలా పళ్ళుకొరికి, "ఇప్పుడు నువ్వెవరైందీ నాకు గుర్తొస్తున్నది. నరవాహనం యజమాని కృపాణదత్తు అనేవాడు నిన్నూ, నీ మిత్రుడైన మకరకేతుణ్ణీ అరణ్యంలో చూశాడు. నువ్వు కాపాలికుడివి, అవునా?" అన్నాడు కత్తి పైకెత్తి పట్టుకుని.

సిద్ధసాధకుడికి అతణ్ణి శూలంతో పొడవాలన్నంత కోపం వచ్చింది గాని, బతికి ఉండగా ప్రాణాలతో పట్టుకోవా లన్నాడు. కాని, సర్పనఖుడు ఒకపట్టాన లొంగిపోయేలా లేదు. సిద్ధసాధకుడికి ఆ సమయంలో వచ్చిన ఒక ఉపాయం తోచింది. అతడు శూలాన్ని నేలలో గుచ్చి, "ఒరే, సర్పనఖా! నువ్వనుకున్నట్టు నేను మామూలు కాపాలికుణ్ణి కాను; సిద్ధసాధకుణ్ణి. నా శూలాన్ని దూరంగా పారేస్తాను; నీ కత్తిని దూరంగా పారవెయ్యి. ఇప్పుడు సంగతి సందర్భాలు తాపీగా మాట్లాడుకుందాం." అన్నాడు

"ఆహా, కాపాలికా, నీ ఎత్తుగడ నాకు తెలిసింది! నన్ను నిరాయుధుణ్ణి చేసి పట్టుకుని నీ క్షుద్రదేవతకో బలి యివ్వా లనుకుంటున్నావు. అవునా? చూడు,





నిన్నిప్పుడే పరలోకానికి ప్రయాణం కట్టిస్తాను." అంటూ సర్పనఖుడు కత్తిదూసి, సిద్ధసాధకుడి మీదికి లంఘించబోయాడు.

సిద్ధసాధకుడు తనకు రానున్న ప్రమాదాన్ని గుర్తించి నేలకు గుచ్చిన శూలాన్ని చేతికి తీసుకోబోతున్నంతలో, సర్పనఖుడు అతణ్ణి సమీపించి కత్తితో గుండెల్లో పొడవబోయాడు. కాని, అదే క్షణంలో మరుగుజ్జు సేనాని వెనకనుంచి వచ్చి, తన పొట్టేలుతో సర్పనఖుణ్ణి ఢీకొట్టించాడు. సర్పనఖుడు ఒక చావుకేకపెట్టి బోర్లా ముందుకు పడిపోయాడు. అతడి చేతిలోని కత్తి జారి దూరంగా పడింది.

సిద్ధసాధకుడు చప్పున పోయి కత్తిమీద పాదం మోపి, పెద్దగా ఒకసారి నవ్వి, "మరుగుజ్జు సేనానీ, నీ సమయస్ఫూర్తి మెచ్చదగింది. నిన్ను మహాకాలుడు సర్వదా రక్షిస్తుంటాడు. జై మహాకాళా!" అన్నాడు.

అంతలో అక్కడికి జయశీలుడు వచ్చాడు. అతడు బోర్లాపడివున్న సర్పనఖుణ్ణి భుజాలు పట్టి లేపి నిలబెట్టి, "ఏరా, సర్పనఖా, నీ పేరే ఒక వింత; నీ ప్రవర్తన మరింత వింతగా వున్నది. సర్పానికి కోరలుండటం ఎరుగుదుంగాని; గోళ్ళుండటం ఎరగం! సిద్ధసాధకుడంతటి వాణ్ణి, నీ మొండికత్తితో పొడిచి చంపాలనుకున్నావా?" అన్నాడు.

"జై, మాయాసరోవరేశ్వరా! నీవే రక్ష." అంటూ సర్పనఖుడు పెద్దగా





మూలిగి, "మీరెవరోగాని నన్ను మోసంతో, అధర్మ పద్ధతిలో నిరాయుధుణ్ణి చేశారు. ఆ కత్తి నా చేతిలో వున్నట్టయితే, యీపాటికి మీ అందర్నీ ముక్కలు ముక్కలుగా నరికి వుందును." అన్నాడు కోపంతో వణికిపోతూ.

జయశీలుడు మారుమాట్లాడకుండా సిద్ధసాధకుడి దగ్గిరకు పోయి, "సాధకా, ఏదీ యీ సర్పనఖుడి కత్తి యిటివ్వు." అన్నాడు.

సిద్ధసాధకుడు తన కాలి కింద వున్న కత్తిని తీసి జయశీలుడి కిచ్చాడు. జయశీలుడు దాన్ని తీసుకుపోయి సర్పనఖుడికి యిస్తూ, "ఓరే, సర్పనఖా! నీ యజమాని అయిన మాయాసరోవరేశ్వరుడు దొంగ చాటుగా హిరణ్యపురం రాజుగారి కుమారుణ్ణి, కుమార్తెనూ ఎత్తుకుపోయాడు. వాడి బంటువైన నువ్వు. ఏవో బింకాలు పలుకుతున్నావు. ఏదీ, నాతో కత్తియుద్ధానికి రా. నిన్ను మాత్రం ఏ పరిస్థితుల్లోనూ చంపను. నీతో నాకు ఒక ముఖ్యమైన పని వున్నది." అన్నాడు.

"ఆఁ, పనా? ఆ పనేమిటో నాకు తెలుసు. కాచుకో దెబ్బ!" అంటూ సర్పనఖుడు కత్తిని జయశీలుడి కంఠానికి గురిచేసి విసిరాడు.

జయశీలుడు తన కత్తితో, సర్పనఖుడి కత్తిని పక్కకు నెట్టి, ఎడమకాలితో అతడి మోకాలిమీద గట్టిగా తన్నాడు. ఆ దెబ్బకు సర్పనఖుడు పక్కకు పడి లేస్తూ, "అన్యాయం! ఇదేం కత్తియుద్ధం?" అని బిగ్గరగా అరుస్తూ తిరిగి జయశీలుడి మీదికి వచ్చాడు.

"ఏ పరిస్థితుల్లోనూ నిన్ను చంపనని ముందే చెప్పాను గదా? నీ మిత్రుడు మకరకేతు చేయవలసిన పని ఏదో చేయించబోతున్నాను." అంటూ జయశీలుడు, సర్పనఖుడు తన గుండెల్లో గుచ్చబోయిన కత్తిని, తన కత్తితో కిందికి కొట్టి, యీసారి కుడికాలితో అతడి పొట్టలో గట్టిగా పొడిచాడు.





ఆ పోటుకు సర్పనఖుడు పెద్దగా అరుస్తూ వెనుకకు పడిపోయాడు. అతడి చేతిలోని కత్తి దూరంగాపోయి పడింది. "ఛీ, ఛీ, యిది కత్తియుద్ధమా? మల్లయుద్ధం కన్న కూడా అధమంగా వుంది." అంటూ సర్పనఖుడు లేచి నిలబడ్డాడు.

"అయితే మల్లయుద్ధంలోనే నన్ను జయించు." అంటూ జయశీలుడు అతడిపై కలబడి, నడుము పుచ్చుకుని, పైకెత్తి, కొంచెం దూరంలో నిలబడి అంతా చూస్తూ వినోదిస్తున్న సిద్ధసాధకుడితో, "సాధకా, ఈ మహావీరుడు నేలబడి చావకుండా పట్టుకుని, తరవాత కావాలంటే నీ శూలంతో పొడిచి చంపు!" అని, విసిరివేశాడు.

సిద్ధసాధకుడు, సర్పనఖుణ్ణి గాలిలోనే పట్టుకోబోయే ప్రయత్నంలో అతడి చేతులకు వాడి మెడా, ఒక కాలూ దొరికినై. సాధకుడు పరమానందపడిపోతూ, సర్పనఖుణ్ణి గాలిలో గిరగిరా తిప్పి, "ఆహా, వీడు మహాకాళుడికి ప్రశస్తమైన బలిపశు వవుతాడు, సందేహం లేదు." అంటూ నేల మీద పడవేశాడు.

సర్పనఖుడు వెల్లికలాపడి లేచి కూర్చుని, భయంతో గడగడ వణికిపోతూ, "అయ్యలారా, నన్ను చంపకండి. నేనూ, నా తమ్ముడు సర్పస్వరుడనేవాడూ కలిసి, మకరకేతు అనేవాణ్ణి వెతుకుతూ యీ ప్రాంతాలకు వచ్చాం. నా తమ్ముణ్ణి భయంకరమైన



నరవానరం ఎత్తుకుపోయింది. వాడింకా బతికేవుంటే, వాణ్ణి యీ అరణ్యంలో వెతికి పట్టుకుని, నా దారిన నేను పోతాను." అన్నాడు.

"సర్పసఖా. అలా పాకకిరా." అని జయశీలుడు. సిద్ధసాధకుడితో, "సాధకా. పిల్లి బలిపెట్టటానికి యింకా సమయం వున్నది. ప్రస్తుతానికి ఆగు." అని, సర్పసఖుడితో. "ఒరే. నీ తమ్ముణ్ణి ఎత్తుకుపోయిన నరవానరం యజమాని కృపాజిత్తు యింకా బతికే వున్నాడు. వాడు నాకు శత్రువు. నీ తమ్ముణ్ణి వెతికే ప్రయత్నంలో నీకు సాయపడతాను. కాని, నువ్వనే మాయాసరోవరేశ్వరుడుండే చోటుకు మమ్మల్ని తీసుకుపోతానని మాత్రం ముందుగా వాగ్దానం చెయ్యి." అన్నాడు.

"మాయా సరోవరేశ్వరుడుండే చోటుకు, ఆయన అనుమతి లేకుండా మానవమాత్రుడెవడూ ప్రాణాలతో చేరలేడు." అన్నాడు సర్పసఖుడు.

"అలా అయితే ఆ సరోవరం వున్న చోటేదో మాకు చెప్పు. అక్కడికి చేరే ప్రయత్నమేదో మేమే చేస్తాం. ఆ ప్రయత్నంలో మా ప్రాణాలు పోయినా నీవు బాధ్యుడివి కావు. ఏమంటావు?" అన్నాడు జయశీలుడు.

ఈ సారి సర్పసఖుడు వెలవెలపోతూ, కళ్ళు తేలవేసి, "ఆ సరోవరం వున్న చోటు చెపితే, నా తల బద్దలవుతుంది. అలా అని శాపం!" అన్నాడు.

"ఆ శాపమేదో నేనే అమలు చేస్తాను," అంటూ జయశీలుడు కత్తిని, సర్పసఖుడి తలకు గురిచేసేంతలో, దూరంగా కేకలు వినిపించినై. అందరూ తలలు తిప్పి అటు కేసి చూశారు.

కృపాజిత్తు ఒక బలాశ్వాన్ని ఎక్కి, కత్తి తిప్పుతూ, "జయశీలుడెక్కడ? వాడి నెత్తురు కావాలి ఎక్కడ? వాళ్ళను నా కత్తికి బలి పెడతాను," అంటూ జయశీలుడూ వాళ్ళున్న వైపుకు వేగంగా రాసాగాడు. —(ఇంకా వుంది)







# మాయాసరోవరం

## 19

[నరవానరం ఎత్తుకుపోయిన తన తమ్ముణ్ణి వెతుకుతూ బయలుదేరిన సర్పనఖుడు, జయశీల సిద్ధసాధకులకు ఒక చెట్టు కింద కనిపించాడు. వాళ్ళు అతణ్ణి పట్టుకుని, మాయా సరోవరానికి వెళ్ళే దారి చెప్పకపోతే చంపుతామని భయపెడుతూండగా, కృపాణజిత్తు ఒక బిలాశ్వాన్ని ఎక్కి, కత్తి తిప్పుతూ వాళ్ళున్న వైపుకు రాసాగాడు. తరవాత—]

కృపాణజిత్తు పెట్టిన కేక వింటూనే జయశీలుడు కత్తిని సర్పనఖుడి తల మీది నుంచి పైకెత్తి, తల తిప్పి చూశాడు. కృపాణజిత్తు చాలా దూరంలో, బిలాశ్వం మీద అతడికి కనిపించాడు. సిద్ధసాధకుడు శూలాన్ని గుప్పెటలో గట్టిగా బిగించి, ''అహా, ఎంత కాలానికి ఈ కృపాణజిత్తు నా శూలం పోటుకు అందబోతున్నాడు!'' అంటూ బయలుదేరాడు.

సర్పనఖుడు చప్పున పోయి సిద్ధసాధకుడి చేయిపట్టుకుని, ''అయ్యా, ఆగండి. ఒక్కమాట! మరొకసారి ధ్రువపరుచుకునేందుకు అడుగుతున్నాను. ఈ కృపాణజిత్తు అనేవాడే గదా, భయంకర నరవానరానికి యజమాని?'' అని అడిగాడు.

''అవును, ఆ నరవానరమే, నీ తమ్ముణ్ణి ఎత్తుకుపోయింది.'' అన్నాడు సిద్ధసాధకుడు.







"అలా అయితే, యీ దుష్టుణ్ణి చంపే ముందు, ఆ నరవానరం నా తమ్ముణ్ణి అరణ్యంలో ఎక్కడికి ఎత్తుకుపోయిందో వీణ్ణుంచి తెలుసుకోనివ్వండి," అన్నాడు సర్పసఖుడు.

"ఏ, చెయ్యి వదులు! నీ తమ్ముడు ఏమయితే నాకేం! వీడు ముఖ్యంగా జయశీలుడికీ, నాకూ ప్రబల శత్రువు. వీణ్ణి యీ లోకం నుంచి మరో లోకానికి పంపాలి. ఆ తరవాత నీ వంతు వస్తుంది. జాగ్రత్త!" అంటూ సిద్ధసాధకుడు పళ్ళు కొరికాడు.

వాళ్ళిద్దరి సంభాషణా వింటున్న జయశీలుడికి హఠాత్తుగా ఒక ఆలోచన కలిగింది. సర్పసఖుణ్ణి మంచి చేసుకోవటానికి యిది చక్కని అవకాశంగా అతడికి తోచింది.

"సర్పసఖా! మాయాసరోవరం ఎక్కడ వున్నదో చెప్పేందుకు నువ్వు నిరాకరించినా, నీ తమ్ముడు సర్పస్వరుణ్ణి వెతికే పనిలో నేను సహాయపడదలిచాను. నేనూ, సాధకుడూ ఆ చెట్లచాటుకు పోయి నిలబడతాం. నువ్వు, కృపాణజిత్తును కేక వేసి పిలిచి, నరవానరం, నీ తమ్ముడూ ఎక్కడ వున్నారో కనుక్కో." అన్నాడు జయశీలుడు.

"అయ్యా, కృతజ్ఞుణ్ణి. నా వాహనాన్ని, కత్తిని ఉపయోగించుకోవచ్చా?" అని అడిగాడు సర్పసఖుడు.

జయశీలుడు కత్తిని సర్పసఖుడికి తిరిగి యిచ్చివేస్తూ, "ఆ కృపాణజిత్తు కత్తి యుద్ధంలో ఆరితేరినవాడు. తగు జాగ్రత్తలో వుండు." అని సాధకుడితో కలిసి, కొంచెం ఎడంలో వున్న గుబురు చెట్ల చాటుకు వెళ్ళాడు.

సర్పసఖుడు తన జలాశ్వాన్ని ఎక్కి కూర్చున్నాడు. కృపాణజిత్తు యింకా కేకలు వేస్తూ, అరణ్య వృక్షాల్లో అక్కడా యిక్కడా వెతుకుతూ జలాశ్వం మీద స్వారీ చేస్తున్నాడు. సర్పసఖుడు ఒక క్షణం ఆలోచించి తానే పోయి ఆ కృపాణ

జిత్తును కలుసుకోవటం మంచిదని అశ్వాన్ని అదలించబోయేంతలో, అతడి వెన్నుమీద ఏదో గుచ్చుకున్నది. చురుక్కుమన్నది.

సర్పనఖుడు అశ్వం మీద అదిరిపడి, కత్తి పైకెత్తి వెనుదిరిగిచూశాడు. అతడికి గుర్రపు తోక మీద కూర్చునివున్న మరుగుజ్జు సేనాని కనిపించాడు. అతడి చేతిలో బల్లెం వున్నది.

"ఒరే, మరుగుజ్జు జాతి వెధవా, నువ్వేనా నన్ను బల్లెంతో వెన్నులో పొడిచింది?" అంటూ సర్పనఖుడు కోపంతో ఊగిపోతూ, మరుగుజ్జు సేనానిని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు మరుగుజ్జు సేనాని నవ్వి, "ఓహో, నీటి గుర్రం మనిషి, నేను నిజంగా బల్లెంతో పొడిచి వున్నట్టయితే నువ్వీపాటికి నేలమీద పడి, దొర్లుతూండే వాడివి. నిన్ను పలకరించేందుకు బల్లెంతో నీ వెన్ను మీద అలా గీరాను, అంతే." అన్నాడు.

"నన్ను పలకరించటానికి ఇదా పద్ధతి? ఛీ." అంటూ సర్పనఖుడు, అశ్వాన్ని ముందుకు నడపబోయినవాడల్లా ఆగి, "నాతో నీకేం పని? నేను సర్వశక్తి సంపన్నుడైన మాయాసరోవరేశ్వరుడి బంటును: నువ్వు ఈ కీకారణ్యంలో



బతికే నేలబారు మనుషుల్లో ఒకడివి." అన్నాడు.

ఆ మాటలకు మరుగుజ్జు సేనాని కోపం తెచ్చుకుని బల్లెం ఎత్తబోయేంతలో, కృపాణజిత్తు జలాశ్వం మీద చెట్ల చాటు నుంచి బయిటికి వస్తూ, సర్పనఖుణ్ణి చూసి ఆగి, "ఎవరు నువ్వు? గడకొంచ గూటంలో నా మెడకు తాడు బిగించిన వాడివా?" అన్నాడు.

"అవును, ఆ ఉరితాడు నుంచి నువ్వు ఎలా బయటపడ్డావో నాకు తెలియటం లేదు. పైగా నువ్వు యిప్పుడు ఎక్కివున్న జలాశ్వం నా తమ్ముడైన సర్పస్వరూపుడిది. దాన్ని ఏం చేశావు?" అంటూ







సర్పనఖుడు తన గుర్రాన్ని నెమ్మదిగా, కృపాణజిత్తు కేసి నడపసాగాడు.

కృపాణజిత్తు రెండు చేతులూ పైకెత్తి, "నువ్వు వున్న చోటునే ఆగు. మనం మాట్లాడవలసింది చాలా వుంది," అన్నాడు.

సర్పనఖుడు జలాశ్వాన్ని ఆపి, "ఏమిటా మాట్లాడవలసింది? నా తమ్ముడెక్కడ?" అని అడిగాడు.

"నరవానరం హఠాత్తుగా పైనపడి జలాశ్వం మీదినుంచి నీ తమ్ముణ్ణి ఎత్తుకు పోతూండగా, అతను, 'అన్నా సర్పనఖా!' అంటూ అరవటం నేను విన్నాను. నీ పేరు సర్పనఖు డన్నమాట! నీవెక్కి వున్న యీ గుర్రం నీ తమ్ముడిది; దీన్ని సూడెం పక్క చెట్లలో పట్టుకున్నాను," అన్నాడు కృపాణజిత్తు.

"నే నడిగినదానికి మాత్రం జవాబివ్వ లేదు. నా తమ్ముడెక్కడ?" అంటూ సర్పనఖుడు కత్తి పైకెత్తాడు.

"సర్పనఖా, తొందరపడకు. విధి బలీయం అన్నారు. నీ తమ్ముడికి ఆ నరవానరం చేతిలో చావు రాసిపెట్టి వుంటే— ఈ పాటికి అంతే జరిగి వుంటుంది. అలా కానప్పుడు అతడు నరవానరాన్ని లొంగదీసుకుని, దాని సాయంతో, మనిద్దరి శత్రువులైన జయశీల, సిద్ధసాధకుల్ని వేటాడేందుకు అరణ్యమంతా గాలిస్తూంటాడు! నీ తోటివాడైన మకరకేతుణ్ణి, వాళ్ళిద్దరూ ఎంతగా హింసపెట్టారో, అరణ్యంలోని పల్లెవాసుల ద్వారా లోగడ నేను విని వున్నాను," అన్నాడు కృపాణజిత్తు.

కృపాణజిత్తు మాట ముగించే లోపలే సర్పనఖుడు పెద్దగా అరిచి, "దుర్మార్గుడా, నా తమ్ముడి చావుకు కారణం నువ్వు. ఇతర శత్రువుల మాట తరవాత చూస్తాను; ముందు నీ తల నరికి, నా తమ్ముడి ఆత్మకు శాంతి చేయాలి," అంటూ కేకపెట్టి, అశ్వాన్ని కత్తిపిడితో గట్టిగా కొట్టాడు.



జలాశ్వం వేగంగా తన కేసి రావటం చూస్తూనే కృపాణజిత్తు భయంతో కంపించిపోతూ, తన అశ్వాన్ని వెనక్కు తిప్పి, "నా గర్భశత్రువైన జయశీలుణ్ణి చంపిగాని, నేను చావను. అందువల్ల ప్రస్తుతానికి నీతో నేను పోరదలచలేదు." అంటూ అశ్వాన్ని దౌడు తీయించసాగాడు.

సర్పనఖుడు అతడి వెంటబడ్డాడు. చెట్ల చాటున వుండి యిదంతా చూస్తున్న జయశీలుడు, సిద్ధసాధకుడితో, "సాధకా, ఈ పారిపోతున్న వాళ్ళలో ఒకడు మనకు పరమ శత్రువు, రెండోవాణ్ణి మిత్రుడిగా చేసుకోగలిగితే, మనం మాయాసరోవరాన్ని చేరవచ్చు." అన్నాడు.

"మంచి ఆలోచన. కాని, ఇద్దరూ మనకు అందకుండా పారిపోయేలా వున్నారు. ఇప్పుడేం చేసేట్టు?" అని అడిగాడు సిద్ధసాధకుడు.

జయశీలుడు చెట్ల చాటునుంచి బయటికి వచ్చి, ఆశ్చర్యపోతూ దిక్కులు చూస్తున్న మరుగుజ్జు సేనానితో, "సేనానీ, ఆ గుర్రాల మీద పారిపోయేవాళ్ళను పట్టుకోవాలి. ఈ చుట్టుపక్కల అంతటా మీ జాతివాళ్ళున్నారుగదా. వాళ్ళను హెచ్చరించి, వాళ్ళిద్దర్నీ ప్రాణాలతో పట్టుకుని బంధించగలవా?" అని అడిగాడు.

"అయ్యో, అదెంత పని. ఈ చుట్టుపక్కల వున్న అరణ్యాలూ, కొండలూ, కోనలూ—అన్నీ మా నివాస స్థానాలే. డప్పులు వాయించి, అంచెల మీద మా వాళ్ళందర్నీ హెచ్చరిస్తాను," అని మరుగుజ్జు సేనాని, తన పాకీలు వాహనాన్ని గూడెం కేసి పరిగెత్తించాడు.

"సిద్ధసాధకా, యిక యిక్కడ మనం చేయవలసిందేమీ లేదు. ఆ కనబడే గుట్ట మీదికి పోయి, మరుగుజ్జు జాతి వాళ్ళు ఏం చేస్తారో చూద్దాం," అంటూ జయశీలుడు బయలుదేరాడు.

"ఛీ, మహాకాళా! మనం హిరణ్యపురాన్నుంచి బయలుదేరిన వేళా విశేషం







మంచిది కాదు. ఎన్ని చిక్కులు! ఎన్ని యిక్కట్లు!" అంటూ సిద్ధసాధకుడు నిట్టూర్చి, జయశీలుడి వెంట నడిచాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ వాళ్ళ గుట్ట మీది నుంచి నేల దిగే సరికి, ఉన్నట్టుండి గూడెం వైపునుంచి దగ్గరగా ఒక డప్పు మోగటం వినిపించింది. ఆ వెంటనే అరణ్యంలో అన్ని ప్రాంతాల నుంచీ డప్పుల మోతలూ, ఆయుధాలు ధరించిన మరుగుజ్జు భటులు అరణ్యం అన్ని వైపులకూ గుంపులు గుంపులుగా పరిగెత్తుతూండటం వాళ్ళ కంటబడింది.

ఈ లోపల కృపాణజిత్తును తరుముకు పోతున్న సర్పనఖుడు, అతణ్ణి ఆ అరణ్య వృక్షాల మధ్య తరిమి పట్టుకుని చంపటం సాధ్యమయే పని కాదని గ్రహించి, పెద్ద గొంతుతో, "ఒరే, కృపాణజిత్తూ, ఆగు! ఒకవేళ నా తమ్ముడు బతికే వున్నాడేమో మనకు తెలియదు గదా. నువ్వు, మా జలాశ్వాన్ని యిచ్చి, ఏ దారిన నువ్వు పో." అన్నాడు.

"అశ్వాన్ని తీసుకుని నన్ను కత్తికి బలి పెట్టనన్న నమ్మకం ఏమిటి? అట్లని నేను, నీతో పోరాడేందుకు భయపడు తున్నాననుకోకు. యుద్ధంలో విజయం ఎవరిదవుతుందో, ఒక్క దేవతలకు తప్ప మరెవరికీ తెలియదు. నేను, ముందు ఆ జయశీలుణ్ణి చంపాలి. ఆ తరవాత నీ సంగతి చూస్తాను." అంటూ కృపాణజిత్తు జలాశ్వాన్ని వేగంగా పరిగెత్తిస్తూ, నదీతీరాన్ని చేరాడు.

సర్పనఖుడు యిక మంచి మాటలతో కృపాణజిత్తును పట్టుకోవటం సాధ్యం కాదని గ్రహించి, తనూ జలాశ్వాన్ని గట్టిగా అదిలించి కొద్దిసేపటికల్లా నదీతీరాన్ని చేరి, దాని ఒడ్డు వెంట పారిపోతున్న కృపాణజిత్తు వెంటపడ్డాడు.

ఆ సరికి మరుగుజ్జు జాతి వాళ్ళలో కొందరు కృపాణజిత్తునూ, సర్పనఖుణ్ణీ చూసి, వాళ్ళ దారిని అటకాయించేందుకు ఒకచోట ఆయుధాలెత్తి పట్టుకుని





గుంపుగా నిలబడ్డారు. కృపాణజిత్తు వాళ్ళను అంతదూరంలో వుండగానే చూశాడు. ముందుకుపోతే, తను అంతకు పూర్వం నానా హింసలపాలు చేసిన మరుగుజ్జువాళ్ళు, వెను తిరిగితే తన తమ్ముడికి జరిగిన హానికి, పగ తీర్చుకునేందుకు వస్తున్న సర్పనఖుడు!

ఆ స్థితిలో కృపాణజిత్తుకు అశ్వంతో పాటు నదిలో దూకటమొక్కటే మేలైన మార్గంగా కనిపించింది. ఇలా ఆలోచించి అతడు అశ్వాన్ని గట్టు మీదనుంచి, నది కేసి మళ్ళించేసరికి, అక్కడ నదీ జలంలో తేలియాడుతూ రెండు మొసళ్లు కనిపించినై. వాటిని చూస్తూనే కృపాణజిత్తు గుండె గుభేలుమన్నది. గుండెలో గుచ్చుకునే బల్లెంపోటు మంచిదా? వెన్నుమీద పడే కత్తివేటు మంచిదా? లేక నీళ్ళపై తేలుతున్న కరకుకోరల పట్టు మంచిదా? అనుకుంటూ అతడు ఒక క్షణం నివ్వెరపోయి, అంతలోనే తనకు ఎలాగూ చావు తప్పదన్న నిస్పృహలో మొండిధైర్యం తెచ్చుకుని, "మరుగుజ్జువాళ్ళకన్నా, సర్పనఖుడికన్నా—ఈ మొసళ్ళే గొప్ప సాధుజీవులు. పైగా నేనెక్కి వున్నది పటుగుర్రం కనక. నీటిలో తన రక్షణ చూసుకునే ప్రయత్నంలో నన్నూ రక్షించక పోదు," అనుకుంటూ అశ్వాన్ని నదిలోకి దూకించాడు.

కృపాణజిత్తు వెనకవస్తున్న సర్పనఖుడు యిది చూసి, "ఔరా, తెలివి



మాలినవెధవా, ఎంతపని చేశావు? మొసళ్ళని నీతోపాటు, జలాశ్వాన్ని కూడా తినకుండా కాపాడుకోవాలి. మాయాసరోవరాన్ని చేరటానికి, ఒకవేళ నా తమ్ముడు బతికుంటె యీ అశ్వమొక్కటే ఆధారం." అంటూ తనూ గుర్రాన్ని నదిలోకి దూకించాడు.

మొసళ్ళు రెండూ, నీటివాలున పడి కొట్టుకుపోతున్న కృపాణజిత్తు వెంట పడినై. సర్పనఖుడు కత్తిఎత్తి. వాటిని పొడిచి చంపేందుకు వెంట బడ్డాడు. ఒడ్డునవున్న మరుగుజ్జువాళ్ళు అక్కడ దొరికిన రాళ్ళనూ, ఎండుకట్టెలనూ కృపాణజిత్తు కేసి విసరసాగారు. సర్పనఖుడు గొంతెత్తి, "నేను మీ మిత్రుణ్ణి. ఈ దుర్మార్గుణ్ణి ప్రాణాలతో పట్టుకోబోతున్నాను: రాళ్ళతో కొట్టకండి!" అని అరుస్తూ, మొసళ్ళలో ఒకటి నోరు తెరిచి కృపాణజిత్తు నడుంపట్టుకో బోయేంతలో దాని వెన్నుమీద కత్తితో బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు మొసలి బాగా గాయపడి నీళ్ళను అల్లకల్లోలం చేస్తూ తన్నుకోసాగింది. రెండవ మొసలి నది దిగువకు పోయి, పెద్దగా నోరుతెరిచి కృపాణజిత్తు కేసి రాసాగింది. అది చూసిన జలాశ్వం బెదిరి, కృపాణజిత్తు ఎంత గట్టిగా కళ్ళెం పట్టుకులాగుతున్నా ఆగకుండా, నది ఒడ్డుకేసి వేగంగా ఈదుకుంటూ పోయి, ప్రాణులను పట్టుకు తినే మృత్యువృక్షం వున్న ప్రదేశాన రొప్పుతూ గట్టు మీదికి ఎక్కింది.

ఆ మృత్యువృక్షానికి కొంచెం దూరంలో నిలబడివున్న మరుగుజ్జువాళ్ళు పెద్దగా కేకలు పెడుతూ, "ఒరే, మహాకాయా! గుర్రాన్ని వెనక్కు తిప్పు. లేకపోతే నువ్వు చెట్టుకు బలైపోతావు," అంటూ కృపాణజిత్తును హెచ్చరించారు.

కాని, జలాశ్వం అతడు ఎంత ప్రయత్నించినా ఆగకుండా మృత్యువృక్షం కిందికి వచ్చేసింది. అందుబాటులోవున్న కృపాణజిత్తును, మృత్యువృక్షం కొమ్మ ఒకటి గట్టిగా పట్టుకుని పైకి గుంజుకో సాగింది. —(ఇంకావుంది)





# మాయాసరోవరం

## 20

[మాయాసరోవరాన్ని చేరటానికి, సర్పనఖుడి సహాయం అవసరం అని జయశీలుడు భావించాడు. సర్పనఖుడు ముందుగా తన తమ్ముడు ఎక్కడ వున్నాడో తెలుసుకోదలిచాడు. సరోవరం దూరమాని కృపాణజిత్తు కంటబడగానే, అతడు జలాశ్వం మీద వెంట బడ్డారు. పారిపోతున్న కృపాణజిత్తును మృత్యువృక్షం కొమ్మ పట్టుకున్నది. తరవాత--]

మృత్యువృక్షం కొమ్మ ఒకటి కృపాణజిత్తు తల పట్టుకుని కొంచెం పైకి గుంజగానే, ఆ కొమ్మకు దాపులనున్న మరి రెండు చిన్న కొమ్మల్లో ఒకటి అతడి భుజాన్ని, మరొకటి చేతినీ ఒడిసిపట్టుకుని చప్పున పైకిలాగినై. కృపాణజిత్తు వాటి పట్టునుండి విడిపించుకునేందుకు కాళ్ళూ, చేతులూ ఆడిస్తూ, ''రక్షించండి! రక్షించండి!'' అంటూ అరవసాగాడు.

కృపాణజిత్తు ఆర్తనాదాలు విన్న మరుగుజ్జు లెవరూ అతడికి సాయపడేందుకు ప్రయత్నించలేదు. ఏ పరిస్థితుల్లో నయినా సరే, మృత్యువృక్షాన్ని సమీపించటం అంటే వాళ్ళకు తగని భయం. పైగా, యీ కృపాణజిత్తువల్ల వాళ్ళు లోగడ నానా అగచాట్లూ పడివున్నారు. జలాశ్వాన్ని మాత్రం మరుగుజ్జుల్లో కొందరు పారిపోకుండా పట్టుకున్నారు.







కొంచెం దూరంలో రాళ్ళగుట్ట మీద నిలబడివున్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ, గుట్టదిగి పరుగు పరుగున మృత్యు వృక్షం దగ్గిరకు వచ్చేలోపలే, సర్పనఖుడు జలాశ్వం మీద అక్కడికి వచ్చి, "నా తమ్ముడు ఎక్కడవున్నదీ ఎరిగిన ఒక్కొక్కడూ చచ్చిపోతున్నాడు. కాపాడాలి!" అంటూ కృపాణజిత్తును పట్టుకున్న కొమ్మల్లో ఒకదాన్ని తన కత్తితో బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు మృత్యువృక్షం మొదలునుంచి, చివరికొమ్మల వరకూ బలమైన గాలి తాకిడికి ఊగినట్టు ఊగిపోయింది. ఆ వెంటనే చిన్న మూలుగులాంటిది వినిపించింది. మరుక్షణం ఏటనవేలంత లావుగల పొడ వాటి కొమ్మ ఒకటి పాములా మెలికలు తిరుగుతూ కిందికి వంగి, సర్పనఖుడి మెడను చుట్టుకున్నది. సర్పనఖుడు, "హా, మాయాసరోవరేశ్వరా, రక్షించు!" అంటూ కేకపెన్నాడు. జలాశ్వం బెదిరి ముందుకు పరిగెత్తింది.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒక్క దూకున అక్కడికి వచ్చారు. సిద్ధసాధకుడు సర్పనఖుడి రెండు కాళ్ళూ పట్టుకుని కిందికి లాగుతూండగా, జయశీలుడు కత్తి దూసి, సర్పనఖుడి మెడను చుట్ట బెట్టిన కొమ్మను ఒక్కవేటున నరికాడు. సిద్ధసాధకుడు, సర్పనఖుడి తల నేలకు కొట్టుకోకుండా, అతణ్ణి తలకిందులుగా ఎత్తి పట్టుకుని, "ఒరే, నీటిపక్షి వెధవా! నువ్వు చేసిన దుస్సాహసంవల్ల, మాకు మాయాసరోవరానికి వెళ్ళే మార్గం చెప్పే వాడు లేకుండా పోయేవాడు!" అంటూ సర్పనఖుణ్ణి కాళ్ళమీద నిలబెట్టాడు.

సర్పనఖుడు రెండు చేతులతో మెడ పట్టుకుని బాధగా ఒకసారి మూలిగి, "నాకు తెలుసు, మాయాసరోవరేశ్వరుడు తన సేవకులను ఆపదలనుంచి తప్పక కాపాడతాడు," అన్నాడు.

ఆ మాటలకు సిద్ధసాధకుడు కోపంగా పళ్ళుకొరికి, "ఒరే, సర్పముఖం!





అప్పుడు నిన్ను కాపాడింది ఏ యజమాని అనుకుంటున్నావా?" అని అడిగాడు.

"స్వయానా ఆయన యిక్కడికి రాక పోవచ్చు: కాని మీ యిద్దర్నీ ఆవేశించి, నన్ను రక్షించాడు!" అంటూ సర్పనఖుడు తల ఎత్తి మృత్యువృక్షం కేసి చూసి, అక్కడ కొమ్మలనుంచి వేళ్ళాడుతున్న కృపాణజిత్తు కనబడగానే, "హా, నా తపస్సుకు సర్వస్వం ఎక్కడ వున్నదీ తెలిసినవాడు చచ్చిపోతున్నట్టున్నాడు, రక్షించాలి!" అంటూ వృక్షం కేసి పరిగెత్తబోయాడు.



జయశీలుడు అతడి భుజం పట్టుకుని వెనక్కులాగి, అక్కడ చేరిన మరుగుజ్జులతో, "మీ సేనాని ఎక్కడ? అతగాడికి ప్రాణభయంతో మతిస్థిమితం తప్పింది. నదిలో నాలుగైదు సార్లు ముంచి, గట్టున ఎండబెట్టండి," అన్నాడు.

మరుగుజ్జు సేనాని, అతడి అనుచరులూ వచ్చి పట్టుకోగానే సర్పనఖుడు పెద్దగా కేకలుపెట్టి, "నాకేం మతిస్థిమితం తప్పలేదు, అంతా తెలుస్తూనే వున్నది! మీరు మరుగుజ్జులు; వాళ్ళు జయశీలుడూ, కాపాలికుడూ; మన ముందున్నది మొసళ్ళ నది!" అన్నాడు.

"ఒరే, నీటి మనిషి, యిక నోరు ముయ్యి. నిన్ను మొసళ్ళకే ఆహారంగా వేయబోతున్నాం," అంటూ మరుగుజ్జులు, సర్పనఖుణ్ణి నదీజలంలోకి లాక్కుపోయారు.

ఆ సమయంలో అక్కడికి మరుగుజ్జు రాణి తన రథం మీద వచ్చింది. గడె కొండా, అతడి అనుచరులూ చేతులు కట్టుకుని, తలలు వంచి రథం వెంట వున్నారు. రాణిని చూస్తూనే జయశీలుడు, "మీ జాతి కలహాన్ని తన లాభంకోసం ఉపయోగించుకో చూసిన కృపాణజిత్తును మృత్యువృక్షం బలి తీసుకున్నది, అందరూ హాయిగా బతకండి. ఇక మా దారిన మేం పోతాం. పోయేముందు యీ మృత్యువృక్షాన్ని అగ్నికి ఆహుతి చేయదలిచాం.







అది ఏమరుపాటున వున్న చాలామంది ప్రాణాలను పొట్టన పెట్టుకుని వుంటుంది," అన్నాడు.

"అయ్యా, అలాగే చేయండి. మీ సహాయానికి చాలా కృతజ్ఞులం. ఆ వర వానరం యక్షమాని అంతమయాడు కాని, ఆ భయంకర వానరం మాత్రం యింకా యీ అరణ్యాల్లోనే ఎక్కడో తిరుగుతున్నది. రాత్రింబవళ్లు మా జాగ్రత్తలో మేం వుండక. తప్పదు." అన్నది రాణి.

జయశీలుడు జాలిగా ఆమె కేసి చూసి, "జలాశ్యాల మీద వచ్చిన సర్పనఖుడనే వాడు మాకు దొరికాడు. వాడి తమ్ముణ్ణి ఆ నరవానరం ఎత్తుకుపోయింది. సర్పనఖుణ్ణించి మాకు సాయం అవసరం కనక, అతడి తమ్ముణ్ణి వెతికే ప్రయత్నంలో ఆ భయంకర వానరం మాకు తటస్థపడితే, దాన్ని తప్పక చంపి తీరుతాం," అన్నాడు.

"దాన్ని చంపటం కాదు. మచ్చిక చేసి నేను వాహనంగా వాడుకోబోతున్నాను. నిప్పెక్కడ? మృత్యువృక్షాన్ని కాల్చి బూడిద చెయ్యాలి," అంటూ సిద్ధసాధకుడు చుట్టూ కలయచూశాడు.

మరుగుజ్జుల్లో నలుగురైదుగురు భగభగ మండుతున్న కాగడాలతో ముందుకు వచ్చారు. సిద్ధసాధకుడు వాళ్ళల్లో ఒకడి చేతినుంచి కాగడా తీసుకుని, "ప్రాణులను తిని బతికేది గనక, యీ వృక్షంలో కొంత మాంస లక్షణాలూ, కొవ్వు లక్షణాలూ గల పదార్థం వుండకపోదు. దూరంగా వుండి యీ మండే కాగడాలు విసిరి చూద్దాం, ఏమవుతుందో!" అంటూ కాగడాను చెట్టు కొమ్మల మీదికి విసరబోయాడు. అంతలో వెనకనుంచి, "ఆగు! పాపీ, చిరంజీవి మృత్యువృక్షాన్నే బూడిద చేయదలిచావా? అది నీ వల్లనవునా?" అన్న కేక వినిపించింది.

సిద్ధసాధకుడూ, జయశీలుడూ తలలు తిప్పి ఆ కేక వేసినవాడెవడా అని చూశారు. మామూలు మరుగుజ్జు జాతివాడయినా,







వాళ్ళకన్న రెండు మూడంగుళాల పొడవు వున్న వాడొకడు, మెడలో పూసలూ, భుజాన గొడ్డలి పెట్టుకుని—జుట్టు విరబోసుకుని, కుప్పిగంతులు వేస్తూ వచ్చి జయశీల, సాధకుల ముందు నిలబడ్డాడు.

సిద్ధసాధకుడు శూలంతో వాణ్ణి మృదువుగా తాకి చూసి, "ఎవడవురా నువ్వు? మహాకాళుడి భక్తుణ్ణయిన నన్నే, పాపి అనగలిగిన సాహసం నీకెక్కణ్ణించి వచ్చింది?" అని అడిగాడు.

ఆ వచ్చినవాడు నిర్భయంగా సిద్ధసాధకుడి ముఖంలోకి చూసి, తరవాత చేయి ఊపుతూ, "నేను చిరంజీవి మృత్యువృక్షం పూజారిని. ఇంతకు ముందు మీరు వృక్షాన్ని కత్తితో కొట్టినప్పుడు, అది పెద్దగా మూలగటం విన్నారుగదా?" అన్నాడు.

ఆ మాటలు వింటూనే జయశీలుడు, ఆ పొట్టి పూజారి కేసి అనుమానంగా చూసి, "చెట్టు వెనక వుండి అలా మూలిగింది నువ్వేకదా? నిజం చెప్పు," అని మెడ పట్టుకున్నాడు.

పొట్టి పూజారి ఏ మాత్రం తొణుక్కుండా, "అవును, అలా మూలిగింది నేనే! కాని మూలగమని శాసించినది వృక్షాన్ని ఆవహించివున్న మృత్యుదేవి. నేనామె పూజారిని, సేవకుణ్ణి," అన్నాడు.

జయశీలుడు, యిప్పుడు వీణ్ణి ఏం చేద్దాం అన్నట్టు సిద్ధసాధకుడి కేసి చూశాడు. సాధకుడు పొట్టి పూజారి భుజాన వున్న గొడ్డలిని తన చేతికి తీసుకుని, దాని పదునేపాటో పరీక్షించి చూసి, "ఒరే, జిత్తులమారి పొట్టి వెధవా! ఈ నాటితో మృత్యువృక్షానికి ఆయువు తీరిపోయినట్టే. దాని పూజారి వైన నీ ఉద్యోగం కూడా పోయింది. చేతిలో పదునైన గొడ్డలి వున్నది గనక, అరణ్యంలో ఎక్కడైనా కట్టెలు కొట్టుకుని బతుకు. అమాయక జీవుల ప్రాణాలు బలిగొనే మృత్యువృక్షం కాలి బొగ్గు కాబోతున్నది," అంటూ భగభగ మండు



తున్న కాగడాను చెట్టు కేసి విసరబోయేంతలో, పొట్టి పూజారి ఎగిరి అతడి చేయి పట్టుకున్నాడు.

"దుర్మార్గుడా, యీ మహాకాలుడి భక్తుణ్ణి తాకేంత దుస్సాహసం చేస్తావా?" అంటూ సిద్ధసాధకుడు పూజారిని విదిలించాడు.

పొట్టి పూజారి అంతదూరాన పోయి పడి లేచి, "అయ్యా, యీ మృత్యువృక్షం దుర్మార్గుల్నీ, మోసకాడుల్నీ తప్ప ధర్మపరుల్ని చంపదు," అన్నాడు.

అప్పటివరకూ అంతా చూస్తూ మౌనంగా వూరుకున్న జయశీలుడు చప్పున ముందుకు పోయి పొట్టి పూజారిని పట్టుకుని, "నువ్వు ధర్మపరుడవే గదా? ఎన్నడూ ఎలాంటి మోసాలూ చేసినవాడివి కావు; అవునా?" అని అడిగాడు.

"అయ్యా, అందుకు సందేహమా?" అన్నాడు పొట్టి పూజారి.

పూజారి యిలా అనగానే జయశీలుడు అతణ్ణి పైకెత్తి, మృత్యువృక్షం కేసి విసిరివేయబోయాడు. పూజారి ఒక చావు కేక పెట్టి, "అయ్యా, నన్ను వదలండి, భయంకర మరణంపాలు చేయకండి," అంటూ గడగడ వణికిపోసాగాడు.

జయశీలుడు నవ్వుతూ అతణ్ణి నేల మీదికి దించి, "సాధకా, యిక యిక్కడ మనం కాలం వృథా చెయ్యటం ఎందుకు? మృత్యువృక్షానికి నిప్పుపెట్టు," అన్నాడు.

సిద్ధసాధకుడు మరుగుజ్జుల చేతుల్లో నుంచి మండుతున్న కాగడాలు తీసుకుని వృక్షం బోదె కేసీ, కొమ్మల మీదికీ విసిరాడు. మరుక్షణం నూనెలో తడిపిన ఎండుకట్టెలా మృత్యువృక్షం ముట్టుకుని, పెద్ద మంటలతో, పొగలతో కాలిపోసాగింది.

జయశీలుడు చెట్టు కొమ్మల నుంచి వేళ్ళాడుతున్న కృపాజిత్తు శవం కేసి చూసి, నిట్టూరుస్తూ, "వీడు అమరావతి నగర రాజుగారి అశ్వదళనాయకుడు. ఒక జూదగృహంలో వీడికీ, నాకూ వచ్చిన



తగు ఫలంగానే, నే నిలా అరణ్యాల పాలు కావలసివచ్చింది. దుర్మార్గుడికి మంచి చావు దుర్లభం! అదే పాఠశాలలో నా మిత్రుడైన దేవశర్మ అనే అతనుండే వాడు. అతనూ దేశాలు పట్టిపోయాడు. ఎక్కడ తిరుగుతున్నాడో ఏమో!" అన్నాడు.

"మనం మాయాసరోవరాన్ని చేరి, హిరణ్యపురం రాజుగారి పిల్లల్ని బంధ విముక్తుల్ని చేసేలోపల, అతడూ మన కెక్కడో తటస్థపడక పోడు. తప్పిపోయిన వాళ్ళను మహానగరాల్లో వెతికి పట్టుకో వటం కన్న, అరణ్యాల్లో వెతికి పట్టటం తేలిక," అన్నాడు సిద్ధసాధకుడు.

"అవును, సాధకా! నీ మాటలు వింటూంటే, నాకూ నమ్మబుద్ధవుతున్నది. సర్పనఖుడెక్కడ?" అంటూ జయశీలుడు చుట్టూ కలయచూశాడు.

సర్పనఖుడు ఒక జలాశ్వాన్ని ఎక్కి దూరంగా వున్న కొండల కేసి చూస్తూ, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. జయశీలుడు అక్కడ వున్న రెండవ జలాశ్వాన్ని సిద్ధసాధకుడికి చూపుతూ, "సాధకా, ఈ అశ్వాన్ని వృథాగా యిక్కడ వదలటం ఎందుకు? మనలో ఎవరో ఒకరం ఉపయోగించుకోవచ్చుగదా?" అన్నాడు.

"జయశీలా, ఆ జలాశ్వం నీదే. నేను కాలినడకన నిన్ను అనుసరించగలను. ఎప్పటికైనా ఆ భయంకర నరవానరం నా కంటబడితే, దాన్ని క్షణాలమీద మచ్చిక చేసి వాహనంగా చేసుకుంటాను," అన్నాడు సాధకుడు.

"సాధకా, నువ్వన్నంత పనీ చేయగలవు. సరే, యిక బయలుదేరదామా?" అని జయశీలుడు అక్కడ వున్న రాణీ, గదెకొండలతోపాటు మిగతా మరుగుజ్జులందరినీ ఉద్దేశించి, "మీ ప్రబలశత్రువైన కృపాణజిత్తు, అదుగో కాలిపోతున్న మృత్యువృక్షంతోపాటు బూడిద అయిపోతున్నాడు. ఇక మీకు వచ్చిన భయం ఏమీ లేదు. సుఖంగా జీవించండి. ఇక మా దారిన మేం పోతాం," అన్నాడు.





జయశీలుడు ముందు జలాశ్వం మీదా, కొంచెం వెనకగా సిద్ధసాధకుడూ బయలు దేరేసరికి, మరుగుజ్జువాటి వాళ్ళందరూ, జయజయధ్వానాలు చేశారు. అది విన్న సర్పనఖుడు చప్పున తలతిప్పి, దూరంగా పోతున్న జయశీల, సిద్ధసాధకులను కేకవేసి పిలుస్తూ, "జయశీల, సిద్ధ సాధకులారా, కొంచెం ఆగండి! నా తమ్ముడి కోసం వెతకాలిగదా, నేనూ వస్తున్నాను." అంటూ తన అశ్వాన్ని వేగంగా వాళ్ళ దగ్గిరకు పరిగెత్తించాడు.

జయశీలుడు అతణ్ణి ఒకసారి పరీక్షగా చూసి, "నదీ స్నానం నీకు మేలు చేసినట్టున్నది. యిక ఏ దారిన నువ్వు పోవచ్చు. మేం ఇద్దరం మాయాసరోవరం ఎక్కడ వున్నదో వెతికి తెలుసుకుని, దాని యజమానిని ముక్కలు ముక్కలుగా నరికి, నీటి పక్షులకూ, జంతువులకూ ఆహారంగా వేయబోతున్నాం." అన్నాడు.

ఆ మాటలకు సర్పనఖుడు ముఖం అయిష్టంగా పెట్టాడేతప్ప, జవాబేమీ యివ్వలేదు. తరవాత ముగ్గురూ ఒక అరగంట కాలం అరణ్యంలో ప్రయాణించి, లోగడ జయశీలుడూ, సిద్ధసాధకుడూ జలపాతం నుంచి నదిలో పడిన ప్రాంతాన్ని చేరారు.

జయశీలుడు పూర్వం తమకు ఆ ప్రాంతాల కలిగిన అనుభవం గురించి సర్పనఖుడికి చెప్పబోయేంతలో, సర్పనఖుడు చెయ్యెత్తి కొంచెం దూరంలో వున్న కొండ గుహల్లో ఒకదాన్ని వాళ్ళకు చూపుతూ, "ఆ గుహలో నుంచి తొంగి చూస్తున్న భయంకర మృగం నరవానరం కాదా?" అన్నాడు.

"అవును, నరవానరమే!" అంటూ జయశీలుడు ఆశ్చర్యపోయేంతలో నరవానరం భయంకరంగా అరుస్తూ గుహ నుంచి బయిటికి దూకింది. ఆ మరుక్షణం పెద్దగా ఘీంకరిస్తూ, మకరకేతు వాహనమైన జలగ్రహం గుహ నుంచి వెలువడి, నరవానరాన్ని తొండంతో పడిసి పట్టుకున్నది. —(ఇంకావుంది)







# మాయాసరోవరం

## 21

[ఘన అశ్వశత్రువైన కృపాజిత్తు, మృత్యువృక్షానికి బలి అయిపోగానే, జయశీలుడు సిద్ధసాధకుడితో కలిసి మాయాసరోవరం ఎక్కడ వున్నదీ సైనికి తెలుసుకునేందుకు బయలు దేరారు. సర్పనఖుడు వాళ్ళను అనుసరించాడు. ఒక గుహలోంచి బయటికి వచ్చిన నరవానరాన్ని, జలగ్రహం తొండంతో పట్టుకోవటం వాళ్ళ కంటబడింది. తరవాత -]

జలగ్రహాన్ని చూస్తూనే జయశీల, సిద్ధ సాధకులతోపాటు సర్పనఖుడు కూడా అమితాశ్చర్యం చెందాడు. అతడు జలాశ్వం మీది నుంచి, ''జయశీల, సిద్ధ సాధకుల్లారా! జలగ్రహం అనే ఈ నీటి ఏనుగు మహాశక్తి సంపన్నుడైన మకరకేతు వాహనం. ఆయన మాయాసరోవరేశ్వరుడి నుంచి సేవకోత్తమ బిరుదు పొందిన మనిషి!'' అన్నాడు.

సర్పనఖుడు యిలా అనగానే సిద్ధ సాధకుడు, ''జై, మహాకాళా!'' అంటూ శూలం పైకెత్తి, ''ఒరే, నీటి మనిషీ, యిక నోరు ముయ్యి! ఆ మకరకేతు శక్తి ఏపాటిదో మాకు తెలియంది కాదు. నాకు వాహనం కానున్న నరవానరాన్ని పంపజూస్తున్న ఆ జలగ్రహాన్ని ముందు పంపి, ఆ తరవాత దాని యజమాని అయిన మకరకేతును, మహాకాళుడికి







బలిపెట్టబోతున్నాను,'' అంటూ గుహలకేసి పరిగెత్తబోయాడు.

జయశీలుడు, ''సాధకా, ఆగు, తొందరపడకు!'' అంటూ సిద్ధసాధకుణ్ణి వారించి, తానెక్కి వున్న జలాశ్వాన్ని అతడి ముందుకు నడిపి, చిన్న గొంతుతో, ''సాధకా, మనం మాయాసరోవరాన్ని చేరటానికి యిప్పుడు చక్కని అవకాశం కలగబోతున్నది. ఆ మకరకేతుతో మంచిగా మాట్లాడి, ఏదో విధంగా మనం రాజు కనకాక్షుడి పిల్లలను అపహరించుకుపోయిన మాయాసరోవరేశ్వరుడి దగ్గరకు చేరాలి. నువ్వు కొంచెం శాంతించు,'' అన్నాడు.

సిద్ధసాధకుడు ఎత్తిన శూలాన్ని దించి, ''ఆ మకరకేతు యింకా బతికి వున్నాడన్న నమ్మకం ఏమిటి? డొక్కలో గుచ్చుకుపోయిన కత్తి, భుజం మీద బోయభీముని బాణం చేసిన గాయాలతో. వాడిప్పటికే మరణించి వుంటాడు. ఈ జలగ్రహం యజమానిని కోల్పోయి, యీ కొండల్లో, అరణ్యాల్లో విచ్చలవిడిగా తిరుగుతూండి వుంటుంది,'' అన్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ యిలా మాట్లాడుతూండగా జలగ్రహం, నరవానరం గుహ ముందున్న మైదాన ప్రదేశంలో భయంకరంగా అరుస్తూ పోరాడుతున్నవి. ఏనుగు తొండం పట్టు నుంచి బయటపడి, నరవానరం దాని వెన్ను మీదికి లంఘించి, వాడి కోరలతో దాని కుంభస్థలాన్ని పీకుతూ, చేతులతో ఏడా పెడా కొడుతున్నది. అంతలో ఏనుగు దాన్ని తొండంతో పట్టి కిందికి ఝాడ్చి, కాళ్ళతో మట్టగించి చంపాలని ప్రయత్నిస్తున్నది.

''సాధకా, యీ దుష్టమృగాలు రెండూ ఒకదానికొకటి తీసిపోనివి. మకరకేతు మరణించి వుంటాడని ఎందుకనుకుంటున్నావు? అదుగో చూడు, గుహ పైభాగాన వున్న రాళ్ళ మీద ఒకడు గాదు; మొత్తం నలుగురు మనుషులు నిలబడి,

యీ భయంకర ఘోరాజాన్ని చూస్తున్నారు," అన్నాడు జయశీలుడు.

సిద్ధసాధకుడు జయశీలుడు చెప్పిన వైపుకు దృష్టి సారించాడు. జయశీలుడు చెప్పినట్టు అక్కడ నలుగురు మనుషులు నిలబడి వున్నారు. ఆ నలుగురిలో వేషాన్ని బట్టి ఒక్క మకరకేతునే సాధకుడు పోల్చుకోగలిగాడు. కాని, అక్కడ వున్న మకరకేతుతోపాటు మరిద్దరు జయశీలుణ్ణి గుర్తించారు. అయినా, వాళ్ళల్లో ఒకడు ఆశ్చర్యంతో, మరొకడు భయంతో కళ్ళప్పగించి అలా చూస్తూ వుండిపోయారు.



మకరకేతు అందరికేసీ ఓ మారు చూసి, వాళ్ళల్లో నిండుగా ఒల్లెవాటు వేసుకుని, నల్లని చిన్న గడ్డంతో, వజ్రాలు తాపిన బంగారు పొన్ను కర్ర చేత పట్టుకున్న అతడితో, "వైద్యదేవా! జలాశ్వం మీద వున్న యువకుడే జయశీలుడు: శూలంపట్టి నేలమీద నిలబడిన వాడు సిద్ధసాధకుడు: ఆ మూడోవాడు— తెలుస్తూనే వున్నది గదా, నా అనుచరుల్లో ఒకడు—ఈ సర్పస్వరుడి అన్న," అన్నాడు.

"మా అన్నను ప్రాణాలతో తిరిగి చూస్తానని, నేననుకోలేదు," అంటూ సర్పస్వరుడు బయలుదేరబోయేంతలో, మకరకేతు కోపంగా అతడి చేయి పట్టుకుని వెనక్కు లాగాడు.

"ఒరే, సర్పస్వరా, పిసరైనా మతి పోయిందా? ఆ జయశీలుడూ, సాధకుడూ ఒకరకంగా మనకు శత్రువులు. అయినా, మాయాసరోవరేశ్వరుడి ఆజ్ఞ ప్రకారం మనం వాళ్ళతో స్నేహం నటించవలసి వున్నది. అందుకు అవసరం అయిన పథకం జాగ్రత్తగా ఆలోచించాలి," అని మకరకేతు సర్పస్వరుణ్ణి గట్టిగా కోప్పడి, వజ్రాలు తాపిన చేతికర్ర పట్టుకున్న అతడితో, "వైద్యదేవా, మీ అభిప్రాయం ఏమిటో సెలవిచ్చారు కాదే?" అన్నాడు.



ఆ వైద్యదేవుడని పిలవబడిన అతను కొండ దిగువకు ఒకసారి ఆశ్చర్యపోతూ చూసి, "మకరకేతూ, నువ్వు ఆ మైదానంలో ఏం జరుగుతున్నదో గమనిస్తున్నట్టు లేదు. నరవానరం చేతకాక, నువ్వనె ఆ జయశీలుడి కత్తి దెబ్బకు నీ జలగ్రహం త్వరలోనే ప్రాణాలు విడవబోతున్నది." అన్నాడు.

మకరకేతు మైదానం కేసి తల తిప్పి చూసి, "హా, మాయాసరోవరేశ్వరా!" అంటూ ఒక కేకపెట్టి, గబగబా కొండ దిగసాగాడు. అతడి వెనకగా తక్కిన వాళ్ళు బయలుదేరారు. వాళ్ళల్లో పాతిక ఏళ్ళ వయసు గలవాడొకడున్నాడు. వాడి కుడి కాలు కొయ్యి కాలు. వాడు ఒక లావుపాటి కర్ర చేతబట్టుకుని, దాని ఆసరాతో, తతిమ్మావాళ్ళ వెంట, మెల్లిగా కొండ దిగసాగాడు.

తను వాహనంగా చేసుకుందామనుకున్న నరవానరం, జలగ్రహం బారికి తట్టుకోలేక పారిపోజూస్తున్నదని సిద్ధసాధకుడు గ్రహించగానే, అతడు శూలం ఎత్తి మైదానం కేసి బయలుదేరాడు. జయశీలుడు అతణ్ణి హెచ్చరిస్తూ, "సిద్ధసాధకా, మనం యీ సారి ఒక్క మకరకేతునేగాక, అతడి వెంట వున్న మరి ముగ్గురుని కూడా ఎదుర్కోవలసి రావొచ్చు. తగు జాగ్రత్తలో వుండు." అన్నాడు.

"జయశీలా, మనం యీ లోకంలో ఎవరికీ భయపడవలసిన అవసరం లేదు. సాక్షాత్తూ మహాకాలుడి వంటు యిచ్చిన మహత్తు గల కత్తి నీ దగ్గిర వున్నది; ఇక నా శూలం శక్తిని గురించి చెప్పనవసరమే లేదు గదా!" అన్నాడు.

సర్పనఖుడు వాళ్ళ వెనక జలాశ్వం మీద వస్తూ, "అయ్యో, ఆ నరవానరాన్ని చంపండిగాని, జలగ్రహానికి మాత్రం హాని చేయకండి. దాని యజమాని పౌరుష శాలి; మహాసత్వుడు." అని బిగ్గరగా కేకపెట్టాడు.

"నువ్వనే ఆ మహాసత్త్వుణ్ణి, నా శూలానికి గుచ్చి, చర్మం ఒలపబోతున్నాను, తెలిసిందా? ఇక నోరు మూసుకో." అని సాధకుడు పళ్లు కొరికి, "జై, మహాకాళా!" అంటూ వేగంగా ముందుకు పరిగెత్తాడు.

సాధకుడు పోరాడుతున్న జంతువులను సమీపించే లోపలే జయశీలుడు జలాశ్వం మీద వాటి దగ్గిరకుపోయి, నేలమీద వెల్లకిలా పడివున్న నరవానరాన్ని జలగ్రహం తొండంతో పట్టుకోబోయే సమయంలో, దాని తొండం మీద కత్తిపిడితో బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు జలగ్రహం బాధతో ఒకసారి ఘీంకరించి, జయశీలుడికేసి దూకబోయింది. జయశీలుడు ఒడుపుగా జలాశ్వాన్ని పక్కకు నడిపి, ఎగిరి జలగ్రహం మీదికి దూకాడు.

అప్పుడు జలగ్రహం తన శత్రువైన నరవానరాన్ని వదిలి, జయశీలుణ్ణి తన వెన్నుమీది నుంచి కిందికి లాగేందుకు తొండాన్ని తలమీదుగా వెనక్కు తిప్పి, అతణ్ణి పట్టుకోబోయింది. జయశీలుడు ఆ తొండాన్ని ఎడమ చేతితో బిగించి పట్టుకుని, కుడిచేత గల కత్తిపిడితో దాని కుంభస్థలం మీద గట్టిగా మోదసాగాడు.

ఆ సమయానికి మకరకేతు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చాడు. అతణ్ణి చూస్తూనే జయశీలుడు, "కేతూ, ముందు నీ జలగ్రహాన్ని హతమార్చు. తరవాత నీ అంతేదో తేలుస్తాను. నీ గారవంగా





నేనూ, సాధకుడూ యీ అరణ్యాలలో నానా యాతనలూ అనుభవించాం.'' అన్నాడు.

''జయశీలా, నీ పుణ్యం వుంటుంది, శిలాగ్రహాన్ని చంపకు! ఈ క్షణం నుంచీ మనం మిత్రులం. నీ కొక్కవలసింది మాయాసరోవరాన్ని ఎలా చేరటం అన్నదే గదా? ఆ మార్గమేదో నేను చెపుతాను.'' అన్నాడు మకరకేతు.

ఆ మాట వింటూనే జయశీలుడు చప్పున శిలాగ్రహం మీదిమంచి కిందికి దూకి, ''నాక్కావలసింది, మాయాసరోవరానికి మార్గమొక్కటే కాదు, అక్కడ బంధించబడి వున్న కనకాక్ష రాజుగారి కొడుకూ, కూతురూ కూడా బంధ విముక్తులు కావటం. అందుకు నిన్నిక్కడ ఏ గుహలోనో బంధించి, నీ ప్రభువు మాయాసరోవరేశ్వరుడికి నజరు చేయటం ఎలావుంటుంది?'' అన్నాడు.

మకరకేతు జవాబిచ్చే లోపలే సిద్ధసాధకుడు, ''హై, హహహా!'' అంటూ ఒక కేకపెట్టి, ''జయశీలా, నువ్వు చేయనున్న పని దివ్యంగా వుంటుంది. పారిపోకుండా వుండేందుకు వాడి రెక్క సగం నరికి గుహలో కాళ్ళూ, చేతులూ కట్టి పడెయ్యి. వాడి స్నేహితులు ముగ్గురినీ, యీ నరవానరానికి తరవాత ఆహారంగా పెడదాం,'' అని నరవానరం గుండెల దగ్గిర చెవిపెట్టి విని, దాని నాడి పరీక్షించి చూసి, ''ఇది చావలేదు. గాని, ఆ నీటి ఏనుగు దెబ్బలకు స్పృహ కోల్పోయింది. ఒరే, ఎక్కడరా నీటి పక్షి సర్పనఖా! వెంటనే నదికిపోయి, ఏదైనా వస్త్రాన్ని బాగా నీళ్ళల్లో తడిపి తీసుకురా,'' అని, సర్పనఖుణ్ణి ఆజ్ఞాపించాడు.

సర్పనఖుడు పొంగే కోపాన్ని అణచుకుంటూ, మకరకేతు కేసి చూశాడు. అది గమనించిన సిద్ధసాధకుడు శూలం ఎత్తి పట్టుకుని అతడి దగ్గిరకు వచ్చి, ''ఒరే, నీటి పక్షి వెధవా! ఇక్కడ యజమాని ఎవరనుకుంటున్నావు? నేను!





నూం చెప్పిన పని త్వరగా చెయ్యి." అంటూ హుంకరించాడు.

మకరకేతు మాటా పలుకూ లేకుండా నిలబడి దిక్కులు చూడటం గమనించిన సర్పనఖుడు, వెంటనే కదిలి కొద్ది దూరంలో ఉన్న నది కేసి వెళ్ళాడు. సిద్ధసాధకుడు, మకరకేతును సమీపించి, "ఒరి, కేతూ! నీ వెంట మరి ముగ్గురు నీలా మనుషుల్ని తెచ్చావులా ఉంది!" అంటూ సమీపానికి వస్తున్న వాళ్ళ కేసి చూసి, "ఆశ్చర్యంగా ఉందే! వెంట కొయ్యకాలు వాణ్ణి కూడా తెచ్చావెందుకు?" అని అడిగాడు.

"సాధకా, అతడు మాలాగా మాయా సరోవర ప్రాంతాల పుట్టి పెరిగినవాడు కాదు, మీ లాంటి పుట్టుమనిషి. అతడూ తనకు చేతనైన పద్ధతుల్లో, మీ కనకాక్ష రాజుగారి పిల్లల్ని వెతుకుతూ బయలుదేరి, అరణ్యంలో చిరుతపులి నోటికి చిక్కి, కాలు పోగొట్టుకున్నాడు. అతడి పేరు, మంగళవర్మ." అన్నాడు మకరకేతు.

"వీరబాహుపుర సేనాని కొడుకు, మంగళవర్మా? జయశీలుడితోపాటు పోటీపడి, పులులతో పోరాడబోయి పారిపోయిన పిరికి వెధవా?" అంటూ సిద్ధసాధకుడు ఆశ్చర్యపోయి, "జయశీలా, ఆ కొయ్యకాలువాడు మంగళవర్మ; గుర్తించావా?" అన్నాడు.

జయశీలుడు, అంతకుముందే మంగళవర్మను గుర్తుపట్టాడు. కానీ, అతడు



మకరకేతు 'వైద్యదేవా!' అని పిలిచే వ్యక్తిని గుర్తించి, సంభ్రమాశ్చర్యాలతో నిలువెల్లా కంపించిపోతూ, "దేవశర్మా!" అని పిలవబోయి నోట మాటపెగలక తత్తరపడుతున్నాడు. అది గమనించిన వైద్యదేవుడనే అతను, చిన్నగా సైగ చేశాడు. దాని అర్థం తనను గుర్తించినట్టు ప్రవర్తించవద్దని.

నదికి నీటికోసం పోయిన వర్మసఖుడు వస్త్రాన్నొకదాన్ని నీట తడిపి, అది నీరోడుతుండగా తెచ్చి సిద్ధసాధకుడి చేతికి యిచ్చాడు. సాధకుడు గబగబా పోయి నీటిని నరవానరం తలమీద పిండి, అరచేతితో దాని తలమీద గట్టిగా కొడుతూ, "నరవానరా, నువ్వు నిశ్చయంగా బతికే వున్నావు. లే,లే! లోకంలో ఈ సిద్ధసాధకుడి మాటకు తిరుగులేదు," అంటూ బిగ్గరగా అరిచాడు.

నరవానరం మరుక్షణం కళ్ళు తెరిచి, చుట్టూ కలయచూసి, అల్లంత దూరంలో నది ఒడ్డున తొండం ఎత్తి నిలబడిన జలగ్రహాన్ని చూస్తూనే, భయంకరంగా అరిచి, లేవబోయింది.

సిద్ధసాధకుడు దాని భుజం పట్టుకుని ఆపి, "ఒరే, నరవానరా, శాంతించు! నేను, నీకు ప్రాణదానం చేసిన సిద్ధసాధకుణ్ణి, గుర్తుపెట్టుకో! ఈ నిమిషం నుంచీ నువ్వు. నా బంటువు: వాహనానివి, అవునా!" అన్నాడు శూలాన్ని దాని పీక మీద ఆనించి.

నరవానరం లేచి నిలబడి, గుర్రుమంటూ, పళ్ళుకొరికి, సాధకుడి మీదికి దూకేందుకు సిద్ధపడబోయేంతలో, సాధకుడు దాని నుదుటి మీద అరచేతితో గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బ తింటూనే నరవానరం చిన్నగా మూలిగి, వెనుదిరిగి పారిపోబోయినదల్లా ఆగి, చప్పున సిద్ధసాధకుడి పాదాల ముందు బోర్లాపడి, చేతులు పైకెత్తింది. అది చూసి సిద్ధసాధకుడు ఆనందం పట్టలేక పొట్ట చెక్కలయేలా నవ్వుతూ, శూలాన్ని గిరగిరా తిప్పసాగాడు. —(ఇంకా వుంది)







# మాయాసరోవరం

## 22

[పర్వతపంక్తిలోని కొండ గుహల ముందున్న మైదానప్రదేశంలో జయశీల, సిద్ధసాధకులకు మకరకేతు కనిపించాడు. అతడి వెంట జయశీలుడి బాల్యమిత్రుడైన దీపశల్కు, సేనాని కొడుకు మంగళవర్మ కూడా వున్నారు. సిద్ధసాధకుడు ఖడ్గహస్తుండై నరవానరాన్ని కాపాడాడు. అది చేతులెత్తి సాధకుడి ముందు బోర్లపడిపోయింది. తరవాత—]

నరవానరం, సిద్ధసాధకుడికి మచ్చిక అయిపోవటం చూసి, మకరకేతుతోపాటు అందరూ ఆశ్చర్యపోయారు. జయశీలుడు తృప్తిగా ఓసారి నవ్వి, "ఇన్నాళ్ళకు సిద్ధసాధకుడు ఒక వాహనాన్ని సంపాయించినట్టుంది! కాని, అది చాలా ప్రమాదకరమైన వాహనం. కృపాణజిత్తు అనేవాణ్ణి, అది చంపినంతపని చేసింది. ఈ సర్పస్వరుణ్ణి ఎత్తుకుపోయింది. అయినా ఎలా ప్రాణాలతో బయటపడ్డాడో తెలియటం లేదు." అన్నాడు.

"సర్పస్వరుణ్ణి, నేను నరవానరం నుంచి రక్షించాను. అతడి ద్వారా నువ్వు ప్రాంతాలవున్నట్టు తెలిసింది." అన్నాడు మకరకేతు.

జయశీలుడు, మకరకేతును ఆపాదమస్తకం ఒకసారి పరీక్షగా చూసి, "నువ్వు తిన్న ప్రాణాంతకమైన గాయాల







మా పేమిటి? ఇంత త్వరలో నువ్వు కోలుకోవటం, నా కెంతో ఆశ్చర్యంగా వుంది." అన్నారు.

మకరకేతు, దేవశర్మను చూపుతూ, "కొండల్లో ఒకచోట చావుబతుకుల మధ్య వున్న నన్ను, ఈయన తన చికిత్సతో రక్షించాడు. అందరూ వైద్యదేవుడని పిలుస్తారు గనక, నేనూ వీరిని ఆ పేరుతోనే పిలుస్తున్నాను. ఆ మధ్య ఒకసారి వీరితో మాయాసరోవరానికి వెళ్ళి, తిరిగి యిక్కడికి వచ్చి, నీ కోసం గాలిస్తున్నాను," అన్నాడు.

అమరావతి నగరంలో బాల్యమిత్రుడూ, పాఠగృహంలో తనతోటి సూదరి అయిన దేవశర్మ. ఎప్పుడు వైద్య విద్య

యిలా వైద్యదేవుడయ్యాడో జయశీ

అర్థం కాలేదు. అతడు దేవశ

సమస్కరించి, "అయ్యా, వైద్యా

ఈ మంగళవర్మ తమ అనుచరుడా

అని అడిగాడు.

ఆ మాటలకు దేవశర్మ నవ్వి, "మ

వర్మ నా శిష్యుడు. నా దగ్గిర వైద్య

నేర్చుకుంటున్నాడు. ఒకప్పుడి

మాయాసరోవరం చేరాలని వుం

అవునా, వర్మా?" అన్నాడు.

మంగళవర్మ బాధగా నిట్టూరుస్తూ

వంచి ఒక క్షణం తన గాయ్యాలు

చూసుకుని, ఏమో చెప్పబోయేం

ఆకాశంమీది నుంచి పెద్దగా రె

చప్పుడు వినిపించింది. అందరూ త

ఎత్తి చూశారు.

ఆకాశంలో చిన్న హంసల గుంపొ

ఒక రథాన్ని లాగుతూ ఎగురుతూ

ఆ దృశ్యం చూస్తూనే మకరకేతు

సర్పనఖ, సర్పస్వరులూ చేతు

"జై, మాయాసరోవరేశ్వరుడికి!" అం

ఏక కంఠంగా కేకపెట్టారు.

ఆ కేక హంసల రథంలో వున్న

విని వుంటాడు! మరుక్షణం

ఆకాశంలో ఒక క్షణకాలం ఆగి,

కిందుగా వాళ్ళున్న చోటుకు వే

ఎగురుతూవచ్చి, దాపులనున్న నదీజలంలో దిగింది.

నది తీరంలో వున్న మకరకేతూ, అతడి అనుచరులైన సర్పసఖా, సర్పస్వరులూ రథం నీట దిగగానే, ఆశ్చర్యపోతూ దానికేసి చూసి, "సరోవరేశ్వరుడెక్కడ? ఆయన అంగరక్షకుడు ఒంటరిగా రథం మీద ఎందుకొచ్చినట్టు?" అని ఒకళ్ళనొకళ్ళు ప్రశ్నించుకుంటూ, తీరంనుంచి నీటిలోకి దూకి, రథం దగ్గిరకు పోయారు.

అప్పుడు ఒడ్డున జయశీలుడూ, సిద్ధసాధకుడూ, వైద్యదేవుడి పేరుతో చెలామణి అవుతున్న దేవశర్మా, సేనాని కొడుకు కొయ్యకాలి మంగళవర్మా మాత్రమే వున్నారు. జయశీలుడు, దేవశర్మకు కనుసైగచేసి, మంగళవర్మతో, "వర్మా, మనం ఏ నాడూ శత్రువులం కాదు; మిత్రులం కూడా కాదు. నువ్వు మాయా సరోవరానికి వెళ్ళివచ్చినవాడివిలా కనిపిస్తున్నావు. ఆ మాట నిజమేగదా? అక్కడ కనకాక్షరాజుగారి పిల్లలు కాంచనమాలా, కాంచనవర్మా ఎలావున్నారు?" అని అడిగాడు.

మంగళవర్మ ఏదో జవాబివ్వబోయి, తలవంచి తన కొయ్యకాలు కేసి ఒకసారి చూసుకుని, తరవాత తలఎత్తి దేవశర్మ కేసి చూస్తూ, "అలాంటి ప్రశ్నలకు జవాబివ్వాలంటే వైద్యదేవుల అనుమతి కావాలి," అన్నాడు.





"నీ గురుభక్తి మెచ్చదగిందే, వర్మా!" అని జయశీలుడు అతణ్ణి మెచ్చుకుని, "అయితే, నా ప్రశ్నను వైద్యదేవుణ్ణే అడుగుతున్నాను," అన్నాడు.

అంతలో అక్కడికి, "జై, మహాకాళా!" అంటూ సిద్ధసాధకుడు నరవానరం మీద ఎక్కి వచ్చి, "జయశీలా! నువ్విలా తాపీగా యీ నీటి పక్క వెధవల్తో మాట్లాడ తావేం? అవతల ఆ మొసలి ముఖం వాడూ, వాడి నేస్తాలూ, ఆ దిక్కుమాలిన పక్షుల రథం ఎక్కి, పారిపోవాలని చూస్తున్నట్టున్నది." అన్నాడు.

"సాధకా, నిజంగా వాళ్ళు పారిపోవాలని చూస్తే, మనం ఆపగలమా?
ఒకవేళ వాళ్ళుపోయినా, ఇక్కడ వా
అనుచరులిద్దరున్నారు కదా!" అన్నా
జయశీలుడు.

సిద్ధసాధకుడు మంగళవర్మ కే
దేవశర్మ కేసి కళ్ళురుముతూ ఒకసా
చూసి, "ఈ మంగళవర్మ మనం ఎం
వాడే! ఈ రెండో అతను నీటిమనిషి
లేదు. మనం మాయాసరోవరం
టానికి సాయపడేవాళ్ళు నదిలోకి వెళ్ళా
వాళ్ళు అటునుంచి అటే పారిపోవ
జరిగితే, ఇక యిప్పట్లో మనం మా
సరోవరాన్ని చేరలేం," అన్నాడు.

ఆ మాటలకు దేవశర్మ చిన్నగా కో
తెచ్చుకుని, "సాధకా, నీలో ఆలోచ
కన్న, ఉద్రేకంపాలెక్కువలా వు
ఆ మకరకేతు పనిగట్టుకుని, యీ కొ
ప్రాంతాలకు ఎందుకొచ్చాడనుకున్నావ
నిన్నూ, నీ మిత్రుణ్ణీ ఆ మాయాసరోవరా
తీసుకుపోయేందుకే. అక్కడ భయంక
లైన జలవృక్ష రాక్షసుడి అనుచరుల
మీ యిద్దరూ పోరాడి, ప్రాణాలతో బయ
పడవలసి వుంటుంది." అన్నాడు.

"జలరాక్షసులా? వాళ్ళను మ
కాళుడి అండతో, యీ శూలానికి గుచ్చ
నీటి నుంచి లాగి, ఒడ్డున పడవేయగల
ఇక జయశీలుడా! అతడి దగ్గర మ
కాళుడి బంటు కాలకాలుడు స్వయా

బహూకరించిన ఖడ్గం వుండనే వున్నది," అన్నాడు సిద్ధసాధకుడు.

దేవశర్మ ఎవరో తెలియని సాధకుడు ఆతడితో గిల్లి కజ్జా పెట్టుకునే ప్రమాదం వున్నదని గ్రహించిన జయశీలుడు, దేవశర్మతో, "అయ్యా, వైద్యదేవా! మీ శిష్యుడైన యీ మంగళవర్మను పంపి, నదిలో మకరకేతు హంసలరథం వాటితో ఆడుతున్న మంత్రతనా లేమిటో తెలుసుకో వచ్చుగదా," అన్నాడు.

జయశీలుడు అలాంటి సూచన ఎందుకు చేశాడో గ్రహించిన దేవశర్మ, మంగళవర్మతో, "శిష్యా, మంగళా! నువ్వుపోయి, ఆ హంసల రథంలో మాయాసరోవరేశ్వరుడు కాక, ఆయన అంగరక్షకు లెందుకున్నారో తెలుసుకురా," అన్నాడు.



మంగళవర్మ, దేవశర్మకు తలవంచి నమస్కరించి నదికేసి నడిచాడు. ఆతడలా వెళ్ళిపోగానే జయశీలుడు, దేవశర్మతో, "శర్మా, ఇప్పుడు చెప్పు—మాయాసరోవరేశ్వరు డనేవాడు అపహరించుకు పోయిన హిరణ్యపురం రాజకుమార్తె, కుమారుడూ క్షేమంగా వున్నారా?" అని అడిగాడు.

"వాళ్ళిద్దరూ క్షేమమే. కాని, వాళ్ళు అపహరించబడినందుకు నువ్వూనే హిరణ్యపురం రాజూ దుఃఖిస్తూంటే, ఆ అపహరించుకు వచ్చినందుకు ఆ మాయాసరోవరేశ్వరుడు విచారపడుతున్నాడు," అన్నాడు దేవశర్మ.

జయశీలుడూ, దేవశర్మా యిలా సంభాషించుకునేంతలో సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ నరవానరం మీది నుంచి కిందికి దూకి, "జయశీలా, ఏమిటీ చిత్రం? మీరిద్దరూ లోగడే ఒకరి నొకరు ఎరిగివున్నవాళ్ళా? ఆ సంగతి యింతసేపై ఎందుకు దాచావు?" అని అడిగాడు.

జయశీలుడు అతడిని మెల్లిగా మాట్లాడమని హెచ్చరించి, "సాధకా, కొంచెం శాంతించు. ఈ దేవశర్మా, నేనూ బాల్య







మిత్రులం. మా యిద్దరిదీ అమరావతి నగరం. ఆ నగరంలో ఒకప్పుడు అందె వేసిన జూదగాళ్ళం—అదంతా పెద్ద కథ! ఇప్పుడు మేం యిద్దరం మిత్రులం అనే సంగతి మకరకేతుకు తెలియకూడదు. అలా తెలిస్తే, మనం ఆ మాయాసరోవ రేశ్వరుడనే వాణ్ణి చిత్రవధ చేసి, కాంచనమాలా, కాంచనవర్మలను బంధ విముక్తుల్ని చేసే అవకాశం వుండదు." అన్నాడు.

"అదా సంగతి! ఇప్పుడీ పిట్టలరథం గాధ వచ్చిపడిందే, దీని వెనక వున్న రహస్యం ఏమిటి? ఈ రహస్యం ఏమిటో మన యిద్దరికీ మిత్రుడైన దేవశర్మకు తెలిసివుండాలి!" అంటూ సాధకు ఒక్క ఊపున పోయి దేవశర్మను ఆశ యంగా కౌగలించుకున్నాడు.

దేవశర్మ నవ్వుతూ సిద్ధసాధకు భుజం తట్టి, "మాయాసరోవరంలోని ఇ వృకరాక్షసుణ్ణి, నువ్వు చంపగలిగితే, నీ మహాకాలుడి నుంచి సర్వశక్తులూ సిద్ధిం గలవు. ఆ జలవృకుడు, నువ్వు ఆరాధిం మహాకాళుడికి బద్ధవిరోధి!" అన్నాడు

"అలాగా! వాణ్ణిపట్టి, నా వాహనమై యీ నరవానరానికి మేతగా వేస్తాన ఏం అంటావు నరవానరా!" అంటూ సి సాధకుడు నరవానరం భుజాన్ని శూలం చిన్నగా తాకాడు.

నరవానరం ఎగిరి గంతేసి, నది ఒడ్డు నిలబడివున్న ఏనుగు జలగ్రహం కే బయలుదేరింది. సాధకుడు చప్ప ముందుకుపోయి, దాని చెయి పట్టుకు "అగు, నరవానరా, అగు! ఇప్పు మనం మకరకేతూ, అతడి యజమా అయిన మాయాసరోవరేశ్వరుడి మిత్రుల ఆ నీటి ఏనుగు ని అన్నలాంటి గుర్తుంచుకో!" అన్నాడు.

ఆ మాటలకు దేవశర్మ బిగ్గరగా నవ్వి తన చేతిలోని వజ్రాలు తాపిన ఖడ్గం పైకెత్తి, నదికేసి చూపుతూ, "అక్క మాయాసరోవరంలో ఏదో గందరగోళ

జరిగివుండాలి. అలా కాకపోతే, సరోవరేశ్వరుడు జలవిహారం తిరిగే, యీ హంసలరథం యిలా ఆకాశంలోకి ఎగిరి, యిక్కడ యీ నదిలో వాలివుండదు.” అన్నాడు.

దేవశర్మ యిలా అంటూండగా ముందు మంగళవర్మ, అతడి వెనకగా విచారంతో తల వంచుకుని మకరకేతూ అక్కడికి వచ్చారు. మకరకేతు కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూ, “వైద్యదేవా! ఇంతకు ఒక గంటకాలం ముందు సరోవరంలో హంసలరథం మీద జలవిహారం చేస్తూన్న మాయా సరోవరేశ్వరుణ్ణి, ఆయన వెంట వున్న రాజకుమారి కాంచనమాలనూ, జలప్పుకుడి రాక్షసులు హఠాత్తుగా నీటి నుంచి పైకి తేలి, పట్టుకోవాలని చూశారు. రథాన్ని నడిపేవాడూ, అంగరక్షకుడూ ఆ ప్రమాదం తప్పించేందుకు రథాన్ని, నీటిలో నుంచి ఆకాశంలోకి ఎగిరించారు. కాని....” అంటూ యిక మాట్లాడలేక కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ నిలబడిపోయాడు.

దేవశర్మ ఎక్కడలేని ఆదుర్దాకనబరుస్తూ, “రథంలో వుండవలసిన సరోవరేశ్వరుడూ, రాజకుమారి కాంచనమాలా ఏమయారు?” అని అడిగాడు.

మకరకేతు తనను తాను సంబాళించుకుని, “ఘోరం జరిగిపోయింది, వైద్యదేవా! హంసలరథం ఇలా ఆకాశంలో ఎగురుతూండగా, వాటి మీదికి రాబందు



పక్షుల గుంపొకటి వచ్చి పడిందట. హంసలు బెదిరి, చెల్లా చెదరుగా పారిపోయే ప్రయత్నంలో రథాన్ని తలకిందులు చేసినై. ఆ సమయంలో నరదేవేశ్వరుడూ, రాజకుమారి, రథాన్ని తోలేవాడూ—ముగ్గురూ పట్టుతప్పి, మహారణ్యంలో ఎక్కడో పడిపోయారు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే దేవశర్మతో పాటు, జయశీలుడూ, సిద్ధసాధకుడూ నిర్విణ్ణులయిపోయారు. "రాజకుమారి కాంచనమాల అంత ఎత్తు నుంచి పడి ప్రాణాలతో వుండటం అసంభవం! సాధకా, ఇంతకాలంగా మనం చేసిన శ్రమా, పడిన కష్టాలూ—అంతా వ్యర్థం!" అన్నాడు, జయశీలుడు ఒరలోని కత్తిని బయటికి లాగి, దూరంగా విసిరివేస్తూ.

"తన తండ్రికి జరిగిన ప్రమాదం సంగతి వింటే పద్మముఖి ఏ అఘాయిత్యానికి ఒడికట్టుతుందో!" అంటూ దేవశర్మ చేతిలోని పత్రాలు తాపిన కర్రను గట్టిగా నేలకేసి కొట్టాడు.

సిద్ధసాధకుడు నిబ్బరంగా అంద ముఖాల కేసి ఓమారు చూసి, "నిరా శపడకండి! రథం నుంచి జారిన ఆ ఇద్దర ఏ కలువకొలనులోనో, గుబురుకొమ్మ ఏ వటవృక్షం మీదనో పడి సుర తంగా వుంటారు. మనం వాళ్ళను వె కేందుకు కొందరిని పంపి, మిగతావాళ్ళ పోయి ఆ జలరాక్షసులను మహాకాళుడి బలియిద్దాం. ఆ మాయాసరోవరం ఎం దూరంలో వుంటుంది?" అన్నాడు.

సిద్ధసాధకుడు మాట ముగిం లోపలే నదివైపు నుంచి, "జలరాక్షసుల జలరాక్షసులు!" అన్న కేకలు వి పించినై.

జయశీలుడితో పాటు అక్కడున వాళ్ళందరూ చప్పున తలలు తిప్పి న కేసి చూశారు. తోడేలు తలలుగ కొందరు రాక్షసులు, రాతి గదల పైకెత్తి, నదిలో ఈదుతూ హంసల రథాని చుట్టుముట్టేందుకు, దాని కేసి వేగం వస్తున్నారు. —(ఇంకా వుంది





# మాయాసరోవరం

## 23

[జయశీల, సిద్ధసాధకులకు నది దగ్గిర మకరకేతుతోపాటు దేవశర్మ కూడా కనిపించాడు. ఆ సమయంలో హంసలరథం ఒకటి వచ్చి నదిలో దిగింది. ఆ రథం మీదినుంచి ఘోర అరణ్యంలో వదిలిపోయిన మాయాసరోవరేశ్వరుణ్ణి, కాంచనమాలనూ ఎలా రక్షించటమా అని వాళ్ళు ఆలోచించేంతలో జలమృగరాక్షసులు హంసలరథం మీదికి దాడి వచ్చారు. తరవాత—]

హంసల రథాన్ని చుట్టుముట్టి పట్టుకోవాలని చూస్తున్న జలరాక్షసులు కంటబడగానే, జయశీలుడు దూరంగా పారవేసిన కత్తిని చప్పున చేతికి తీసుకుని, "వీళ్ళవా జలమృగ రాక్షసులు! తోడేళ్ళ తలలూ, మానవ శరీరాలూ—వింతగా వున్నారు," అన్నాడు.

మకరకేతు తన చేతగల ఆయుధాన్ని పైకెత్తి పట్టుకుని, ఎంతో ఆదుర్దా పడ పోతూ నాలుగడుగులు నది కేసి నడిచి, అంతలోనే ఆగిపోయి, జయశీలుడితో, "జయశీలా! ఈ జలరాక్షసులు హంసల రథాన్ని పట్టుకోవాలని చూస్తున్నారు. వాళ్లను హతమార్చేందుకు మాకు సాయం రాలేవా?" అని అడిగాడు.

జయశీలుడు తాపీగా తన కత్తిని ఒరలో పెడుతూ, "మా కనకాక్షరాజు గారి పిల్లలను మీ మాయాసరోవరపు







రాజును అపహరించుకుపోయారు. నాకు వాళ్ళను రక్షించవలసిన బాధ్యతే కాక, ఈ దుర్మార్గానికి పాల్పడిన మీ రాజు మీద పగ తీర్చుకోవలసిన అవసరం కూడా వున్నది. ఆ హంసల రథంలో మీ రాజు లేకపోవటం, అతగాడి అదృష్టం. తెలిసిందా?" అన్నాడు కోపంగా.

ఆ జవాబుకు మకరకేతుడు వెలవెల పోయి, దేవశర్మతో. "వైద్యదేవా, జయశీలుడికి మా మీద యింత గాఢమైన శత్రుత్వం వుంటుందని నేనూహించలేదు. రాచపిల్లల కెలాంటి హాని, మాయాసరోవరేశ్వరుడు చేయకపోగా, వాళ్ళిద్దరినీ ఎంతో ప్రేమగా సాకుతున్నాడు," అన్నాడు.

"జయశీలా, నా మాట విని, ముందు కత్తిని ఒరలోనుంచి బయటికి లాగు. సరోవరేశ్వరుడి మీద పగ సాధించేందుకు యిది సరి అయిన తరుణం కాదు," అన్నాడు దేవశర్మ.

ఆ మరుక్షణం జయశీలుడు కత్తి దూశాడు. ఆ వెంటనే సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ ఎగిరి నరవానరం మీద కూర్చున్నాడు. కనుమూసి తెరిచేంతలో అందరూ భీకరంగా అరుస్తూ పోయి, నదిలో దూకి, జలరాక్షసులను ఎదుర్కొన్నారు.

ఈ లోపల హంసల రథంలో వున్న అంగరక్షకుడు రథాన్ని జలరాక్షసుల చేతబడకుండా నదిలో అటూ ఇటూ పరిగెత్తించసాగాడు. ఏనుగు జలగ్రహం మీద ఎక్కి, కత్తి తిప్పుతూ తన పైకి వచ్చిన మకరకేతుణ్ణీ, నరవానరం మీద సవారీ చేస్తూ పచ్చిపడిన సిద్ధసాధకుణ్ణీ చూసి జలరాక్షసులు హడలిపోయారు. వాళ్ళు పారిపోయేందుకు నీట మునగ బోయేంతలో, మకరకేతుడు ఉసికొల్పిన జలగ్రహం, వాళ్ళను తొండంతో పట్టి ఎత్తి, నది ఒడ్డుకు విసిరి వేయసాగింది. జయశీలుడు నీళ్ళలో ఈదుతూ, అందిన శత్రువులను అందినట్టు తన కత్తితో పొడవసాగాడు.





ఒక పావుగంట కాలం గడిచే లోపలే జలవృక రాక్షసుల్లో కొందరు మరణించారు. చాలామంది బాగా గాయపడి, నీట మునగలేకా, తేలలేకా నదీజలం వాలున పడి కొట్టుకుపోసాగారు. జలగ్రహం తొండంతో చుట్టి ఒడ్డుకు విసిరిన వాళ్ళు, నడుమూ, కాళ్ళూ చేతులూ విరగటంతో, లేచి నీటి దగ్గరకు పోబోయి, అది సాధ్యంకాక కీచుమని అరుస్తూ గిలగిలా తన్నుకోసాగారు.

పెద్దసాధకుడు ఎక్కివున్న నరవానరం ఒక జలవృక రాక్షసుణ్ణి రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, సాధకుడితోపాటు నీటి నుంచి బయటికి వచ్చింది. అతడి వెనకగా మకరకేతుడూ, సర్పసఖి, సర్పస్వధులూ ఒడ్డు చేరారు. జయశీలుడు మాత్రం హంసల రథంలో ఎక్కి కూర్చుని, అందులో వున్నవాడికి కత్తి చూపి బెదిరిస్తూ, ''ఒరే, సరోవరేశ్వరుడి అంగరక్షకుడా, రథాన్ని ఒడ్డుకుచేర్చు! రథంతో పాటు ఆకాశంలోకి ఎగిరి పారిపోవాలని చూశావో, ముందు నీ తల మొండెం నుంచి వేరైపోతుంది, జాగ్రత్త!'' అని హెచ్చరించాడు.

ఆ మాటలకు అంగరక్షకుడు కళ్ళెర్ర చేసి, ''మహాశక్తి సంపన్నుడైన మాయా సరోవరేశ్వరుడి అంగరక్షకుణ్ణి, నేను! అలాంటి నన్ను యింతవరకూ యిలా దూషించి అవమానపరిచిన వాడెవడూ లేడు!'' అన్నాడు.





"నేనున్నాను! ఏదీ, చూస్తాను. కత్తి దూయగలవా?" అంటూ జయశీలుడు తన కత్తిని కిందపెట్టి, ఎడమ చేత్తో అంగరక్షకుడి మెడను గట్టిగా వడిసి పట్టుకున్నాడు.

అంగరక్షకుడు ఆ గుప్పెట బిగింపుకు విలవిల్లాడిపోతూ, "నువ్వెవరోగాని గొప్ప ధైర్యశాలివేగాక, బలవంతుడివి కూడా. నా మెడ వదులు," అన్నాడు.

జయశీలుడు అతడిని వదిలి, "ఇక మారు మాట్లాడకుండా, ఈ రథాన్ని ఒడ్డుకు నడుపు. నీ యజమాని గురించి, నీతో మాట్లాడవలసింది చాలా వున్నది." అన్నాడు.

అంగరక్షకుడు మరి నోరెత్తకుండా హంసలను అదిలించి, వాటిచేత రథాన్ని నది ఒడ్డుకు లాగించాడు. రథం ఒడ్డుకు చేరగానే సిద్ధసాధకుడు ఉత్సాహంగా నరవానరం మీది నుంచి కిందికి దూకి, వానరం చేతుల్లో భయకంపితుడై వున్న జలవృక రాక్షసుడి చెవులు రెండూ పట్టుకుని నేలమీదికి దింపి, "ఓరీ, నీటి తోడేలు వెధవా, పారిపోవాలని చూశావో చిత్రవధ చెయ్యగలను!" అని హెచ్చరించి, హంసల రథం దగ్గిరకుపోయి, "జయశీలా! ఈ రథంమీద నరవానరంతో హిమాలయ శిఖరాలకుపోయి, అక్కడ తపస్సు చేసుకోవాలని వున్నది. మా ఇద్దర్నీ యిది మోయగలదంటావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు చిరునవ్వు నవ్వుతూ జయశీలుడు, రథంలో వున్న అంగరక్షకుడి కేసి చూశాడు. అంగరక్షకుడు రథచక్రాన్ని కళ్ళకద్దుకుని, "అయ్యా, యిది మహత్తుగల రథం. ఈ హంసలు కేవలం అలంకార ప్రాయమైనవి. సరోవరేశ్వరుడు కోరితే రథం, ఏడేడు పధ్నాలుగు లోకాలూ చుట్టబెట్టి రాగలదు. నా మాట నమ్మండి," అన్నాడు.

"అలాగా! అంత మహత్తైన రథం అరణ్యంలో రాబందుల బాధకి తలఒగ్గిందు

లెందుకైంది? ఆ సమయంలో నువ్వనే మాయాసరోవరేశ్వరుడు కూడా రథంలోనే వున్నాడు కదా? ఇక నోరుముయ్యి. శూలానికి గుచ్చి నది మధ్యకు విసిరివేయగలను," అంటూ సిద్ధసాధకుడు అంగరక్షకుడి పైకి శూలం ఎత్తాడు.

జయశీలుడు అతణ్ణి శాంతింపమని, "సాధకా, రథంమీద నుంచి అరణ్య వృక్షాల్లోకి జారిపడింది ఒక్క సరోవరేశ్వరుడే కాదు; హిరణ్యపురం రాజు కనకాక్షుడి కుమార్తె కాంచనమాల కూడా ఆ ప్రమాదానికి గురైంది. ఆ మాట మరవకు." అన్నాడు.



మకరకేతుడు విచారంగా ముఖంపెట్టి, "జయశీలా, మా రాజును వెతికి రక్షించేందుకు మేం యీ హంసల రథం మీద బయలుదేరుతున్నాం. ఆ మహారాజు ఎలా వున్నాడో ఏమో?" అన్నాడు.

"మేమూ బయలుదేరుతున్నాం. రాజకుమార్తె కాంచనమాల ఏమైందో తెలుసుకోవాలి. ఒకవేళ ఆమెకు పెద్ద ప్రమాదం ఏమైనా జరిగివుంటే, అందుకు మీ రాజుదే పూర్తి బాధ్యత. అతడి తలను కనకాక్ష రాజుకు కానుకగా యివ్వబోతున్నాము," అన్నాడు జయశీలుడు.

అంతవరకూ తలవంచుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్న దేవశర్మ, అప్పుడు చప్పున తల పైకెత్తి, "జయశీలా, లోగడ చెప్పాను. పగ సాధించేందుకు యిది సమయం కాదని. వెంటనే బయలుదేరి ఆ సరోవరేశ్వరుడూ, కాంచనమాలా అరణ్యంలో ప్రాణాలతో వున్నారో లేదో తెలుసుకోవటం ముఖ్యం," అన్నాడు.

"అవశ్యమను. సరోవరరాజు మాటేమో గాని, కాంచనమాల సజీవురాలు అవునో కాదో తెలుసుకోవటం నాకూ, సిద్ధసాధకుడికీ ముఖ్యం. ఏం, సాధకా, యిక ప్రయాణం అవుదామా?" అన్నాడు జయశీలుడు.

సిద్ధసాధకుడు చుట్టూ ఒకసారి కలయచూసి, "ఇంత భీకర మహారణ్యంలో



వాళ్ళు ఎక్కడ పడిపోయారో తెలుసుకోవటం ఎలా?" అన్నాడు.

సాధకుడు ఇలా ప్రశ్నించగానే మొదటి రథంలోని అంగరక్షకుడు ఒడ్డును దిగి, సాధకుణ్ణి సమీపించబోయి, నర వానరం కళ్ళురమగానే వెనక్కు రెండడుగులువేసి, "అయ్యా, స్వా. రాజుగారూ; కాంచనమాల అనే రాజకుమారి అరణ్యంలో పడిపోయిన చోటు నాకు బాగా తెలుసు. ఆ ప్రదేశానికి దాపులనే ఒక కొండవున్నది: ఆకాశాన్నంటే మహా వృక్షాలున్నవి: ఒక చోట చెట్టూచేమా లేని బీళ్ళప్రదేశాన్నుంచి, తెల్లని పొగ ఆకాశం కేసి లేస్తున్నది," అన్నాడు.

"అది సంగతి! అంగరక్షకుడి సాయంతో మనం ఆ ప్రదేశాన్ని చేరగలం. ఇక రథం ఎక్కండి," అంటూ దేవశర్మ రథం కేసి బయలుదేరాడు.

"వైద్యదేవా! రథంలో అందరికీ చోటుంటుందా? సిద్ధసాధకుడూ, అతడి వాహనం మాటేమిటి? మకరకేతు తన జలగ్రహంతో ఆకాశంలోకి ఎగిరి, మనను అనుసరిస్తాడా?" అన్నాడు జయశీలుడు.

దేవశర్మ అందరికేసి ఓమారు చూసి, "వాహనాలున్న వాళ్ళంతా, తమ వాహనాల మీద రావలసిందే. ఏం, సాధకా? ఏం, మకరకేతూ?" అన్నాడు.

మకరకేతు, సిద్ధసాధకుడి కేసి చూశాడు. సిద్ధసాధకుడు పళ్ళుకొరుకుతూ మకరకేతు కేసి గుచ్చి చూస్తూ, "మేము, మీ అంత వేగంగా మా, ఆ అరణ్య ప్రాంతాన్ని చేరగలం. కాని. దారిలో యీ మకరకేతు ఏదైనా మోసం చేయాలని చూశాడో యితగాణ్ణి నా నరవానరానికి మేతగా వేస్తాను." అన్నాడు.

"సాధకా, కోప్పడకు. ఇప్పుడు మన మంతా మిత్రులం." అన్నాడు మకరకేతు నవ్వేందుకు నానా హైరానాపడిపోతూ.

"ఈ మాట చాలాసార్లు విన్నాను! రాజుగారి పిల్లలు కాంచనమాలా, కాంచనపల్లా సురక్షితంగా మాకు దొరికేవరకూ,

మీ మాయాసరోవరం తుండాగాళ్ళందరూ మాకు పరమ శత్రువులు!'' అన్నాడు సిద్ధసాధకుడు.

ఆ తరవాత సాధకుడూ, మకరకేతూ తప్ప మిగతా వాళ్ళందరూ హంసల రథంలో ఎక్కారు. అంగరక్షకుడు వాళ్ళిద్దరికీ వెళ్ళవలసిన దిక్కు చూపించి, ''ఒక పెద్దకొండా, మేఘాలను తాకే మహావృక్షాలూ.... బాగా గుర్తుంచుకోండి,'' అన్నాడు.

హంసలరథం ఆకాశంలోకి లేచింది. అది అలా కనబడకుండా పోగానే సిద్ధసాధకుడు నరవానరం భుజాల మీద ఎక్కి కూర్చుని, ''కేతూ, ఇంక బయలుదేరుదామా?'' అన్నాడు.

మకరకేతు తల ఊపి, జలగ్రహం మీదికి పోయాడు. అంతలో సాధకుడికి బందీగా దొరికిన జలవృకరాక్షసుడు, అతడికి ప్రాణాపారం పడిపోతూ, ''మహావీరుడా, నన్ను మీ బంటుగా వెంట తీసుకుపోండి. ఈ నాటినుంచి నేను తమ సేవకుణ్ణి!'' అన్నాడు.

ఆ మాటలకు సిద్ధసాధకుడు ఉప్పొంగిపోయి, ''సరే, జలవృకా. లెస్స పలికావు! నా నరవానరం అంత వేగంగా నన్ననుసరించి రాగలవా?'' అన్నాడు.

''చాలా, నాకు రెక్కలేకపోతే తక్కువ, అయినా నేలమీద ఆకాశంలోని పక్షి అంత వేగంగానూ పరిగెత్తగలను,'' అన్నాడు జలరాక్షసుడు.



"ఆహా, మెచ్చదగిన మాటరా, సేనానీ!" అంటూ సిద్ధసాధకుడు, జల రాక్షసుడి భుజంతట్టి, నరవానరాన్ని అదిలించబోయేంతలో అక్కడికి, మరుగుజ్జు సేనాని కొందరు అనుచరులతో కలిసి పొటేళ్ళ వాహనాల మీద వచ్చాడు.

"ఓహో, వీర మరుగుజ్జు సేనానా! ఏమిటీ విశేషం?" అని అడిగాడు సిద్ధసాధకుడు.

మరుగుజ్జు సేనాని, నది ఒడ్డున గాయపడి గిలగిల్లాడుతున్న జలస్పృక రాక్షసులను సాధకుడికి చూపుతూ, "దొరా, యిక్కడ జరిగినదంతా మేమూ గుట్టచాటున వుండి చూశాం. ఈ జోడెలు తలల మనుషుల్ని ఏం చేయనున్నారు? వీళ్ళనిలా చికిత్స లేకుండా చావనివ్వటం ధర్మం కాదు గదా?" అన్నాడు.

"మంచి మాట పలికావు! ఆ దుర్మార్గుల్ని చికిత్స చేసి పరలోకానికి పంపు. కాని జాగ్రత్త, కాస్త ఊపిరి, శక్తి రాగానే వాళ్ళు మిమ్మల్ని పట్టుకుతినేసే ప్రమాదం వున్నది," అన్నాడు సిద్ధసాధకుడు.

సిద్ధసాధకుడు మాట ముగించే లోపలే, మరుగుజ్జు సేనాని నదికి ఆవలివైపునున్న అరణ్యం కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "దొరా, అటుకేసి చూడండి! ఆకాశాన్నంటుతున్న ఆ తెల్లని పొగ ఏమిటి? మహారణ్యం నిలువునా కాలిపోతున్నదా?" అన్నాడు.

"అరణ్యం కాలటం కాదు; ఆ పొగకు కారణం అయిన మంటల్లో మాయా సరోవరేశ్వరుడనే దుర్మార్గుడి శరీరం, సజీవదహనం అవుతున్నది! నరవానరా, ఆ లేస్తున్న పొగకేసి వాయువేగంతో పరిగెత్తు," అంటూ సిద్ధసాధకుడు వానరాన్ని అదిలించాడు.

నరవానరం అరణ్యం ప్రతిధ్వనించేలా ఒక కేక పెట్టి, వేగంగా బయలుదేరింది. దాని వెనకగా జలస్పృక రాక్షసుడూ, ఏనుగు విగ్రహం మీద మకరకేతుడూ కదిలారు. —(ఇంకా వుంది)





# మాయాసరోవరం

## 24

[హంసలరథం ఎక్కి దాడి వచ్చిన జలవృకరాక్షసులను జయశీలుడూ, అతడి అనుచరులూ ఎదుర్కొని, పారదోలారు. మాయాసరోవరేశ్వరుడూ, రాజకుమారి కాంచనమాలా రథం మీది నుంచి అరణ్యంలో పడిపోయిన చోట, తెల్లని పొగ లేస్తూండటం చూసి, అందరూ ఆ ప్రదేశానికి బయలుదేరారు. తరవాత—]

హంసల రథం తలకిందులైనప్పుడు, అందులో నుండి జారిపడిన మాయా సరోవరేశ్వరుడూ, కాంచనమాలా, రథం తోలేవాడూ—ముగ్గురూ అరణ్యంలో ఒకే ప్రదేశాన కాక, వేరు వేరు ప్రదేశాల్లో పడిపోయారు. అలా పడటంలో మాయా సరోవరేశ్వరుడు నేలనుతాకి ప్రాణాలు కోల్పోలేదుగాని చాలా విచిత్రమైన అనుభవానికి మాత్రం గురయ్యాడు.

అతడు హంసలరథం నుంచి పడిన ప్రదేశాన, నరభక్షకులు నివసిస్తున్నారు. వాళ్ళకు అప్పటికి వారం రోజులుగా అరణ్యంలో వేటాడేందుకు ఏ జంతువూ దొరకలేదు. అందుక్కారణం, అక్కడికి చాలా దూర ప్రాంతం నుంచి ఆహారం వెతుక్కుంటూ ఒక పులుల గుంపు రావటం! ఆ పులులు కనబడిన లేళ్లనూ, ఇతర సాధు ప్రాణులనూ వెంటబడి







తరిమి, దొరికిన వాటిని తినసాగినై. ఆ వేటలో అవి చేసే భయంకర శబ్దాలకు బెదిరి అడవి జంతువులన్నీ దాపులనున్న కొండలు దాటి, అవతలికి పారిపోయినై.

నరభక్షకుల నాయకుడి పేరు జెబ్బూరి దొర. అతడికి తన అనుచరులలో నమ్మకస్థుల ద్వారా, తన జాతి వాళ్ళల్లో కొందరు పలాయనం చేయబోతున్నారని తెలియవచ్చింది. అతడికి తన పూర్వులు ఎన్నో తరాలుగా పుట్టి పెరిగి గిట్టిన ఆ అరణ్య ప్రాంతాన్ని వదిలి పోవటం మహా పాపంగా తోచింది. తాము అక్కడ లేకపోతే, ఊడలమర్రి నీడలో వున్న శిథిలదేవాలయంలోని అరణ్యదేవరకు, సంవత్సరానికొకసారి అయినా, నరమాంసాన్ని నైవేద్యం పెట్టేవాళ్లెవరు?

జెబ్బూరిదొర యిలా ఆలోచించాడు. ఏ విధంగా అయినా సరే తన జాతి వాళ్ళను ఆ ప్రాంతం వదిలిపోకుండా కట్టుదిట్టం చేయాలనుకున్నాడు. అందుకవసరం అయిన శక్తినివ్వమని ప్రార్థించేందుకు ముందుగా అతడు ఊడలమర్రి కింద వున్న అరణ్యదేవర ఆలయానికి బయలుదేరాడు.

ఆ ఆలయం అతి పురాతనమైనది. దానికి తలుపులూ, దర్వాజాలంటూ ఏమీ లేవు. వానాకాలంలో పెనుతుఫాను గాలికి తట్టుకోలేని అరణ్య మృగాలు కొన్ని అప్పుడప్పుడూ రాత్రివేళల్లో అందులో తలదాచుకోవటం జరుగుతూంటుంది.

ఆ రోజు సూర్యోదయం వేళ జెబ్బూరిదొర శిథిల దేవాలయంలోకి పోతూనే ఒక అద్భుతం చూశాడు. ఒక పెద్ద కొండచిలువ, అరణ్యదేవర విగ్రహం ముందు, ఒక తోడేలును తన శరీరంతో చుట్టబెట్టి వున్నది. కాని, దాని తల తోడేలు నోటికి చిక్కి వున్నది. ఆ రెండూ ఒకదాన్నొకటి చంపేందుకో, లేక ప్రాణాలతో బయటపడేందుకో తీవ్రంగా పెనుగులాడుతున్నవి.





ఈ దృశ్యం చూసి బెబ్బులిదొర భయ కంపితుడై, వెనుదిరిగి పారిపోబోయి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, దూరంగా అరణ్యదేవర రాతివిగ్రహం ముందు ప్రాణాచారం పడిలేచి, "ఆహా, అరణ్య దేవరా, నీ మహత్తులు మహా చిత్రమైనవి గదా! వారం రోజులుగా నీ భక్తులమైన మా జాతివాళ్ళం ఆకలితో నకనక లాడుతున్నాం. వాళ్ళ నాయకుడైన యీ బెబ్బులిదొరకు, యీ అద్భుతం కళ్ళ గట్టేట్టు చూపించి, ఏమని ఆజ్ఞాపిస్తు న్నావు?" అన్నాడు.

ఆ వెంటనే కూలిపోయిన గోడ వాళ్ళల్లోంచి ఒక అడవిపిల్లి తల బయటికి పెట్టి, చెవులు గింగుర్లెత్తేట్టు, "మ్యావ్! మ్యావ్!" అన్నది.

"ఇది మరొక మహత్తు! దీని గూఢార్థాలు ముసలి గణాచారి చెప్పా ల్సిందే!" అంటూ బెబ్బులిదొర పెద్దగా ఒక కేకపెట్టి, తన జాతివాళ్ళ దగ్గిరకు పరుగు, పరుగున వచ్చాడు.

ఆ సమయంలో నరభక్షకులు ఆడా, మగా, పెద్దా, చిన్నా అందరూ అరణ్యం లోని ఒక చిన్న మైదాన ప్రదేశంలో కూర్చుని, ఆకలి పోగొట్టుకునేందుకు ఏ చెట్లకాయలో, దుంపలో, వేళ్ళో తినటం ఎలా వుంటుందని, కడబట్టిన



ప్రాణాలతో చర్చించుకుంటూ, మధ్య మధ్య కయ్యాలాడుకుంటూ, జుట్లు జుట్లు పట్టుకోబోతున్నారు.

బెబ్బులిదొర శిధిలదేవాలయం నుంచి వాళ్ళ మధ్యకు రొప్పుతూ రోస్తూ వచ్చి, "అరణ్యదేవర మనను కనికరించాడు! గణాచారి ఎక్కడ?" అంటూ అరిచాడు.

నరభక్షకులంతా ఒక్కసారిగా తమ నాయకుడి కేసి చూశారు. అతడి మాటల్లో వాళ్ళకు లేళ్ళ గుంపులూ, అడవి పందుల మందలూ కనిపించినై. వాళ్ళల్లో కొందరు కుర్రవాళ్ళు ఎగిరి గంతేసి. "బెబ్బులి దొరా, అరణ్యదేవర గుళ్ళో లేళ్ళూ, దుప్పులూ ఏమైనా చేరినయ్యా? ఈటెలూ,



కత్తులా అంటుకోమంటావా?" అని అడిగాడు.

బెబ్బులిదొర చుట్టూ ఓమారు కలయ చూసి, గణాచారి కనబడకపోయేసరికి గట్టిగా విసుక్కుని, "ఒరే, చప్పు వెధవల్లారా, నేనడిగిందేమిటి? మీ రనేదేమిటి? ముసలి గణాచారి ఏమయ్యాడు? అరణ్యదేవర గుళ్ళో కనబడినదాంట్లో, ఏదో గూఢార్థం వున్నది. విప్పి చెప్పగలవాడు గణాచారొక్కడే. పిలవండి!" అన్నాడు.

గణాచారి దూరంగా వున్న ఒక చెట్టు నీడన కూర్చుని, ఆకలితో ప్రాణం కొసకు రాగా కునికిపాట్లు పడుతున్నాడు. అరదు చెట్టు కింద వున్న సంగతి కుర్రవాళ్ళు చెప్పగానే, బెబ్బులిదొర గణాచారి దగ్గిరకుపోయి, తాను గుళ్ళో చూసినదేమిటో చెప్పి, "గణాచారి, దాని అర్థమేమిటి?" అని అడిగాడు.

గణాచారి ఆ మాటలు సరిగా వినిపించుకోక, యింకా కునికిపాట్లు పడుతూనే, "మన జాతి గణాచారిగా, నా జుట్టు నెరిసిపోయింది. అరణ్యదేవర ఏదీ సూటిగా చెప్పదు; అన్నీ గూఢార్థాలే! నాకు తోస్తున్నదేమంటే, మన జాతివాళ్ళు కూడా, తతిమ్మా అరణ్య జాతుల్లాగే, దొరికినప్పుడు మాంసం, అది దొరకనప్పుడు వెదురు బియ్యాలు, కాయా కసురూ తిని బతకటం నేర్చుకోవటం మంచిదని." అన్నాడు.

ముసలి గణాచారి మాట ముగించే లోపలే బెబ్బులిదొర పక్కన వున్న ఒకట్టుంచి కర్ర లాక్కుని, "ఒరే, దుర్మార్గుడా! మన జాతి మాంసం తప్ప మరేమీ ముట్టకూడదని కట్టడి వున్న సంగతి మరిచావా?" అంటూ గణాచారి వీపు మీద గట్టిగా ఒక చరుపు చరిచాడు.

ఆ దెబ్బకు గణాచారి లేచి నిలబడి, జుట్టు విదిలించుకుని, "అరణ్యదేవరో!" అంటూ ఒక కేకపెట్టి, "ఒరే బెబ్బులీ, యిప్పుడు చెప్పు! సంగతేమిటి? నీ దెబ్బతో





ఆకలిపోయి, ఒంటికి శివమెత్తుతున్నది." అని, ఎగిరి అందుబాటులో వున్న చెట్టు కొమ్మ పట్టుకుని, కోతిలా ఊగసాగాడు.

బొబ్బిలిదొర చెప్పిన మీదట ఇద్దరు ముగ్గురు సరక్షక కుర్రాళ్లు చేరి గణాచారి కాళ్లు పట్టుకు గుంజి, అతడు కిందపడే సమయానికి నడుం పట్టుకుని నిలబెట్టారు. బొబ్బిలిదొర మరొకసారి తాను గుళ్ళో చూసినదంతా ముసలి గణాచారికి చెప్పాడు.

ఈసారి గణాచారి అంతా శ్రద్ధగా విని, తల పైకెత్తి కొంచెంసేపు ఆకాశం కేసి చూసి, చప్పున వంగి, యింత మట్టి తీసుకుని, ఏవో మంత్రాలు చదివి, అక్కడ వున్న వాళ్ళందరి తలలమీదా పసిలా వెదజల్లి, ''అక్కడ, చెట్టూ చేమా కోసి ఖాళీచోట, నిప్పువేసి, దాని మీద బాన నిండుగా నీళ్ళు కాచండి. ఈ లోపల కొందరు పోయి అరణ్య దేవర గుళ్ళో వున్న కొండ చిలువనూ, కోడెలునూ, అడవిపిల్లినీ యిక్కడికి తెండి.'' అన్నాడు.

''ఆ అడవిపిల్లి యింకా విరిగిపోయిన గుడి రాళ్ళ సందున వుంటుందనుకోను. కొండచిలువా, కోడెలూ ఈ సరికి ఒక దాన్నొకటి చంపుకొని వుంటవి. వాటిని తెప్పిస్తాను.'' అన్నాడు బొబ్బిలిదొర.



''ఆ అడవిపిల్లి దొరక్కపోతే, అది కూర్చుని మ్యావ్ అన్న రాయినైనా తేవాలి. దాన్ని కూడా సలసల కాగే నీటి బానలో వుంచి తీవాలి.'' అన్నాడు ముసలి గణాచారి గుడ్లురుముతూ.

''ఇంతకీ అరణ్యదేవర తన గుళ్ళో, యీ కొండచిలువా, కోడెలూ అద్భుతం ఎందుకు చూపాడు? మనకు త్వరలోనే వేటాడేందుకు జంతువులు దొరికేనా?'' అని అడిగాడు బొబ్బిలిదొర భయపడుతూ.

ఆ ప్రశ్నకు గణాచారి ఎగిరి గంతేసి, పూనకం వచ్చినవాడిలా జుట్టు పీక్కుని, అటూ యిటూ ఊగుతూ, ''నేనెవర్ని? అరణ్యదేవర్ని! నేను కరుణిస్తే జంతు



మాంసమే కాదు. మనిషి మాంసం కూడా దొరుకుతుంది. ఇక కదలండి!'' అంటూ అరిచాడు.

ఆ మరుక్షణం కొండవారు చెట్ల మధ్య ఖాళీ ప్రదేశంలో పెద్ద గుంట తవ్వి, నిప్పుచేసి, దానిమీద పెద్ద నీళ్ళబాన పెట్టారు. ఉత్సాహం పట్టలేని కుర్రవాళ్లు కొందరు దొరికిన ఎండుకట్టెపుల్లా తెచ్చి, నిప్పుల్లో వేయసాగారు. కొద్దిసేపటికల్లా తెల్లని పొగ ఆకాశం కేసి లేచింది.

ఆలాంటి సమయంలోనే మాయా సరోవరేశ్వరుడు ఎక్కివస్తున్న హంసల రథం మీద, ఆకాశంలో కొన్ని రాబందులు వచ్చిపడినై. హంసలు రథాన్ని తలా ఒకవైపుకూ లాగి, దాన్ని తలకిందులు చేసినై. రథం కొయ్యల్లో ఒకదాన్ని పట్టుకున అంగరక్షకుడు మాత్రం కింద పడకుండా వుండిపోయాడు. రథం తోలేవాడూ, కనకాక్షరాజు కుమార్తె కాంచనమాలా, మాయాసరోవరేశ్వరుడూ ఒక్క ఊపున అంత ఎత్తునుంచి పల్టీలు కొడుతూ నేలకేసి రాసాగారు.

ఆ సమయంలో పైన వీస్తున్న గాలి తాకిడికి ముగ్గుతూ ఒకరి నుంచి ఒకరు దూరమైపోయారు. శివమెత్తి జుట్టు విరబోసుకుని గంతులు వేస్తున్న ముసలి గణాచారిణి, ఆకాశం నుంచి భూమికేసి వస్తున్న మాయాసరోవరేశ్వరుడు కంట పడగానే, ''హాఁ, ఆకలికి అలమటించి పోతున్న మన జాతివాళ్ళను అరణ్యదేవర కనికరించాడు. అడుగో, చూడండి! మనకు ఆహారంగా మనిషినే పంపుతున్నాడు! బానలో నీళ్ళు తొందరగా వెచ్చపడేట్టు చూడండి. మనిషీ, కొండ చిలువా, తోడేలూ, అడవిపిల్లీ—ఇన్ని జీవాలు కలిసిన మాంసాన్ని ముందుగా అరణ్యదేవరకు నైవేద్యం పెట్టాలి. ఆ తరవాత మనకు కావలసినంత వేట మాంసం దొరుకుతుంది!'' అన్నాడు.

నరభక్షక జాతివాళ్ళందరూ తలలెత్తి ఆకాశం కేసి చూస్తూ, ఉత్సాహంగా





చప్పట్లు చరచసాగారు. హంసలరథం మీది నుంచి జారిపడటం దురదృష్టమే అయినా, మాయాసరోవరేశ్వరుడు అంత ఎత్తు నుంచి భూమిమీద పడి చావకుండా, అదృష్టవశాత్తూ సూటిగావచ్చి నరభక్షకులు నీళ్ళు కాస్తున్న పెద్ద బానలో పడ్డాడు. అతడు నీటిలో ఒక మునక వేసి, దిన్నగా అరుస్తూ లేచి, బాన అంచులు పట్టుకుని చుట్టూ కలయచూస్తూనే, నరభక్షకులు కంటబడగానే అదిరిపడ్డాడు.

ముసలిగణాచారి నవ్వుతూ అతడి దగ్గిరకు వచ్చి, "అరణ్యదేవర ఏ బక్కచిక్కిన జీవినీ తాకకుండా, కొత్త ఒంటకండా, మాంసం వున్నవాణ్ణే బహూకరించాడు. ఆ బహుమానాన్ని కూడా మాకు శ్రమలేకుండా, హంసాన్ని పడకబెట్టి బానలోకే సరాసరి చేర్చాడు," అన్నాడు.

గణాచారి ఇలా అన్నతరవాత గాని, మాయాసరోవరేశ్వరుడికి తాను అరణ్యజాతుల చేత చిక్కటమే కాకుండా, ఆ చిక్కటంలో నరమాంసం తినేవాళ్ళ చేతుల్లో చిక్కినట్టు అర్థంకాలేదు. ఇప్పుడు తానేం చేసేట్టు? ఎంత వాడికి ఎంత దుర్గతి? అనుకుంటూ అతడు విచారించేంతలో, బానలోని నీళ్ళు క్రమంగా వేడెక్కుతూండటంతో, శరీరం చుర్రుమన్నది.



మాయాసరోవరేశ్వరుడు బెంబేలు పడిపోతూ, బానలో నుంచి బయటికి రాబోయాడు. ముసలిగణాచారి కాలుతున్న ఒక కట్టె తీసుకుని, అతడి కేసి గురిచేసి, "ఒరే, అరణ్యదేవర ఆహారంగా పంపిన మనిషీ! బానలోని నీళ్ళు వేడిగా వున్నవని బయటికి వచ్చావో, బాన కింది నిప్పుల్లోవేసి కాలుస్తాను. జాగ్రత్త!" అన్నాడు.

ఆ మాటలతో మాయాసరోవరేశ్వరుడికి తనకు చావు తప్పదని తోచింది. అయినా ఆ చావటం వేడినీళ్ళల్లో కాలి కాలి చావటం బాధాకరంగదా? ఎలా అయినా సరే ముందు బానలో నుంచి బయట





వడాలి! ఇలా అనుకుంటూనే చప్పున ఆతడికొక ఉపాయంతోచింది. అతడు గణాచారితో రహస్యం చెబుతున్న వాడిలా చిన్న గొంతుతో, "నువ్వు, అరణ్యదేవర గణాచారివిగదా? అయితే నీకొనే యీ రహస్యం చెప్పాలి. మీ దేవర నాతోపాటు ఆకాశంలోంచి మరి ముగ్గుర్ని కూడా మీకు ఆహారంగా పంపాడు," అన్నాడు.

గణాచారి ఆశ్చర్యపోతూ, "మరి వాళ్ళెక్కడ?" అన్నాడు.

"వాళ్ళు దారితప్పి, అరణ్యంలో మరెక్కడో దిగినట్టుంది. నన్ను వెంట బెట్టుకు పోయావంటే, వాళ్ళను వెతికి పట్టిస్తాను," అన్నాడు మాయా సరో వరేశ్వరుడు.

ఆ మాటలు నమ్మదగినవిగా తోచింది గణాచారికి. అతడు వెంటనే సరోవరే శ్వరుణ్ణి కాగుతున్న బానలోంచి బయటికి లాగించి, అరణ్యదేవర గుడికి పోయిన బొబ్బిలిదొరకు జరిగిన సంగతి చెప్పమని ఒకణ్ణి పంపి, నలుగుర్ని వెంట తీసుకుని మాయాసరోవరేశ్వరుడితో అరణ్యంలోకి బయలుదేరాడు.

వాళ్ళు అరణ్యంలో సూర్యుడు పడమటి దిక్కుకు వాలేవరకూ, ఎన్నో ప్రదేశాల్లో వెతికారు. హఠాత్తుగా మాయాసరోవరేశ్వ రుడికి ఒక చెట్టు కింద రథం తోలేవాడి చర్నాకోల కనిపించింది.

"నా రథచోదకుడు, యీ చెట్టుకొమ్మల్లో పడివుంటాడు!" అనుకుంటూ మాయా సరోవరేశ్వరుడు తల ఎత్తి చూశాడు. అతడికి చెట్టుకొమ్మల్లో ఎవరూ కనిపించ లేదుగాని, పైన ఎగురుతూ హంసలరథం కంటబడింది.

ఆ సమయంలో పైకి లేస్తున్న పొగను గుర్తుగా పెట్టుకుని సిద్ధసాధకుడూ, మకర కేతూ కూడా నరభక్షకులున్న ప్రాంతానికి వస్తున్నారు. సిద్ధసాధకుడు తన వాహన మైన నరవానరాన్ని అదిలిస్తూ, "జై, మహాకాళా!" అంటూ పెట్టిన కేకవిని, మాయాసరోవరేశ్వరుడూ, వెంటవున్న వాళ్ళూ వణికిపోసాగారు. —(ఇంకావుంది)







# మాయాసరోవరం

## 25

[ఆకాశంలో ఎగురుతున్న హంసల రథంలో నుంచి జారిపోయిన మాయాసరోవరేశ్వరుడు, అరణ్యంలో ఒకచోట నరభక్షక జాతి వాళ్ళు కాగబెడుతున్న నీటిబానలో వచ్చిపడ్డాడు. అతడు వాళ్ళకే తన వెంట వున్న వాళ్ళను గురించి చెప్పాడు. అందరూ వాళ్ళ కోసం అరణ్యంలో వెతుకుతూండగా, సిద్ధసాధకుడు పెట్టిన కేక వినిపించింది. తరవాత—]

సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ పెట్టిన కేకకు మాయాసరోవరేశ్వరుడు ఉన్న చోటునే ఆగి, దిక్కులు చూస్తూ, వడవడ వణికిపోవటం మాని, నరభక్షకుల గణాచారి చాలా ఆశ్చర్యపోయాడు. అతడి వెంట వున్న నలుగురు నరభక్షక జాతివాళ్ళూ, చప్పున ఈటెలు పైకెత్తి, ఆ కేక వినవచ్చిన వైపుకు బయలుదేరారు.

మాయాసరోవరేశ్వరుడు అంతలోనే తెప్పరిల్లి, గణాచారితో, "మీ వాళ్ళను తిరిగి రమ్మని పిలవటం క్షేమం. ఆ కేక వేసినవాడు మహాకాళుడి భక్తుడు. వాళ్ళ మంత్రశక్తుల ముందు, మీ ఈటెలు పూచికపుల్లల పాటిరావు," అన్నాడు.

ఆ మాటలకు గణాచారి బిగ్గరగా నవ్వి, "మా నరభక్షకులకు యిలాంటి మంత్రతంత్రాల భయం ఏమీలేదు. మాకు







ఆహారం అయేందుకు, అరణ్యదేవర కరుణవల్ల మరొక మనిషి వస్తున్నాడు," అన్నాడు.

గణాచారి మాట ముగించేంతలో, ఈటెలు పైకెత్తి ఉత్సాహంగా ముందుకు పోయిన నలుగురు నరభక్షకులూ చావు కేకలు పెడుతూ, చెట్లకు అడ్డంపడి పరిగెత్తి, గణాచారి దగ్గరకు వచ్చి, "గణాచారయ్యా, మన ప్రాణాలు దక్కవు! ఏనుగంత నరవానరం మీద, యమకింకరుడొకడు కేకలు పెడుతూ యిటుకేసే వస్తున్నాడు," అన్నారు.

ఈసారి మాయానరవరేశ్వరుడితో పాటు, గణాచారి కూడా వణికిపోయాడు.

ఆతడికి దూరంగా ఒక చెట్టుచాటు నుంచి శూలం పైకెత్తి, నరవానరాన్ని వేగంగా పరిగెత్తిస్తూ, తమను సమీపిస్తున్న సిద్ధసాధకుడు కనిపించాడు.

"ఒరే, యిక మనం యిక్కణ్ణించి పారిపోవటం మంచిది. ఒకడు ముందుగా పరిగెత్తిపోయి జెబ్బులికోరకు, యీ యమకింకరుణ్ణి గురించి చెప్పండి. వీడి చేతిలో పడ్డామో మన జాతి సర్వనాశనమే!" అంటూ ముసలి గణాచారి పారిపోయేందుకు వెనుదిరిగాడు.

సిద్ధసాధకుడు, "మహాకాళా!" అంటూ మరోసారి కేకపెట్టి, పారిపో జూస్తున్న నరభక్షకుల ముందుకు నరవానరంతో వచ్చి నిలబడి, "కదిలారంటే, మిమ్మల్ని నా నరవానరానికి బలి ఇస్తాను. ఎవరు మీరు? కాంచనమాల అనే రాజకుమారి హంసలరథం మీది నుంచి యిక్కడ జారిపడింది. చూశారా?" అన్నాడు కళ్ళెర్రచేసి.

సిద్ధసాధకుడు అన్నమాటల్లో ఒక్కటీ గణాచారికిగాని, అతడి వెంట వున్న నరభక్షకులకుగాని అర్థం కాలేదు. గణాచారి చప్పున ఏదో గుర్తుకువచ్చినవాడిలా పక్కకు తలతిప్పి, ఒక చెట్టుగొమ్మల చాటున నిలబడి, పారిపోబోయే ప్రయత్నంలో వున్న మాయా

సరోవరేశ్వరుణ్ణి చూసి, సాధకుడికి చేయెత్తి అతణ్ణి చూపిస్తూ, "మా ఆరణ్య దేవర ఆకాశం నుంచి మాకు ఆహారంగా పంపినవాడక్కడున్నాడు? మీరు చెప్పే రాజకుమారి సంగతి వాడికేమైనా తెలుసేమో అడగండి." అన్నాడు.

ఆ క్షణంవరకూ సిద్ధసాధకుడు, నరభక్షకుల్ని పారిపోకుండా చూసే ప్రయత్నంలో వుండి, కొంచెం ఎడంగా చెట్టు చాటున నిలబడిన సరోవరేశ్వరుణ్ణి చూడలేదు. ఇప్పుడతడు చప్పున తల తిప్పి చూసి, "ఒరే, నెత్తిన దిప్ప కిరీటం నువ్వూ! నువ్వేనా మాయా సరోవరేశ్వరుడివి? దొంగలా పారిపోవాలని చూస్తున్నావా? జాగ్రత్త, శూలానికి గుచ్చి భూమిలో పాతెయ్యగలను," అన్నాడు.

సాధకుడి మాటలు సరోవరేశ్వరుడికి చాలా కోపం తెప్పించినై. అతడు విసురుగా కత్తి పిడిమీద చేయి వేసి, కత్తి దూయబోయినవాడల్లా తమాయించుకుని, "నీ వేషభాషలు చూస్తూంటే, నువ్వేదో కాపాలికుడవని తప్ప నీ ఊరూ, పేరూ తెలియటం లేదు. సరిసమానులపైన మాత్రమే నేను కత్తి దూయగలను. ఇక ఇంతటితో నీ పరుష వాక్యాలు చాలించి, నీ దారిన నువ్వుపో." అన్నాడు యీసడిస్తున్నట్టు.



"నేను సిద్ధసాధకుణ్ణి. మహాకాళుడి భక్తుణ్ణి. నీ అంతస్తుకు తగిన శత్రువు నా బంటుగా వున్నాడు. వాణ్ణి నేనిటు వచ్చేప్పుడు చుట్టుపక్కల రాజకుమారి కాంచనమాల కోసం వెతకమని పంపాను. వాణ్ణి పిలవమంటావా?" అని, సిద్ధసాధకుడు గొంతెత్తి, "ఒరే, జలవృకా, ఎక్కడ? నీ జాతిశత్రువైన మాయా సరోవరేశ్వరుడిక్కడున్నాడు. వచ్చి, వాడి బలదర్పాలేమిటో పరీక్షించు," అంటూ కేకపెట్టాడు.

ఆ వెంటనే సాధకుడి బంటయిన జలవృక రాక్షసుడు దూరం నుంచి జవాబుగా ఒక కేకపెట్టి, ముళ్ళపొదల

మీదుగా దూకుతూ, బొబ్బలు పెడుతూ, "ఎక్కడ? ఆ దురాత్ముణ్ణి. నా రాతి గదతో పిండికింద కొడతాను," అంటూ అరిచాడు.

జలవృక రాక్షసుడు అలా వేగంగా వస్తూన్న సమయంలో ఒకపెద్ద కుసుమాను చాటునుంచి చప్పున మకరకేతు తన జలగ్రహం మీద ముందుకువచ్చి, అతడి దారిని అడ్డగించాడు. జలగ్రహం పెద్దగా ఘీంకరించి తొండం సాచి జల రాక్షసుణ్ణి పట్టుకోబోయింది. జల రాక్షసుడు ఒక్క ఎగురున పక్కకు పోయి, మెరుపు వేగంతో వెనుదిరిగి, చేతిగల రాతి గదతో, జలగ్రహం తల మీద ఒక్క బాదు బాదాడు. ఆ దెబ్బకు జలగ్రహం పక్కకు ఒరిగింది. మకర కేతుడు భీకరంగా ఒక కేకపెట్టి, "ఒరే, జలవృక రాక్షసుడా! నిన్నిదె యమ లోకానికి పంపుతున్నాను," అంటూ కత్తితో అతడి కంఠం మీద పొడవ బోయాడు. కాని, కత్తి గురితప్పి జల వృకరాక్షసుడి భుజాన్ని చీరింది.

నరవానరం మీద వుండి యుద్ధంతా చూస్తున్న సిద్ధసాధకుడు, తన బంటు గాయపడగానే ఎక్కడలేని ఆవేశంతో ఒక కేకపెట్టి, "తరవాత జయశీలుడు ఏమైనా కానుగాక, ముందు ఈ సరోవరం గాణ్ణి, ఆ నీటి మొసలిని నా శూలంతో చిత్రవధ చేస్తాను," అంటూ నర వానరాన్ని అదిలించాడు.



ఆ మరుక్షణం చుట్టూ చప్పట్లూ, ఈలలూ చెలరేగినై. సిద్ధసాధకుడు ఆశ్చర్యపోతూ తల తిప్పి చూశాడు. అప్పుడు ఆ చుట్టుపక్కలవున్న చెట్ల వెనకా, పొదలచాటునా చాలా మంది నరభక్షకులు చేరారు. వాళ్ళల్లోంచి వాళ్ళ నాయకుడైన జెబ్బులిదొర ఈటె భుజాన పెట్టుకుని ముందుకువస్తూ, గణాచారితో, "గణాచారీ! అదృష్టదేవత మనకు ఆహారంగా యింతమందిని ఒక్కసారిగా పంపటం ఆశ్చర్యంగా లేదా? ఆహా, ఆయన భక్తుల పాలిట తేనెపట్టుగదా!" అన్నాడు.



జెబ్బులిదొర మాటలూ, అతడి జాతి వాళ్ళయిన నరభక్షకులు ఈలలువేస్తూ తమనుచుట్టు ముట్టేందుకు వస్తూండటం గమనించిన సిద్ధసాధకుడు, యిప్పుడు తన శత్రువులతోపాటు తనకూ ప్రాణాపద రానున్నదని గుర్తించి, ఒక్క దూకున నరవానరాస్త్రి మకరకేతు దగ్గరకు పరిగెత్తాడు.

మకరకేతు గాయపడిన జలగ్రహం తల మీద చేతులతో తట్టి, అది లేచి నిలబడగానే, దాని మీద ఎక్కి, కూర్చోబోయిన వాడల్లా ఆగి, అంత దూరంలో వున్న మాయాసరోవరేశ్వరుడితో, "సరోవరేశ్వరా, దయచేసి యీ జలగ్రహాన్ని అధిష్ఠించండి. ఈ సిద్ధసాధకుడు దురావేశపరుడేగాని, మంచివాడు. ఇతడి మిత్రుడైన జయశీలుడు మనందరికి మిత్రుడు. వైద్యదేవుడూ, అతనూ కలిసి హంసలరథంలో త్వరలోనే యిక్కడికి రానున్నారు." అన్నాడు.

నది ఒడ్డున జరిగిన సంగతి తెలియని మాయాసరోవరేశ్వరుడికి, మకరకేతు మాటలేమాత్రం అర్థంకాలేదు. అయినా జలగ్రహం మీద వుండటం తనకు రక్షణగా వుంటుందని అతడు అడుగులో అడుగు వేసుకుంటూ దాన్ని సమీపించాడు. ఈలోపల మకరకేతు వల్ల కత్తి దెబ్బ తిని బాధతో కలవ పడిపోయిన జలవృక







రాక్షసుడు. మూలుగుతూ చెట్టుబోదె నొగ చాన్ని పట్టుకుని లేచి నిలబడి, సిద్ధ సాధకుడు కంటబడగానే, "దొరా, ఏమిటి సెలవు?" అన్నాడు.

"నీకు తగిలిన గాయం అంత ప్రమాద కరమైనది కాదనుకుంటాను. ముందు నీ కాతిగదను చేతికి తీసుకో." అని సిద్ధ సాధకుడు మకరకేతును, "ఇప్పుడు ఎవరి నుంచి ఎవరికి ప్రమాదం రాబోతున్నదో గమనించావా?" అని అడిగాడు.

"ఈ నరభక్షకులు అరణ్యదేవర మనను, తమకు ఆహారంగా పంపాడని భ్రమపడుతున్నట్టున్నది. ముందు యీ క్రూరులనుంచి మనం మనను కాపాడుకో వాలి," అన్నాడు మకరకేతు కత్తి పిడిని గట్టిగా గుప్పెట బిగించి పట్టుకుంటూ.

"కేతూ, నీ శక్తికి మెచ్చాను. రాజు కనకాక్షుడి పిల్లలను వెతికి రక్షించి, ఆయనకు ఒప్పచెప్పకుండా నేనుగాని, జయశీలుడుగాని ఏ నరభక్షకులకూ ఆహారం అయిపోదలచలేదు. ఈ అనా గరికులకు ముందు మంచిగా చెప్పి చూస్తాను. వినకపోయ్యారో, అందరినీ — ఆడవాళ్ళనూ, పిల్లలనూ వదిలి— ఊచకోతకోద్దాం," అన్నాడు సాధకుడు.

నరభక్షకుల గణాచారి అప్పటివరకూ పూనకం వచ్చిన వాడిలా కళ్ళు మూసుకుని అటూ యిటూ ఊగుతున్నవాడల్లా, చప్పున ఎగిరి ఒక గంతేసి, "అరణ్య దేవరో!" అంటూ ఒక కేక పెట్టి, "ఆకలి! ఆకలి! ఒరే, అరణ్యదేవర ఆహారంగా పంపిన మనుషుల్లారా, అలా చూస్తారేం? కదలండి, అరణ్యదేవర ఆలయానికి. అక్కడ ముందుగా మిమ్మల్ని నైవేద్యం పెట్టి, తరవాత తినేస్తాం." అన్నాడు.

సిద్ధసాధకుడు తొణక్కుండా శూలం ఎత్తి పట్టుకుని, "ఒరే, నరమాంస భక్షకులారా, మీరు పొరబడుతున్నారు. మేం ఎవరిచేతా మీకు ఆహారంగా పంప బడ్డ వాళ్ళం కాదు. హంసలరథం మీది





నుంచి జారి అరణ్యంలో పడిన మావాళ్ళ కోసం వెతుకుతూ యిటువచ్చాం. ఆ పడిన వాళ్ళలో మాయాసరోవరేశ్వరుడనే వాడు మాకు దొరికాడు. ఇక మా దారిన మేం పోతాం. మీరు కూడా మంచిగా, బుద్ధిగా మీ దారిన మీరు పొండి," అన్నాడు.

"మా ఆకలి మాటేమిటి? వారాల తరబడి మేం తినేందుకేం దొరక్క ఉపవాసాలు చేస్తున్నాం." అన్నాడు బెబ్బులిదొర ఈటెను ఝళిపిస్తూ. సిద్ధ సాధకుడి ముందుకువచ్చి,

"నువ్వు మాయాసరోవరేశ్వరుడనే మనిషిని, మా అరణ్యదేవర ఆకాశం నుంచి సూటిగా మేం మాంసం ఉడక బెట్టే బానలోకి పంపాడు. ఆ మాట అబద్ధమా?" అంటూ గణాచారి చిందులు ప్రారంభించాడు.

సిద్ధసాధకుడు హెచ్చరించగానే నర వానరం, బెబ్బులిదొరను రెండుచేతులతో ఒడిసి పట్టుకుని పైకెత్తింది. మాయా సరోవరేశ్వరుడు దిక్కుతోచక జలగ్రహం ఒక్క దూకున ముందుకువచ్చి తొండం సాచి, గణాచారిని నడుంవద్ద పట్టుకుని గాలిలో గిరగిరా తిప్పసాగింది. బెబ్బులి దొరా, గణాచారి చావుకేకలు పెడుతూనే మధ్య మధ్య, "మన ఆహారం అయిన యీ మనుషుల్ని వదలకండి. ఈ వలతో పొదవండి!" అంటూ అరవసాగారు.

"చూస్తావేం, జలస్పృకభటా! ఈ నర భక్షకుల్ని నీ కాలిగడతో పిండికింద



కొట్టు." అంటూ సిద్ధసాధకుడు జలపృక రాక్షసుణ్ణి హెచ్చరించాడు.

"సిద్ధసాధక దొరకూ, జై!" అంటూ జలపృకరాక్షసుడు రాతిగద ఎత్తి, నరభక్షకుల మీదికి విరుచుకుపడ్డాడు. ఆకలితో ప్రాణాలకు తెగించిన నరభక్షకులు వాణ్ణి ఎదిరించారు. జలరాక్షసుడు గదతో అందిన వాళ్ళను అందినట్టు ఎడాపెడా కొడుతూండగా, నరభక్షకులు వాణ్ణి ఈటెలతో పొడిచేందుకు ప్రయత్నిస్తూ, తమ కేకలూ, అరుపులతో ఆ అరణ్య ప్రాంతమంతా ప్రతిధ్వనించేలా చేయసాగారు.

సిద్ధసాధకుడు కొంచెంసేపు తన జలపృకభటుడు పోరాడుతున్న తీరు చూసి, "భేష్, జలపృకభటా! నువ్వు పోటుమగాడివి, ధైర్యవంతుడివి! నీకు సాయం వస్తున్నాను." అంటూ కేకపెట్టి, నరవానరం చేతుల్లో వున్న బెబ్బులి దారను దూరంగా విసిరి వేయించి, "జై, మహాకాళా!" అంటూ శూలం ఎత్తి, నరభక్షకుల మీదికి నరవానరాన్ని ఉరికించాడు.

ఆ మరుక్షణం పదిమంది అశ్వికులు వేగంగా అక్కడికొస్తూ, "ఆగండి! ఆగండి! ఇది హిరణ్యపురం రాజైన కనకాక్ష మహారాజుగారి ఆజ్ఞ!" అంటూ అరిచారు.

అశ్వికుల హెచ్చరిక వింటూనే సిద్ధసాధకుడూ, నరభక్షకులూ పోరాటం మాని ఆశ్చర్యంగా వాళ్ళకేసి చూడసాగారు. మాయాసరోవరేశ్వరుడు వణికిపోతూ, "మకరకేతూ! మనం వేగంగా మాయాసరోవరాన్ని చేరటం క్షేమం గదా?" అన్నాడు.

ఆ మాటలు విన్న సిద్ధసాధకుడు కోపంతో కళ్ళెర్రచేసి, "ఏరా, దుష్ట సరోవరేశ్వరా! నువ్వు ఎక్కడికీ పారిపోలేవు. నువ్వు క్షేమం అనుకునేది, కీడుగా పరిణమించబోతున్నది. జాగ్రత్త!" అంటూ శూలాన్ని అతడి గుండెలకు ఆనించాడు.

—(ఇంకా వుంది)





# మాయాసరోవరం

## 26

[శరభశిక జాతివాళ్ళకు, మాయాసరోవరేశ్వరుడు దొరికిన సమయంలో, అక్కడికి సిద్ధసాధకుడు వచ్చాడు. తన యజమానిని రక్షించబోయి, మకరకేతు, సాధకుడి జంటయిన జలవృకరాక్షసుణ్ణి గాయపరిచాడు. శరభశికులు వాళ్ళను పట్టబోయేసరికి, అందరూ ఏకమై వాళ్ళమీద తిరగబడ్డారు. అంతలో కొందరు అశ్వికులు అక్కడికి వచ్చారు. తరవాత—]

సిద్ధసాధకుడు పదునైన శూలాన్ని తన గుండెలకు ఆనించగానే, మాయాసరోవరేశ్వరుడు భయంతో కంపించిపోతూ, "ఇది అన్యాయం! వీరుడైన వాడెవడూ శత్రువును అదమరిచి వుండగా చంపేందుకు ప్రయత్నించడు," అన్నాడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు శూలాన్ని నేలకు ఆనించి, "నేను వీరుల్లోనూ, వీరాధివీరుణ్ణి! ఏదీ కత్తి దుయ్యి, నీ బలదర్పాలేపాటివో చూస్తాను," అన్నాడు.

మాయాసరోవరేశ్వరుడు కత్తి దూయబోయినవాడల్లా ఆగి, మకరకేతు కేసి చూశాడు. అంతలో అశ్వికుల నాయకుడు వచ్చి గుర్రం దిగాడు.

సిద్ధసాధకుడు కోపంగా అతడి కేసి చూస్తూ, "ఎవరు నువ్వు? మా తగాదాల్లో నీకేం పని?" అని అడిగాడు.







ఆ ప్రశ్నకు అశ్వికుల నాయకుడు వెంటనే జవాబు చెప్పకుండా సాధకుణ్ణి నిలువెల్లా ఒకసారి పరీక్షగా చూసి, "ఆఁ, నువ్వా! నువు సిద్ధసాధకుడివి కాదా? కొన్నాళ్ళ క్రిందట హిరణ్యాపురంలో, కాటికాపరిని తల నరికిన నేరానికి, మరొకరితోపాటు నువ్వూ, రాజుగారి దగ్గిరకు తీసుకుపోబడ్డావు, అవునా?" అన్నాడు.

అశ్వికుల నాయకుడు ఆ ప్రశ్నకు హేళనగా నవ్వబోయినవాడల్లా, నర వానరాన్ని, ఏనుగు జలగ్రహాన్ని చూసి కొంచెం బెదురుకుని, "నే నెవరినో, ఇంతకుపూర్వమే నే చేసిన హెచ్చరికవల్ల నీకు అర్థమైవుండాలి?" అన్నాడు.

"ఆ హెచ్చరికేదో నేను సరిగా వినలేదు. నేను, నా శత్రువైన యీ నరో పరం పక్షిని పారిపోకుండా చూసే ప్రయత్నంలో వున్నాను. ఇప్పుడు మరో సారి అడుగుతున్నాను. ఈ గుర్రాలనో, కంచర గాడిదలనో ఎక్కి, మా మధ్యకు వచ్చిన నువ్వెవరివి?" అన్నాడు సిద్ధ సాధకుడు.

"నే నెవరైనది నీకు తెలిసింది. నువ్వెవరో గుర్తుకొచ్చిందిగాని, పేరు మాత్రం తెలియటం లేదు," అన్నాడు సిద్ధసాధకుడు.

"నా పేరు వీరసేనుడు. అపహరించుకుపోబడ్డ కనకాక్ష రాజుగారి కుమారుణ్ణీ, కుమార్తెనూ వెతికి తెచ్చేందుకు బయలుదేరిన జయశీలు డెక్కడ?" అన్నాడు వీరసేనుడు.

"ఆ జయశీలుడు హంసల రథంలో, ఆకాశంలో ఎక్కడో ఎగురుతూంటాడు. సరే, నువు కాస్త పక్కకు తప్పుకో. వీరుడిలాగా ప్రగల్భాలు పలికే యీ భీరువైన నిటిమనిషి అంతు చూడాలి ముందు," అంటూ సిద్ధసాధకుడు శూలాన్ని పైకెత్తాడు.

"ఇక్కడ రక్తపాతాన్ని నేను సహించను!" అంటూ వీరసేనుడు, తన





అనుచరులైన అశ్వికులను ముందుకు రావలసిందిగా హెచ్చరించాడు.

అశ్వికులు కత్తులెత్తి పట్టుకుని తనను సమీపించేంతలో సిద్ధసాధకుడు చుట్టూ ఓ మారు కలయచూసి, వీరసేనుడితో, "మన చుట్టూ కొన్నాళ్ళుగా తిండిలేక ఆకలితో నకనకలాడుతున్న నరభక్షకులున్నారు. కావాలంటే క్షణాల మీద నిన్నూ, నీ తోటి అశ్వికులనూ కాల రాయగలను. కాని, అందువల్ల నరభక్షకులకు తప్ప మరెవరికీ మేలు కలగదు," అన్నాడు.

"మేలూ, కీడుల సంగతి నాకనవసరం, ఇక్కడికి దాపులనే కనకాక్షరాజుగారు విడిసి వున్నారు. అందరూ అక్కడికి రండి," అన్నాడు వీరసేనుడు.

సాధకుడు కళ్ళెర్రచేసి, వీరసేనుడి కేసి చూస్తూ," ఇది ఆజ్ఞా? విన్నపమా? నేనీ భూప్రపంచంలో ఒక్క మహాకాళుడి ఆజ్ఞతప్ప,మరెవరి ఆజ్ఞలనూ పాటించను," అన్నాడు.

తన యజమాని ఆత్రగా వచ్చిన అశ్వికులపై కోపగించి వున్నాడని గ్రహించిన బలవృక్షరాక్షసుడు, దాని గదను భుజం మీద పెట్టుకుని, గట్టిగా ఒకసారి నేలను కాళ్ళతో తాటించి, పెద్దగా హుంకరించాడు. నరవానరం జబ్బలు చరుస్తూ, అరణ్యం ప్రతిధ్వనించేలా బొబ్బరించింది. ఆ వికృతాకారాలనూ, అవి చేసే వికటాట్టహాసాలనూ చూసి ఒక అశ్వికుడి గుర్రం బెదిరి, చప్పున వెనక కాళ్ళమీద నిలబడి, రౌతు కింద పడగానే దూరంగా పారిపోయింది.

ఇదంతా చూసి భయకంపితుడై పోయిన వీరసేనుడు, సిద్ధసాధకుడితో, "అయ్యా, మీరు కూడా నాలాగే హిరణ్యపుర వాసులు. మహారాజుగారిని దర్శించేందుకు ఎందుకు రాకూడదు?" అన్నాడు తలవంచి నమస్కరిస్తూ.

ఆ మాటలకు సిద్ధసాధకుడు పరమానంద పడిపోతూ, "అలా అన్నావే,



బాగుంది! రాజుగారి దగ్గరకు వస్తున్నాను పద. ఈ నరభక్షకుల్ని, సరోవరం దుర్మార్గులిద్దర్నీకూడా, ఆయన దగ్గరకు పట్టుకుపోవాలి," అని చుట్టూచూసి, మాయా సరోవరేశ్వరుడూ, మకరకేతుడూ కనబడక పోయేసరికి అదిరిపడి, "ఏం, ఆ దుష్టులు? ఏమయారు?" అన్నాడు.

ఆ వెంటనే నరభక్షకులంతా ఒక్కసారిగా పొట్టలు చెక్కలయేలా నవ్వారు. వాళ్ళనాయకుడు బెబ్బులిదొర, మొసలిగణాచారి ముందుకువచ్చి, సిద్ధసాధకుడితో, "నువ్వూ, యీ గుర్రాలవాళ్ళూ తగూలాడుతున్న అదను చూసి వాళ్ళిద్దరూ చల్లగా చెట్లల్లోకి పరిగెత్తారు. వాళ్ళు అరణ్యదేవత పంపిన ఆహారం! పట్టుకునేందుకు మా జాతివాళ్లు వాళ్ళ వెనకగా వెళ్ళారు," అన్నారు.

"వాళ్ళు పారిపోతున్న సంగతి నాకెందుకు చెప్పలేదు? వాళ్ళు ప్రాణాలతో దొరికేవరకూ మీ ఇద్దరూ మాకు బందీలు," అని సిద్ధసాధకుడు, జలవృక రాక్షసుడితో, "జలవృక భటా! పిల్లిద్దర్నీ పట్టుకుపోయి, ఒక గుర్రం మీదవేసి, తాళ్ళతో బిగించు," అన్నాడు.

జలవృక రాక్షసుడు మెరుపులాపోయి బెబ్బులిదొరనూ, మొసలిగణాచారినీ పట్టుకొని, ఒక గుర్రం మీదినుంచి రౌతు దిగేలోపలే వాణ్ణి మోచేతి దెబ్బతో దూరంగా పడేట్టు కొట్టి, వాళ్ళను దాని వీపుమీద బిగించి కట్టాడు.

ఆ పని ముగిసినాక సిద్ధసాధకుడు, ఏకాసిమడితో, "ఇక నువ్వు ముందుండి దారి తియ్యి, కనకాక్షరాజుగారి దర్శనం చేసుకుందాం," అని నరవానరాన్ని అదిలించి, తమ నాయకులను బంధించిన వాళ్ళను, ఏమి చేయటమా అని తమలో తాము తర్కించుకుంటున్న నరభక్షకులతో, "ఒరే, మనుషుల్ని తినే, దుష్ట మానవుల్లారా! మీ వాళ్ళు వెతకబోయిన సరోవరంపక్షిగాడికి గాని వాడి బంటయిన మొసలిముఖం వాడికిగాని, మీరు









ఏమాత్రం హానికలిగించినా, మీ నాయకుణ్ణీ గుణాచారినీ ముందు నరవానరానికి ఎరగా వేసి, తరవాత మిమ్మల్ని క్రూర మృగాల కింద వేలాడతీస్తాను." అన్నాడు శూలాన్ని ఝళిపిస్తూ.

నరభక్షకులు నోరు మెదపలేదు. వాళ్లు ముఖాలు దీనంగాపెట్టి, తమ నాయకుడి కేసీ, గుణాచారి కేసీ చూడసాగారు. ఇక వాళ్ళిద్దరూ గుర్రం మీద గిలగిల కొట్టు కుంటూ, "అరణ్యదేవరో, మాకు యీ మనుషుల్ని ఆహారంగాపంపి, మా ప్రాణాల మీదికి తెచ్చావు. రక్షించు!" అంటూ అరవసాగారు.

అశ్వికనాయకుడు తన అనుచరుల్ని రాజు కనకాక్షుడు విడిదిచేసిన ప్రాంతానికి బయలుదేరమన్నాడు. వాళ్ళకు వెనకగా నరవానరం మీద సిద్ధసాధకుడు కదిలాడు. అదే సమయంలో అరణ్యంలో మరొక ప్రాంతాన హంసల రథంలో పోతున్న జయశీలుడూ, అతడి మిత్రులకు హఠాత్తుగా ఒకచోట పులి చేత తరమబడుతున్న ఒక యువతి కనిపించింది. ఆమె పులికి దొరకకుండా చెట్లలో వల చుట్టూ గిరికీలు కొడుతూ, మధ్య మధ్య అందుబాటులో వున్న చెట్టుకొమ్మలను పట్టుకుని, పైకి పోయి ప్రాణరక్షణ చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నది.

హంసల రథంలో వుండి, కింది అరణ్యాన్ని పరీక్షగా చూస్తున్న వైద్య దేవుడని పిలవబడే దేవశర్మకు ముందుగా, యీ దృశ్యం కంటబడింది. అతడొక తృటికాలం భయాశ్చర్యాలతో కంపించి పోయి, పక్కనే వున్న జయశీలుణ్ణి భుజం పట్టుకులాగి, "జయశీలా, పులి తరుముతున్న ఆ స్త్రీని చూశావా? ఆమె కాంచనమాల — మాయాసరోవరేశ్వరుడి బంట్లు అపహరించుకుపోయిన, కనకాక్ష రాజుగారి కుమార్తె! ఇప్పుడేం చేయడం?" అన్నాడు.

జయశీలుడు, దేవశర్మ చెప్పిన అరణ్య ప్రదేశాన్ని చూస్తూనే రథంలో లేచి



నిలబడి, రథాన్ని తోలుతున్న వాడితో, "ఒరే, రథాన్ని వెంటనే కిందికి దించు!" అన్నాడు.

అంగరక్షకుడు తలవంచి దిగువనున్న మహా వృక్షాలను చూసి, "అయ్యా, ఇక్కడ రథాన్ని దింపటం సాధ్యపడదు. మరికొంచెం దూరం పోయి, చెట్టూ చేమా లేని ఆ కనబడే ఖాళీ ప్రదేశంలో రథాన్ని దించుతాను," అన్నాడు.

ఆ మాటలకు జయశీలుడు కోపంగా, "ఒరే, మతిమాలినవాడా! నువ్వు రథాన్ని అక్కడ దించే లోపల. రాజకుమార్తె పులికి ఆహారం అయిపోతుంది. చప్పున రథాన్ని కాస్త కిందికి నడుపు, నేను ఏ చెట్టుకొమ్మల్లోనో దూకి, ఆమెను కాపాడేందుకు ప్రయత్నిస్తాను." అన్నాడు.

అంగరక్షకుడు హంసల మెడలకున్న తాళ్ళను కిందికి లాగాడు. అవి చెట్ల చిటారు కొమ్మల సమీపానికి రథాన్ని లాగినై. వెంటనే జయశీలుడు రథంలో నుంచి కిందికి దూకుతూనే, రెండు చేతులతో ఒక చెట్టుకొమ్మను వడిసి పట్టుకున్నాడు. కాని, అది అతడి బరువుకు ఫెళఫెళమంటూ విరిగి, సరిగ్గా యాభై అడుగుల ఎత్తునుంచి, అతడితోపాటు కిందపడింది.

చెట్టుకొమ్మ నేలను తాకే లోపలే జయశీలుడు ఒడుపుగా ఒక పల్లటికొట్టి, తాను వేగంగా నేలమీద పడి కాళ్ళూ, చేతులూ విరగగొట్టుకోకుండా, తనను తాను కాపాడుకున్నాడు. ఆ సమయంలో కాంచనమాలను వెంటబడి తరుము తున్న పులి, కొమ్మ విరిగిపడిన శబ్దానికి అదిరిపడి, వెనక్కు తిరిగి చూసింది. అది అవకాశంగా తీసుకుని కాంచనమాల దాపుల అందిన ఒక చెట్టుకొమ్మను పట్టుకుని, పైకి పాకసాగింది. కాని, పులి అంతలోనే పెద్దగా గాండ్రించి. ఆమె కేసి పరిగెత్తిపోయి, ఛెంగున పైకెగరబోయేంతలో, కత్తి దూసేందుకు కూడా వ్యవధిలేని జయశీలుడు ఒక్క

ఉరుకున పోయి, దాని వెనకకాళ్ళు రెండూ పట్టుకుని, గుంజి దూరంగా విసిరివేశాడు.

కాంచనమాల చెట్టుకొమ్మల్లో చేతులకు సరి అయిన పట్టు దొరకక, గాలికి ఊగుతున్న కొమ్మలతోపాటు అటూ ఇటూ ఊగుతూ, "అయ్యా, సమయానికి వచ్చి నన్ను పులి బారినుంచి రక్షించారు. కృతజ్ఞురాలిని!" అన్నది.

జయశీలుడు ఆమె సౌందర్యానికి ఆచ్చెరువు చెందాడు. తను ఎంతో కాలంగా ఎన్నో శ్రమలకోర్చి, ప్రాణాపాయ పరిస్థితుల నుంచి బయటపడి – ఎలాగైతేనేం కనకాక్షరాజుగారి కుమార్తె కాంచనమాలను రక్షించగలిగాడు. ఈమె అన్న అయిన కాంచనవర్మ ఏమయినట్టు?

"నీ పేరు కాంచనమాల! మత్స్య దేశపు రాజకుమార్తెవే కూడా నాకు తెలుసు. మీ అన్న కాంచనవర్మ ఎక్కడ? హంసల రథం మీదినుంచి కిందపడి, ఏ విధంగా ప్రాణాలు కాపాడుకోగలిగావు?" అని అడిగాడు జయశీలుడు.

జయశీలుడు యిలా మాట్లాడుతున్న సమయంలో కాంచనమాల చెట్టుకొమ్మల లోంచి నేలమీదికి దిగి, అందగాడూ, ధైర్యశాలీ అయిన యీ యువకుడికి తన పేరు ఎలా తెలుసునా అని ఆశ్చర్య



పోతూ, "అయ్యా, నేను హంసల రథం మీదినుంచి, అదృష్టవశాత్తూ ఒక వాగు నీటిలో పడటం వల్ల, బతికిపోయాను. నాతోపాటు రథంలో వున్న సరోవరేశ్వరుడూ, ఆయన రథం తోలేవాడూ బహుశా యీ అరణ్యంలో ఎక్కడో, నాలాగే ప్రాణాలతోనే వుండి వుంటారు. ఇక నా సోదరుడైన కాంచనవర్మ: అతడు మాయాసరోవరంలోని భవనంలోనే వున్నాడు." అన్నది.

"మాయాసరోవరేశ్వరుణ్ణి గురించి నాకు కొంత తెలుసు. అతడి సేవకులైన సర్పనఖుడు, సర్పస్వరుడు అనే వాళ్ళే కాక, మరొక ముఖ్యుడు కూడా నాకు

పరిచయం అయాడు. మాయాసరోవరం నుంచి నీ అన్నను కూడా బంధవిముక్తుణ్ణి చెయ్యాలి. అక్కడికి వెళ్ళేమార్గం నీకు తెలిసే వుంటుంది. ముందు మనం యీ దాపులనే వున్న నా మిత్రుడైన సిద్ధసాధకుణ్ణి కలుసుకోవాలి." అన్నాడు జయశీలుడు.

కాంచనమాల అతడితోపాటు కదలబోయేంతలో, అప్పటివరకూ జయశీలుడి దెబ్బకు నడుం విరిగి స్పృహకోల్పోయిన పెద్దపులి, చప్పున తల ఎత్తి కోరలు చాచి, పెద్దగా గాండ్రించి, వాళ్ళ కేసి దూకేందుకు లేచి నిలబడలేక, దభీమంటూ తిరిగి నేలమీద పడింది.

"ఎంత క్రూరమృగమైనా, గాయపడిన దాన్ని బాధలో వదిలి పోగూడదు. ఇప్పుడే దీని తల నరుకుతాను." అంటూ జయశీలుడు పులికేసి నడిచాడు.

"ఇంతటి భయంకరమైన పులి! మీరు రావటం కొంచెం ఆలస్యం అయితే, నన్ను గొంతుకొరికి చంపి, తినివుండేది!" అంటూ కాంచనమాల, జయశీలుడి వెంట పులిని సమీపించింది.

అప్పటివరకూ పక్కనే వున్న గుబురు చెట్లచాటున జలగ్రహం మీద వుండి యిదంతా చూస్తున్న మాయాసరోవరేశ్వరుడు, తల తిప్పి, పక్కనే గుర్రం మీదవున్న మకరకేతుతో, "ఈ జయశీలుడనేవాణ్ణి బంధించటానికి యిదే మంచి అవకాశం. తామరకాళ్ళ తాడును అతడి కంఠాని కేసి విసిరి, పట్టుకో." అన్నాడు.

"ప్రభూ, ఈ జయశీలుడు మహా సత్వుడు. అతడితో విరోధం మనకు క్షేమం కాదు." అంటూ మకరకేతు ఏడ్పుముఖం పెట్టాడు.

"ఛీ, పిరికిపందా!" అంటూ మాయాసరోవరేశ్వరుడు, మకరకేతు నుంచి బలమైన తాడును గుంజుకుని, జలగ్రహంతో కొంచెం ముందుకు వచ్చి, తాటి ఉచ్చును గాలిలో రెండు మూడు సార్లు గిరగిరా తిప్పి, గురిగా జయశీలుడి కంఠం కేసి విసిరాడు. —(ఇంకావుంది)





# మాయాసరోవరం

## 27

[బొబ్బులిచేరనూ, గణాచారిని బంధించి, సిద్ధసాధకుడు, హిరణ్యపుర రాజైన కవరాష్టి చూడబోయాడు. హంసర రథంలో వున్న జయశీలుడికి, అరణ్యంలో ఒకచోట పులిచేత తరుమబడుతున్న కాంచనమాల కనిపించింది. అతడామెను రక్షించాడు. ఆ సమయంలో చాటువుండి మాయాసరోవరేశ్వరుడు, అతడి మీద ఉచ్చుతాడు విసిరాడు. తరవాత—]

జయశీలుడు తన మెడను ఉచ్చుతాడు తాకగానే ఒక తృటికాలం నివ్వెరపోయి, చప్పున వెనుదిగి చూశాడు. అతడికి జలగ్రహం మీద మాయాసరోవరేశ్వరుడూ, పక్కనే గుర్రం మీద మకరకేతూ కనిపించారు.

జయశీలుడు చప్పున తేరుకుని తన కంఠానికి బిగుసుకుపోతున్న తామరకాళ్ల తాడును కత్తితో నరకబోయిన వాడల్లా ఆగి, సరోవరేశ్వరుడి కేసి తేరిపార చూశాడు.

మాయాసరోవరేశ్వరుడు తన చేతిలోవున్న తాటికొనను కొంచెం లాగి, జయశీలుడితో, "నువ్వేగదా, జయశీలుడనే మహావీరుడువి! తాడును కత్తితో నరకబోయిన వాడివి, ఎందుకు ఆగావు?" అన్నాడు.

"ఆఁ, ఇప్పుడు తెలిసింది, నువ్వు మాయాసరోవరేశ్వరుడివన్నమాట!







తాడును కంఠానికి ఉచ్చువేసిన వాడివి, దాన్ని గట్టిగా బిగించి, నా ప్రాణాలు తీయకుండా ఎందుకు వూరుకున్నావు ?" అని అడిగాడు జయశీలుడు.

"నేను ఒక సరోవరానికి రాజును, ఎంత మహాసత్వుడైన మానవుడి ప్రశ్నకైనా నేను జవాబివ్వనవసరం లేదు," అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

జయశీలుడు యింకా కోపంగా ఏదో అనబోయేంతలో, అంతవరకూ యీ జరుగుతున్న దానికి నిర్విణ్ణురాలైపోయి చూస్తున్న కాంచనమాల తెప్పరిల్లి, "మామయ్యా, నువు హంసలరథంలోంచి కిందపడి, ప్రాణాలతో వున్నందుకు చాలా ఆనందంగా వున్నది. కాని నువ్వు జయశీలుడనే యీ యువకుడికి హాని కలిగించకు. ఈయన నన్ను పులిబారి నుంచి రక్షించాడు," అన్నది.

"అమ్మా, కాంచనా! అదంతా నేను స్వయంగా నా కళ్ళతో చూశాను. ఇతణ్ణి చంపాలని లేదు! ప్రాణాలతో బందీగా మాయాసరోవరానికి తీసుకుపోతున్నాను," అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

కాంచనమాల, జయశీలుడి కేసి తల తిప్పి, "మామగారు నీ కిలాంటి హాని కలిగించనంటున్నారు గదా! నువ్వు ఇష్టంగానే, ఆయన వెంట మాయాసరోవరానికి ఎందుకు రాకూడదు ?" అన్నది.

"కాంచనా, ఇందులో నా యిష్టాయిష్టాలకు తావెక్కడిది? ఈ సరోవరేశ్వరుడు నన్ను జయించి బందీగా తీసుకుపోతున్నాననుకుంటున్నాడు. కావాలంటే యీ క్షణాన ఒక్క కత్తివేటుతో, నా కంఠానికి చుట్టిన తాడును తెగనరకగలను." అన్నాడు జయశీలుడు.

జయశీలుడు యిలా అనగానే మాయాసరోవరేశ్వరుడు, తన పక్కన వున్న మకరకేతుతో, "కేతూ, నువ్వు యీ జయశీలుడు పారిపోకుండా దారి అడ్డగించు. ఈ లోపల నేను ఉరితాడును

కొంచెం బిగలాగి, బలపన్మరణం అంటే ఎలా వుంటుందో, యితడికి తెలిసేలా చేస్తాను,'' అన్నాడు.

మకరకేతు అయిష్టంగా ముఖం పెట్టి, రాజాజ్ఞ గనక చేసేదేమీ లేనందున గుర్రాన్ని అదిలించి, జయశీలుడి కేసి నడిపాడు. అంతలో కాంచనమాల భయ కంపితురాలై చిన్నగా కేక పెట్టి, జయశీలుడి కంఠాన్నుంచి వేలాడుతున్న తాడును రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, ''మామయ్యా, ఈ తాడును మరే మాత్రం గట్టిగా లాగి, ఈయన కంఠాన్ని బిగించినా, నేను సహించను. నేనూ, ఈయనతో పాటు యిదే తాడుతో ఉరిపోసుకుంటాను,'' అన్నది.

''ఆశ్చర్యం! ఈ కొద్దిక్షణాల్లోనే కథ యింతదూరం వచ్చిందన్న మాట!'' అంటూ సరోపకేశ్వరుడు ఆశ్చర్యపోయి, తల పంకించి ఒకటి రెండు క్షణాలు ఆలోచించి, అయినా ప్రయత్నించి చూడటంలో తప్పేముంది, అని మనసులో అనుకుని, చప్పున తల ఎత్తి, ''జయశీలా, నువ్వన్నట్టు కత్తితో నీ మెడను చుట్టిన తాడును తెగకొట్టగలవేమో కాని, ఈ జల గ్రహాన్నుంచి పారిపోలేవు. అది నిన్ను కాళ్ళతో చుట్టగించి, కోరలతో పొడిచి భూస్థాపితం చెయ్యగలదు,'' అన్నాడు.



''ఏదీ ప్రయత్నించి చూడు!'' అంటూ జయశీలుడు కత్తిని పైకెత్తి, తాడును నరకబోయేంతలో మకరకేతు చిన్న గొంతుతో, ''జయశీలా, తొందర పడకు! సరోపలేశ్వరుడు నిన్ను మాయా సరోవరానికి తీసుకుపోదలచటంలో చిన్న రహస్యం వున్నది. పైగా, నువ్వా సరోవరాన్ని చేరాలని ఎలాగూ ప్రయత్నిస్తున్నావు గదా?'' అన్నాడు.

జయశీలుడికి, మకరకేతు మాటలు తన మంచికోరి చెప్పినట్టుగా తోచినై. కనకాక్షరాజుగారి పిల్లల్లో కాంచనమాల ఒక్కతే దొరికింది; ఆయన కొడుకు కాంచనవర్మ యింకా ఆ మాయాసరో



పరంలో బందీగానే వున్నాడు. కాని, యీ కాంచనమాల తనను అపహరించుకు పోయిన మాయాసరోవరేశ్వరుణ్ణి, మామయ్యా, అంటూ ఎంతో గౌరవంగా పిలవటం అతడికెంతో ఆశ్చర్యంతోపాటు, అనుమానం కూడా కలిగించింది....

"సరే, మాయాసరోవరేశ్వరా! నువ్వు నా కన్న బలవంతుడివని తెలిసిపోయింది, లొంగిపోయాను. ఇప్పుడు నన్నేం చేయబో తున్నావు?" అని అడిగాడు జయశీలుడు.

"ఈ లొంగిపోయాననటంలో మోసం ఏమీ లేదు గదా?" అని ప్రశ్నించాడు మాయాసరోవరేశ్వరుడు, జయశీలుడి ముఖంలోకి పరీక్షగా చూస్తూ.

"బలదర్పాలు లేనివాడు, మోసాన్ని అర్థంచేసుకుని ఉపేక్షిస్తాడు. నే నెలాంటి వాడినో, యీ మకరకేతుకు కొంత అయినా తెలిసి వుండాలి. అవునా, మకరకేతూ?" అన్నాడు జయశీలుడు.

"నేను మహారాజుగారికి లోగడే మనవి చేశాను; నువ్వు సామాన్యుడివి కావు, మహాసత్వాల కోవకు చెందినవాడివని." అన్నాడు మకరకేతు.

"సత్యం ఏపాటిదో సరోవరం చేరిన తరవాత చూస్తాను, మనం యింతకు ముందే జలప్పుకుదేశాన్ని చూశాంగదా, కేతూ! మిగిలిన దుర్మార్గులు అక్కడ ఎలాంటి బీభత్సం చేస్తున్నారో." అంటూ మాయాసరోవరేశ్వరుడు పెద్దగా నిట్టూర్చాడు.

"అయితే యిప్పుడు నా మెడను చుట్టిన, యీ ఉరితాడు మాటేమిటి?" అని అడిగాడు జయశీలుడు.

మాయాసరోవరేశ్వరుడు జవాబిచ్చే లోపలే కాంచనమాల నవ్వుతూ, జయశీలుడి కంఠాన్నుంచి తాటి ఉచ్చును ఊడదీసి, "ఇది ఉరితాడు కాదు, మామయ్యా నీ మెడలో వేసిన తామర తూండ్ల హారం!" అన్నది.

"కథ మెరుపు వేగంతో ముగింపుకు వస్తున్నట్టున్నది. పాపం, పద్మముఖి

అన్నిటా దురదృష్టవంతురాలే! కనీసం యితడు జలవృకరాజును హతం చేయటానికి సాయపడినా, నాకు గొప్ప మేలు జరిగినట్టే." అనుకున్నాడు మాయాసరోవరేశ్వరుడు తనలో తాను.

"మహారాజా, ఇప్పుడు ఏం చేయమని ఆజ్ఞ?" అని అడిగాడు మకరకేతు.

"అందరం సరోవరానికి పోతున్నాం. ముందుండి దారి తియ్యి." అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

"జయశీలుడు కాలినడకన మనను అనుసరించగలడా?" అంటూ మకరకేతు, జయశీలుడి కేసి చూశాడు.

"కాంచన నాతోపాటు జలగ్రహం మీద వస్తుంది. నువ్వూ, జయశీలుడూ గుర్రంమీద బయలుదేరండి." అన్నాడు మాయాసరోవరేశ్వరుడు.

కాంచనమాల కూడా తిరిగి మాయాసరోవరానికి తీసుకుపోబడుతున్నదని వింటూనే జయశీలుడు గతుక్కుమని, మకరకేతుతో, "కేతూ, కాంచనమాలను తిరిగి మాయాసరోవరానికి తీసుకుపోయేందుకు నే నొప్పను. కనకాక్షరాజుగారికి, అపహరించుకుపోబడ్డ పిల్లలిద్దర్నీ తెచ్చి ఒప్పచెపుతానని వాగ్దానం చేశాను. దొరికిన యీ పిల్లని మళ్ళీ నిర్బంధానికి గురిచేసేందుకు వీల్లేదు." అన్నాడు.



మాయాసరోవరేశ్వరుడు కోపంగా జయశీలుడి కేసి చూశాడు. కాంచనమాల కూడా అతడికేసి కోపంగా చూస్తూ, "నేనూ, మా అన్న కాంచనవర్మా అరణ్యంలో నుంచి అపహరించుకుపోబడిన మాట నిజమే గాని, ఎవరి నిర్బంధంలో మాత్రం లేము. అన్న వెంట లేకుండా నేను ఒక్కదాన్నే, నా తల్లిదండ్రుల వద్దకు ఎలా వెళ్ళేది? చేతనైతే, నా అన్నను కూడా నువ్వే నిర్బంధాన్నుంచి విముక్తుణ్ణి చెయ్యి." అంటూ చకచకా జలగ్రహం దగ్గిరకు పోయి, మాయాసరోవరేశ్వరుడు అందించిన చేయి ఆధారంతో, దానిమీద ఎక్కి కూర్చున్నది.



"కేతూ, అంతా చిత్రంగా వున్నది! రాజుగారి పిల్లలు అపహరించబడటం, మాయాసరోవరం — అంతా అబద్ధం కాదుగదా?" అన్నాడు జయశీలుడు ఆశ్చర్యపోతూ.

"ముందు వచ్చి గుర్రంమీద కూర్చో. సరోవరం చేరాక, సంగతి సందర్భాలన్నీ నువ్వే గ్రహించగలవు." అన్నాడు మకరకేతు.

జయశీలుడు మారుమాట్లాడకుండా పోయి, మకరకేతు వెనక గుర్రం మీద కూర్చున్నాడు. మాయాసరోవరేశ్వరుడు జలగ్రహాన్ని ఆదిలించాడు. అది కదిలి వేగంగా నడవసాగింది. దానిని అనుసరించి మకరకేతు గుర్రాన్ని పరిగెత్తించ సాగాడు. జయశీలుడికి ఆ సమయంలో సిద్ధసాధకుడు చప్పున జ్ఞాపకం వచ్చాడు. ఎంతోకాలంగా అరణ్యాల్లో తనతోపాటు కష్టాలనుభవించిన సాధకుడు, తాను కనిపించకపోయేసరికి, ఏమనుకుంటాడు? తను మరణించాడని భావించడు గదా? హంసజరథంలో వున్న తన బాల్యమిత్రుడు దేవశర్మ తాను, కాంచనమాలను రక్షించ బోయి, పులివాతబడినట్టు శంకించటం జరిగితే!

జయశీలుడు ఇలాంటి ఆలోచనల్లో మునిగివున్న సమయంలోనే, అశ్వకుల నాయకుడు వీరసేనుడు, సిద్ధసాధకుణ్ణి అరణ్యంలో కనకాక్షరాజు విడిదిచేసి వున్న చోటుకు తీసుకుపోయాడు. రాజు ఆతణ్ణి గుర్తించి, ఆప్యాయంగా పలకరించి, "నీతోపాటు, నా పిల్లలను వెతికి తెచ్చేందుకు బయలుదేరిన జయశీలుడనే యువకుడెక్కడ? మీరెన్నాళ్ళకూ తిరిగి రాకపోయేసరికి రాజ్యాన్ని మంత్రులకు ఒప్పగించి, నేనే స్వయంగా బయలుదేరి, యీ అరణ్యాలన్నీ గాలిస్తున్నాను." అన్నాడు.

"మహారాజా, యువరాజునూ, యువరాణినీ ఎత్తుకుపోయినవాళ్ళు మాయాసరోవరం అనేచోట నివసించే వింత

మనుషులు. వాళ్లు, నీళ్ళల్లోనూ, నీళ్ళ బయటా కూడా మామూలుగానే జీవించ గలరు. వాళ్ళల్లో కొందరిని పట్టుకున్నాం. వాళ్ళ రాజైన మాయాసరోవరేశ్వరు డనే వాడు ముందు నరభక్షకులకు దొరికి, తరవాత నా చేత చిక్కి, తప్పించుకు పోయాడు. అయినా మునిగిపోయిందేమీ లేదు. అదే మాయాసరోవరంలో ఒకొక్క ప్రాంతాన బతికే యీ జలవృక రాక్షసుడు నాకు బంటు అయ్యాడు. ఇతడిద్వారా మనం ఆ సరోవరం ఎక్కడ వున్నదీ తెలుసుకోవచ్చు," అన్నాడు.

"అలాగా!" అంటూ కనకాక్షరాజు, రాతి గదను భుజం మీద పెట్టుకుని, సిద్ధసాధకుడి వెనకగా నిలబడిన జలవృకుడి కేసి చూసి, "ఏదు, నీకు బంటు కాదగినవాడే! మరి, ఆ జయశీలు డేమయ్యాడు?" అని అడిగాడు.

"అతడు, ఇద్దరు మాయాసరోవరం రాజసేవకులతో కలిసి హంసల రథంలో, ఆ రాజుకోసం అరణ్యంలో గాలిస్తున్నాడు. ఆ రాజు నా కంటబడి పారిపోయిన సంగతి అతడికింకా తెలియదు," అన్నాడు సిద్ధసాధకుడు.

"హంసల రథమా?" అంటూ రాజు కనకాక్షుడితోపాటు, అతడి ఉద్యోగులంతా ఎక్కడలేని ఆశ్చర్యంపొందారు.



"ఒక్క హంసల రథం ఏమిటి, మహారాజా? ఈ జలరాక్షసుడేమిటి? ఈ నర వానరం ఏమిటి? ఇంకా—మూడడుగుల ఎత్తయినా లేని మనుషులు, ప్రాణులను పట్టి తినే వృక్షాలు—యిలా, ఒకసారి మనం నగరాలను వదిలి అరణ్యాల్లో ప్రవేశిస్తే, మన కెదురయ్యే వింతలుతప్ప మరేం వుంటవి," అన్నాడు సిద్ధసాధకుడు.

అంతలో కొంచెం దూరంగా వున్న చెట్ల కింద కలకలం బయలుదేరింది. అక్కడ వున్న రాజభటులతో యిద్దరు నరభక్షకులు వాదులాడుతున్నారు. తమకొక గొప్ప రహస్యం తెలుసుననీ, అది చెప్పేందుకు తమను నరవానరాన్ని

ఎక్కి తిరిగే భూతాలరాయుడి వద్దకు తీసుకుపొమ్మని అడుగుతున్నారు.

భటులు వాళ్ళను, "మీరెవరు? ఎక్కణ్ణుంచి వచ్చారు?" అని మామూలు ధోరణిలో ప్రశ్నిస్తున్నారు.

సిద్ధసాధకుడు ఒక రాజభటుణ్ణి పంపి, సంగతి తెలుసుకుని, వాళ్ళనిద్దర్నీ తన దగ్గిరకు తీసుకురమ్మన్నాడు. నరభక్షకు లిద్దరూ వస్తూనే సాధకుడికి ప్రాణాచారం పడిలేచి, "దొరా, మా నాయకుణ్ణి, గణాచారిని విడిపిస్తే, మీకు గొప్ప రహస్యం చెప్తాం," అన్నారు.

సాధకుడికి వాళ్ళేదో ముఖ్యమైన సంగతి తెలుసుకుని వచ్చారన్న అనుమానం కలిగి, [illegible]భటుడికి, గుర్రాలకు కట్టివున్న నరభక్షకుల్ని విడిపించి తెమ్మని ఆజ్ఞ యిచ్చాడు. వాడు పోయి, బెబ్బులిదొరా, మొసలి గణాచార్ల కట్లుతాళ్ళు విప్పి, యిద్దర్నీ చెరొక చేత్తో ఎత్తిపట్టుకుతెచ్చి, సాధకుడి ముందు నిలబెట్టాడు.

"ఇప్పుడు చెప్పండి, మీకు తెలిసిన రహస్యం ఏమిటి?" అని అడిగాడు సిద్ధసాధకుడు, నరభక్షకులను.

"భూతాల దొరా, మీ నుంచి పారిపోయిన మొసలి ముఖంవాణ్ణీ, వింత ఏనుగునెక్కి వచ్చినవాణ్ణీ పట్టుకు తినేందుకు అరణ్యంలో వెతుకుతూండగా, వాళ్ళకు మీలాంటి మనిషి, మరొక ఆడపిల్లా తటస్థపడ్డారు. మేము వాళ్లందర్నీ మీదపడి పట్టుకోవటం ప్రమాదమేమో అని సంశయిస్తూ, చెట్లచాటున పొంచి వుండగా, వింత ఏనుగువాడూ, మొసలి ముఖంవాడూ వాళ్ళను తమ వాహనాల మీద ఎక్కించుకుని, కొండల కేసి దౌడు తీశారు. ఇంకో రహస్యం ఏమంటే: హంసలరథంలో నుంచి నేల దిగిన కొందరు మనుషులు, తూర్పు దిక్కున యిక్కడికి ఒక ఆమడ దూరంలో, మధ్య మధ్య కేకలు పెడుతూ, ఎవరికోసమో చెట్లూ, పుట్టలూ గాలిస్తున్నారు." అన్నారు నరభక్షకులు.

—(ఇంకా వుంది)





# మాయాసరోవరం

## 28

[మాయాసరోవరేశ్వరుడు వెంగదాలు దెబ్బకొట్టి, జయశీలుడి మెడకు ఉచ్చు తాడు బిగించాడు. దానిని తెగనరుకుదామనుకున్న ఆతనితో, మాయాసరోవరేశ్వరుడు మంచిగా మాట్లాడి, కాంచనమాలతో పాటు, ఆతణ్ణి సరోవరం కేసి తీసుకుపోసాగాడు. ఈ సంగతి నరభక్షకుల ద్వారా, సిద్ధసాధకుడికి తెలిసింది. తరవాత—]

నరభక్షకులు అంతా చెప్పి, వింత ఏనుగు మీదివాడు, పట్టుకుపోతున్న మనిషి రూపురేఖలు వర్ణించగానే సిద్ధసాధకుడికి, ఆతడు తన మిత్రుడైన జయశీలుడని తెలిసిపోయింది. కాని, ఆతని వెంట వున్న యువతి ఎవరు?

నరభక్షకులు చెప్పింది విని ఆశ్చర్యపోతున్న రాజు కనకాక్షుడితో, సిద్ధసాధకుడు, "మహారాజా, ఇక, నాకు సెలవిప్పించండి. నా స్నేహితుడైన జయశీలుణ్ణి, ఆ మాయాసరోవరం దుష్టులు బంధించి తీసుకుపోయారు. అంత మహా శూరుడు వాళ్ళకు ఎలా దొరికిపోయాడో నాకు అర్థం కావటంలేదు. ఆతణ్ణి రక్షించటం నా బాధ్యత," అంటూ నరవానరం భుజాలమీద ఎక్కబోయాడు.

రాజు కనకాక్షుడు ఆతణ్ణి వారించి, "సాధకా, ఆ జయశీలుణ్ణి రక్షించవలసిన



బాధ్యత నాకూ వుంది. కొందరు భటుల్ని, అశ్వికుల్ని వెంటబెట్టుకుని నేనూ, నీతో పాటు వస్తాను. మనం కాలయాపన చెయ్యకుండా, ఆ మాయాసరోవరం ఎక్కడ వున్నదో తెలుసుకోవటం అవసరం. నీ జలపృక భటుణ్ణి అడిగి తెలుసుకో రావా?" అన్నాడు.

సిద్ధసాధకుడు తల వూపి, శూలాన్ని జలపృక రాక్షసుడి గుండెల కేసి గురి చేసి, "ఒరే, జలపృకభటా! నువ్వు, నాకు విశ్వాస పాత్రుడివైన భటుడివా లేక, నీ పాతయజమాని ఆ మాయాసరోవర రాక్షసుడి పక్షాన, నా మీద వేగుకు వచ్చావా? నిజం చెప్పు." అన్నాడు.

ఆ ప్రశ్నకు జలపృకుడు ఏ మాత్రం బెదరక, రాతిగదను సిద్ధసాధకుడి పాదాల ముందు పెట్టి, "దొరా, నిజమైన జలపృకుడు అడినమాట తప్పడు. అలా తప్పినవాణ్ణి, నీటినక్కలకింద వేటాడతాం. నేను తమకోసం ప్రాణాలైనా ఇవ్వడానికి సంకోచించని స్వామిభక్తి గల సేవకుణ్ణి." అన్నాడు.

"ఆ మాట నిజమైతే, ఇప్పుడు చెప్పు. ఆ మాయాసరోవరం ఎక్కడ వున్నది?" అన్నాడు సిద్ధసాధకుడు.

"దొరా, లోగడ ఒకసారి తమకు మనవిచేశాను. ఆ సరోవరం ఎక్కడ వున్నదో చెపితే, నా తల పగిలి చస్తాను. అది మా జాతివాళ్ళకు, సరోవర రాజుతో పాటు, మా రాజు కూడా ఇచ్చిన శాపం," అన్నాడు జలపృకుడు.

ఆ మాటలకు సాధకుడు పెద్దగా నవ్వి, "ఆ సరోవరం పక్షివెధవకు శాపాలిచ్చే శక్తివుంటె, వాడు హంసలరథం ఆకాశంలో తల కిందులైనప్పుడు, అక్కడి నుంచి పల్టీలుకొడుతూ సూటిగావచ్చి, నర భక్షకుల రాగినీళ్ళ బానలో పడడు. తెలిసిందా?" అన్నాడు.

జలపృకుడు నిలువెల్లా వణికిపోతూ, "దొరా, మీరు నా మాట నమ్మటంలేదు గనక, నాకు చావు ఎలాగూ తప్పదు.



అయినా, నోటితో చెప్పకుండా, సంజ్ఞలతో తెలియపరిస్తే, ఒకవేళ బతికిపోతుంటా నేమో!'' అంటూ పోయి, చెట్టునుంచి, ఒక ఎండుపుల్లను విరిచి తెచ్చాడు.

''వృకభటా, నీ ప్రాణానికొచ్చిన భయం ఏమీ లేదు. నేను మహాకాలుడి భక్తుణ్ణి. ఒకవేళ నువ్వు చావటమే జరిగితే, నిన్ను క్షణాలమీద కైలాసానికి పంపి, అక్కడ సుఖపడేలా చేస్తాను,'' అన్నాడు సాధకుడు.

జలవృకుడు తాను తెచ్చిన ఎండుపుల్లతో నేలమీద గీట్లు గీస్తూ, మధ్య మధ్య, ''అయ్యో, తల బద్దలవుతున్నది, గుండెలు దిక్కపట్టుతున్నవి.'' అంటూ అరవసాగాడు.

కనకాక్షరాజు, జలవృకుణ్ణి సమీపించి సాధకుడితో, ''సిద్ధసాధకా, నా పిల్లల్ని తగినంత మంది అంగరక్షకులతోను లేకుండా, అరణ్యాలలోకి పోనివ్వటం, ఎంత మంది చిక్కులకు కారణమైంది! పాపం, యీ నిటితోలు వెధవ నిజంగానే తల పగిలి చస్తాడేమో,'' అన్నాడు.

''మహారాజా, వీడు ఒట్టిమూఢుడు! మహాకాలుడి దర్శనం అయి, ఆయన దీవించందే, ఏ నరమానవుడికీ యితర్లను శపించగల శక్తి రాదు,'' అంటూ సిద్ధసాధకుడు, జలవృకుడు మట్టిలో గీస్తున్న గీట్లు కేసి పరీక్షగా చూస్తూ, ''ఒరే, భటా! ఈ నిలువు గీతలేమిటి? ఈ వంకరటింకర గీట్లేమిటి?'' అని అడిగాడు.

జలవృక రాక్షసుడు తల ఎత్తకుండానే నిలువెల్లా వడవడ వణికిపోతూ, ''దొరా, ఇవి, యీ దూరాననున్న కొండలు, యివన్నీ అరణ్య వృక్షాలు. వాటిలో ఎత్తయిన యీ వృక్షం ఒక రాతి గుట్ట మీద వున్నది. ఆ చెట్టు ఎక్కి, చివారు కొమ్మకు పోయి ఒకసారి తూర్పుకూ, మరొకసారి పడమరకూ చూసి, తరవాత ఉత్తరంగా చూస్తే, మాయాసరోవరం కంటబడుతుంది!'' అని, రెండు చేతులతో గట్టిగా తలపట్టుకుని, ''దొరా, రహస్యం



చెప్పేశాను. తల పేలిపోతున్నది. హా, చస్తిని!'' అంటూ దభీమని కింద పడిపోయాడు.

సిద్ధసాధకుడు చప్పున వంగి, వృకుడి ముక్కు దగ్గిర చెయిపెట్టి చూ... వాడింకా గాలి పీల్చి వదులుతూండటం గమనించి, ''మహారాజా, మూఢ నమ్మకాలు ముప్పు తేగలవనేందుకు, యీ జలవృకుడే మనకు సాక్ష్యం. వాడు శాపభయంతో, గుండెలవిసి కిందపడ్డాడే తప్ప, చావలేదు,'' అని, దాపులనున్న నరభక్షకులతో, ''ఒరే, తక్షణం పోయి నాలుగైదు కుండల నిండుగా నీళ్ళు తెండి,'' అన్నాడు.

నరభక్షకులు ఆశగా జలవృక రాక్షసుడి కేసి చూస్తూ కదలా మెదలక వుండి పోయారు. వాళ్ళ వాలకం గమనించిన సిద్ధసాధకుడు శూలం పైకెత్తి, ''దుర్మార్గులారా! నా ఆజ్ఞ విన్నారా? కదలరేం?'' అని కళ్ళెర్ర చేశాడు.

నరభక్షకుల నాయకుడు సంజ్ఞ చేయగానే, వాళ్ళ ముసలిగణాచారి ముందుకు వచ్చి, రాజు కనకాక్షుడికి సాష్టాంగపడి లేచి, ''మారుమూల అరణ్యాల్లో బతికే మాకు, మంచీ, మర్యాదలూ ఎలా పాటించాలో తెలీదు. మహారాజనేది మీ పేరు కాదనీ, అధికార బిరుదనీ అనుకుంటున్నాను. తమరు, యీ వయ్యాలపోతును అవతలికి నెట్టించి, యీ నీటి రాక్షసుణ్ణి మాకు యిప్పించండి: మీ పేరు చెప్పుకు మరీ తింటాం,'' అన్నాడు.

ముసలిగణాచారి మాట ముగించే ... సిద్ధసాధకుడు వాడి జుట్టు పట్టు ... ''ఒరే, నరభక్షక క్రూరమృగమా! ...వే, నా శూలానికి గుచ్చి మహాకాలుడికి బలి చెయ్యబోతున్నాను,'' అంటూ శూలం పైకెత్తాడు.

సిద్ధసాధకుడు, గణాచారిని శూలంతో పొడవబోయే సమయానికి, దూరం నుంచి జలాశ్వం మీద వేగంగా వస్తున్న సర్పనఖుడు అది చూసి, పెద్దగా గొంతెత్తి,



"సిద్ధసాధకా, తొందరపడకు! మనం మాయాసరోవరంలోని జలవృక రాక్షసులతో పోరాడవలసిన పరిస్థితి వచ్చింది. అందుకు మన వెంట, యీ నరభక్షకులు కూడా కలిసి వస్తారేమో ప్రయత్నించి చూడాలి," అంటూ కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే సిద్ధసాధకుడు శూలాన్ని దించి తలతిప్పి చూశాడు. అదే అదనుగా తీసుకుని నరభక్షకుల గణాచారి దూరంగా పారిపోయి, వాళ్ళ జాతివాళ్ళ గుంపులో కలిసిపోయాడు.

సర్పనఖుడు సిద్ధసాధకుడి దగ్గిరకు వచ్చి గుర్రం దిగి, నేలమీద చచ్చినట్టు పడివున్న జలవృకభటుణ్ణి చూసి, "సాధకా, యితణ్ణి పరలోకానికి పంపావా ఏం! వీడు నీకు నమ్మిన బంటుగదా?" అన్నాడు.

"వీడు నమ్మిన బంటే. కాని, మీలాగే వీడికి, వాళ్ళ రాజేకాక, సరోవరేశ్వరుడి శక్తిలో కూడా నమ్మకం వున్నట్టున్నది. ఏదో శాపం అంటూ, మాయాసరోవరానికి వెళ్ళే దారి గుర్తులు నేలమీద గీస్తూ కింద పడిపోయాడు," అన్నాడు సిద్ధసాధకుడు.

అంతలో కొందరు కనకాక్షరాజుగారి భటులు పాత్రల్లో నీళ్ళు తెచ్చి, జలవృక రాక్షసుడి మీద పోశారు. ఆ చల్లని నీరు పైన పడగానే వాడు నేలమీద అటూ యిటూ పొర్లుతూ, కళ్ళు తెరవకుండానే, "నే నెక్కడున్నాను? నరకంలోనా, సరోవరంలోనా?" అంటూ అరవసాగాడు.

సిద్ధసాధకుడు వాడి వెన్నుమీద కాలితో గట్టిగా ఒకసారి తన్ని, "జలవృకభటా! నీకు శాపవిముక్తి కలిగింది; బతికి చావు, లే!" అన్నాడు.

ఆ మాటలతో జలవృకుడు లేచి కూర్చున్నాడు. సర్పనఖుడు తృప్తిగా తలాడించి, దాపులనున్న రాజభటుల్ని, రాజు కనకాక్షుణ్ణీ చూసి, "వైద్యదేవుడు హంసల రథంలో ఎగురుతున్నప్పుడు చెప్పగా తెలిసింది, వీరేగదా హిరణ్యపుర రాజులైన కనకాక్షులుంగారు?" అన్నాడు.







రాజు కనకాక్షుడు ఆ క్షణంవరకూ సర్పనఖుడి వింత వేషాన్నీ, వాడెక్కి వచ్చిన జలాశ్వాన్నీ చూస్తూ ఆశ్చర్య పోతున్నాడు. ఇప్పుడాయన ఆతడన్న మాట అర్థంకాక, "ఎవరా, వైద్యదేవుడు? నా రాజ్య పౌరుడేనా?" అని అడిగాడు.

"మహారాజా, ఆ సంగతి నాకు తెలియదు. ఆయన, నా వెనకగా బయలు దేరి యిక్కడికే వస్తున్నారు," అన్నాడు సర్పనఖుడు.

"సాధకా, నువ్వెరుగుదువా, యీ వైద్య దేవుణ్ణి?" అన్నాడు కనకాక్షుడు. సిద్ధ సాధకుడు కొంచెంసేపు చెప్పటమా, మానటమా అని తటపటాయించి, చివరకు, "మహారాజా, ఆ వైద్యదేవుణ్ణి గురించి, మాయాసరోవరంలో పరమ శత్రువులుగా నివసించే జలపృక రాక్షసులకూ, మాయాసరోవరేశ్వరుడి అను చరులకూ తెలియని చిన్న రహస్యం ఒకటి వున్నది. ఆయనా, జయశీలుడి లాగే అమరావతీ నగరవాసి!" అన్నాడు.

"అమరావతీ నగరం వాడా, జయ శీలుడు! ఆ దేశపు రాజు రుద్రసేనుడు నాకు ప్రబల శత్రువు. నేను కష్టాల్లో వున్నానని తెలిసి, నా మీద యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నట్లు, వేగుల ద్వారా నమ్మకంగా తెలిసింది," అన్నాడు రాజు కనకాక్షుడు కోపంగా.

"మహారాజా, జయశీలుడి నిజాయితీని శంకించకండి. అతడు ఏ దేశపు పౌరుడైనా, తనకు మాట యిచ్చిన మేరకు, యువరాణీ, యువరాజులను వెతికి తెచ్చేందుకు సాయపడతాడు. మీ దేశ పౌరుడుగా నేను యిందుకు మాట యిస్తున్నాను," అన్నాడు సిద్ధ సాధకుడు.

సాధకుడు యిలా మాట్లాడుతూండగా, కొంచెం దూరంలో వున్న వనభక్షకుల గుంపులో కలకలం బయలుదేరింది. దానికి కారణమేమిటా అని సిద్ధసాధకుడు అటువైపు చూసేంతలో, వాళ్ళ నాయకుడు

దెబ్బలిదేరా, గనాచారి అతడి దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చి, "మీ లాంటి మనుషులు నలుగురు. పది పన్నెండు మంది జలవృక రాక్షసులతో దెబ్బలాడు తున్నారు. మమ్మల్ని సాయం పొమ్మంటారా, ఇంత ఆహారం అయినా దొరుకుతుంది?" అన్నారు.

ఆ మరుక్షణం సర్పనఖుడు తన గుర్రం మీద ఎగిరి కూర్చుని, "సాధకా, వాళ్లు వైద్యదేవుడూ, నా తమ్ముడూ, హంసల రథం తోలే రాజుగారి అంగరక్షకుడూ," అంటూ కదులువేరాడు.

"హై, మహాకాకా!" అంటూ సిద్ధ సాధకుడు నరవానరం గుర్రాలమీదికి ఎగిరి, రాజు కనకాక్షుడితో, "మహారాజా ముందు ఆ నీటి రాక్షసుల్నుంచి మన వాళ్ళను కాపాడాలి," అంటూ సర్పనఖుణ్ణి అనుసరించాడు.

"ఆరణ్యదేవతా, నువ్వే, మా ఆకలి తీర్చాలి!" అంటూ నరభక్షకులు గుంపుగా వాళ్ళ వెంట పరిగెత్తసాగారు.

సర్పనఖుడూ, సిద్ధసాధకుడూ వెళ్ళే సరికి గుర్రం మీద వుండి జలవృకులతో పోరుతున్న సర్పస్వరుడు, తన కత్తితో వాళ్ళను పొడవాలని చూస్తున్నారు. కాని జలవృకులు ఒడుపుగా తప్పించుకుని వైద్యదేవుడని పిలవబడే దేవశర్మనూ,



హంసలరథం తోలేవాణ్ణీ, కుంటి మంగళ వర్మనూ ప్రాణాలతో పట్టుకోవాలని చూస్తున్నారు. కాని, దేవశర్మ, వాళ్ళను తన వజ్రాలు తాపిన చేతికర్రతో అటకాయిస్తూ, "ఒరే, మూర్ఖులారా, జాగ్రత్త! ఈ కర్ర చివర వున్న ముళ్లు, విష పూరితం. మీ శరీరాలకు తాకిందా, క్షణాల మీద చచ్చిపోగలరు." అంటూ వాళ్ళను హెచ్చరిస్తున్నాడు.

అంతలో అక్కడికి సిద్ధసాధకుడూ, సర్పనఖుడూ వచ్చారు. దూరంనుంచి కేకలు పెడుతూ నరభక్షకులూ, రాజు కనకాక్షుడి భటులూ కూడా అటే వస్తున్నారు. వాళ్లను చూస్తూనే వెనుదిరిగి పారి





పోవాలని ప్రయత్నిస్తున్న జలవృక రాక్షసులతో వారి నాయకుడు. "ఆగండి! మన రాజాజ్ఞ, వీళ్ళను ప్రాణాలతో పట్టలేకపోతే, చంపి రమ్మని గదా?" అంటూ ఎగిరి రాతిగదతో దేవశర్మను కొట్టబోయాడు.

దేవశర్మ ఒకడుగు వెనక్కు వేసి, "నీకు చావు రాసిపెట్టి వుండగా, నేనేం చేయగలను!" అంటూ తన చేతికర్రను వాడి శరీరానికి తాకించాడు. ఆ వెంటనే జలవృక రాక్షసుల నాయకుడు ఒక చావుకేక పెట్టి, కిందపడి గిలగిల తన్నుకోసాగాడు.

దేవశర్మ తన చేతికర్రను పైకెత్తి, "ఒరే, ప్రాణాలతో వున్న జలవృకులారా, యిదే నా హెచ్చరిక! సరోవరంలో వున్న మాయాసరోవరేశ్వరుడి కుమార్తె పద్మముఖికిగాని, కాంచనవర్మకుగాని ఏ కొద్దిపాటి హాని జరిగినా, మీ రాజుతోపాటు మిమ్మల్నందర్నీ దుర్మరణం పాలు చేస్తాను, జాగ్రత్త. వెళ్ళి మీ రాజుతో చెప్పండి!" అన్నాడు.

జలవృక రాక్షసులు హాహాకారాలు చేస్తూ, అరణ్యానికి అడ్డంపడి పారిపోసాగారు. సర్పసఖుడు, దేవశర్మను సమీపించి, గుర్రం దిగి, "వైద్యదేవా! మాయాసరోవరేశ్వరుడూ, కాంచనమాలా, జయశీలుడూ జలవృకరాక్షసుల నుంచి రానున్న ప్రమాదం తెలియక, సరోవరానికేసి పోతున్నారు గదా, వాళ్లను హెచ్చరించవద్దా?" అన్నాడు.

"ఆ పని మీ అన్నదమ్ములూ, హంసల రథం తోలే సరోవరేశ్వరుడి అంగరక్షకుడూ చేయాలి. బయలుదేరండి!" అన్నాడు దేవశర్మ.

సర్పసఖ, సర్పస్వరులు జలాశ్వాలను అదిలించి వేగంగా పరిగెత్తించసాగారు. అంగరక్షకుడు దాపులనున్న చెట్ల వెనక్కు పోయి హంసల రథాన్ని క్షణాలమీద ఆకాశంలోకి ఎగిరించాడు. నరభక్షకులు ఉత్సాహంగా కేకలు పెడుతూ, పారిపోతున్న జలవృకరాక్షసుల వెంటబడి, తరమసాగారు. —(ఇంకావుంది)





# మాయాసరోవరం

## 29

[జయశీలుణ్ణి, మాయాసరోవరేశ్వరుడు తన వెంట తీసుకుపోతున్నాడని తెలిసి, విద్యాసాధకుడు బయలుదేరబోతున్న సమయంలో, జలవృకరాక్షసులను గురించిన వార్త చేరింది. రాజు కనకాక్షుడూ, సాధకుడూ వెళ్ళేసరికి జలవృకులతో పోట్లాడుతున్న దేవశర్మా, యితరులూ కనిపించారు. పారిపోతున్న జలవృకులను సరభటకులు తరుముసాగారు. తరవాత—]

తమ ఆకలి తీర్చుకునేందుకు, జలవృక రాక్షసుల్లో ఏ ఒకరిద్దరినైనా పట్టుకోవాలనే ఉత్సాహంలో, సరభభటులు పరిగెత్తుతున్నారే తప్ప, రాక్షసులు తమను ఏ మార్గాన తీసుకుపోతున్నదీ వాళ్ళు గమనించటం లేదు. ఆ సమయంలో యిద్దరు జలవృకులు గుబురుగావున్న ఒక ఎత్తయిన చెట్టుకొమ్మల్లో దాగివుండి, యీ జరుగుతున్నదంతా గమనిస్తూనే వున్నారు. వాళ్ళు, తమ రాజైన జలవృకనాథుడు పంపగా, ఉదయం నుంచి, ఆ ప్రాంతాల వేగుకాస్తున్నారు.

చెట్టు మీది జలవృకరాక్షసుల్లో ఒకడు, తన పక్కనున్న వాడితో, "ఒరే, మన రాజుకు శత్రుబలం ఎంత పెద్దదో పూర్తిగా తెలిసినట్టులేదు. ఇంతకుముందు సరోవరంలో జరిగిన యుద్ధంలో, ఆ మాయా సరోవరం రాజు జంట్లనందర్నీ, తన్ని



తరిమేశాం గాని, ఆతడికి మరికొందరు సాయం వస్తున్నట్టున్నది!" అన్నాడు.

రెండో జలవృకరాక్షసుడు. మొదటి వాడు యింత మాట్లాడినా, వినిపించు కున్నట్టేలేదు. వాడి దృష్టి, మాయాసరోవరం కేసి పారిపోతున్న తన జాతివాళ్ళ మీదా, వెనకపస్తున్న నరభక్షకుల మీదే కాక, మరికొంచెం దూరంలో కొయ్యకాలుతో కుంటుతూ, చేతికర్ర ఊతంతో నడిచివస్తున్న, హిరణ్యపుర సేనాని కొడుకు మంగళవర్మ మీద వున్నది.

జలవృకుడు తనతోటి వాడికి కుంటి మంగళవర్మను చూపుతూ, "ఒరే, వీణ్ణి పట్టుకుపోయి మన రాజుగారి ముందు పెడితే ఎలా వుంటుందంటావు? వీడి నుంచి, కొత్తగా యీ అరణ్యానికొచ్చిన రాజు వెంట ఎంత బలగం వున్నదో తెలుసుకోవచ్చు," అన్నాడు.

"అది బాగానేవుందిగాని. మరి రెండు గుంపులై, మాయాసరోవరం కేసి పోతున్న శత్రువుల మాటేమిటి? వాళ్ళను ఒక కంట కనిపెట్టివుండి, వాళ్ళు ఏం చేయబోతున్నారో మనరాజును ముందుగా హెచ్చరించవద్దా?" అన్నాడు రెండో జలవృకుడు.

"ఆ పనేదో నువ్వు చూడు. వాళ్ళు పోతున్నది మాయాసరోవరం కేసి. అందులో తెలియురాని రహస్యం అంటూ ఏమీ లేదు. నేను యీ పొట్టివెధవను, భుజాన వేసుకుపోయి మన రాజుగారికి ఒప్పచెబుతాను," అంటూ మొదటి జలవృకరాక్షసుడు, చెట్లకొమ్మల్లోంచి దిగి, మంగళవర్మకు వెనకగా నడవసాగాడు.

మంగళవర్మ తనకు రానున్న ప్రమాదాన్నిగురించి శంకించే స్థితిలో లేడు. కాళ్ళున్న వాళ్ళూ, గుర్రాలున్న వాళ్ళూ, హడావిడిలో తనమాట మరిచి, మాయాసరోవరం కేసి పోతున్నారు. తాను వెనక బడిపోయాడు! సాధ్యమైనంత త్వరగా సరోవరాన్ని చేరి, అక్కడ జలవృక రాక్షసులతో జరగబోయే యుద్ధంలో తనూ





తప్పుకపోవాలి. ఒక మనిషి వీరుడవునో కాదో నిర్ణయించేది కాలూ, కత్తీ కాదు; గుండెబలం!

మంగళవర్మ యిలా ఆలోచిస్తూ పోతున్నంతలో, వెనక నుంచి పెద్ద చప్పుడైంది. అతడు చప్పున తల తిప్పి చూశాడు. జలవృకరాక్షసుడు అతణ్ణి వెనకనుంచి హఠాత్తుగా మీదపడి పట్టుకుందామనే ఆదుర్దాలో, తను నడుస్తున్నదారి ఎలావున్నదో చూసుకోక పోవటంతో, వాడి కుడికాలు లోతైన ఒక నెర్రెలో పడగానే, వాడు ముందుకు తూలటంతో రాతిగద పోయి దూరంగాపడింది. వాడు నిశ్శబ్దంగా కాలును బయటికి లాక్కుందామని ప్రయత్నించాడు గాని, వాడు పడ్డపాటుకు అది మోకాలి దగ్గిర బెణికిపోయింది.

జలవృకరాక్షసుడు బాధతో గొంతెత్తి, "హా, జలవృకనాథా, నువ్వే శరణ్యం!" అంటూ పెద్దగా అరిచాడు.

మంగళవర్మకు తనకు ఎంతస్వల్పంలో ప్రమాదం తప్పిపోయిందో అర్థమైంది. అతడు జలవృకుడి దగ్గిరకుపోయి, "ఒరే, నన్ను పట్టుకోబోయి నువ్వు కాలు విరగ్గొట్టుకున్నావు. మంచిశాస్తే జరిగింది. ఇప్పుడు నీక్కావలసింది వైద్యసహాయం. అంతేగాని, ఎక్కడోవున్న మీ రాజు జలవృకనాథుడు నీకు చేయగలిగిందేమీ



లేదు. ఇంతకుపూర్వం మీ జలరాక్షసులు, సరోవరేశ్వరుడి భవనాలమీద దాడిచేశారు గదా? అందులో ఎవరు గెలిచారు? నిజం చెపితే, సంజీవిలాంటి మూలికలతో నీ విరిగిన కాలుకు కట్టుకట్టి, నడిచేలా చేస్తాను," అన్నాడు.

ఆ మాటలకు జలవృకుడు మూలుగుతూ జవాబివ్వబోయేంతలో, చెట్టు కొమ్మల్లోవుండి యిదంతా చూసిన జలవృకుడి రెండోవాడు, రాతిగదను పైకెత్తి పట్టుకుని కేకలుపెడుతూ, "ఒరే, మాయా సరోవరేశ్వరుడి బంటూ! నిన్ను క్షణంలోనే, యీ లోకం నుంచి ప్రయాణం కట్టిస్తాను." అంటూ పరిగెత్తుకురాసాగాడు.



మంగళవర్మ మెరుపు వేగంతో తన ఊతకర్ర పిడిని పట్టుకుని పైకి గుంజాడు. లోపలినుంచి తళతళ మెరుస్తున్న పదునైన కత్తి బయటికి వచ్చింది. అతడు, ఆ కత్తిని కాలువిరుచుకున్న జలవృక రాక్షసుడి కంఠం మీద పెట్టి, తనను సమీపిస్తున్న జలవృకుడితో, "ఒరే, దుర్మార్గుడా! నేను ఒకటి నుంచి— మూడు అని పలికేలోపల నువ్వు రాతి గదను దూరంగా పారేసి, మోకాళ్ళమీద పాకుతూ నన్ను సమీపించాలి. అలా చేయకపోయావో ముందు నీ నేస్తగాడి తల తెగిపోతుంది. తరవాత నీ వంతు! అదిగో, ఒకటి, రెండు...." అన్నాడు.

మంగళవర్మ మూడు అనేలోపల జలవృకుడు రాతిగదను దూరంగా విసిరి, మోకాళ్ళనూ, చేతులనూ నేల మీద ఆనించి, "లొంగిపోయాను. నా మిత్రుణ్ణి చంపకు!" అన్నాడు వణికిపోతూ.

"ఒరే, నీటిలోదేలు వెధవ్వాయినా, నీ స్నేహధర్మం మెచ్చదగింది. నా వెంటరా నీకు ఓషధీపత్రాలు చూపుతాను," అంటూ మంగళవర్మ, దాపుల్లో చిత్త ఒత్తుగా పెరిగిన పొదలూ, చిన్నచిన్న మొక్కల్లోకి దారితీశాడు.

మంగళవర్మ జాగ్రత్తగా పరిశీలించి, అక్కడ కొన్ని పండుటాకులూ, చిగుళ్లూ కోసి, వాటిని అరచేతుల్లో మర్దించి, ఉండగా చేసి, దాన్ని జలవృకరాక్షసుడికి యిస్తూ, "ఒరే, ఈ ఔషధాన్ని నీ మిత్రుడి మోకాలికి అంటించి, కట్టు కట్టు. వాడు ఉన్నచోటనే కనీసం పన్నెండు గంటలపాటు కదలకుండా వుండాలి. అలా చేయకపోయావో, మోకాలు వరకూ తెగ నరకవలసి వస్తుంది." అన్నాడు.

ఆ మాటలకు జలవృకరాక్షసు లిద్దరూ ఏడ్పు ముఖాలు పెట్టారు. వాళ్ళు అరణ్యంలో ఏదో ముఖ్యమైన పనిమీద తిరుగుతున్నారనీ, అడిగినా నిజం చెప్పరనీ అనుకుంటూ మంగళవర్మ ముందుకు కదిలాడు. అతడు కొంతకాలంపాటు





మాయాసరోవరంలో నివసించినవాడు. అతడికి అక్కడికి వెళ్ళేందుకు దగ్గర దారి ఏదో తెలుసు. కాని, కొయ్యకాలుతో, ఎత్తు పల్లాలుగావున్న నేలమీద నడవటం అతడికి చాలా ప్రయాసగావున్నది.

మంగళవర్మ అలా కుంటుతూ, నాలుగైదు నిమిషాలకాలం నడిచేసరికి, అతడికి ఒక ఎత్తయిన చెట్టు మీది నుంచి, "మంగళవర్మా!" అన్న పిలుపు వినిపించింది.

ఇదేరకం వృక్షపిశాచి, అనుకుంటూ మంగళవర్మ తల ఎత్తి చూశాడు. ఒక పెద్దచెట్టు చిటారు కొమ్మల మీద, అల్లిబిల్లిగావున్న అడవితీగలలో చిక్కుకుని, ఒక మనిషి అతడికి కనిపించాడు. వాడు మాయాసరోవరేశ్వరుడి హంసలరథం తోలేవాడు. ఆ రథం ఆకాశంలో తలకిందులైనప్పుడు, వాడు దానిలోనుంచి జారి, ఆ చెట్టుపైగల అడవితీగల్లో చిక్కుకుపోయి, చావు తప్పుకున్నాడు.

'ఓహో, నువ్వు బతికే వున్నావన్నమాట! చాలా సంతోషం. కిందికి దిగి రావటానికి, దాపుల్లో ఏదైనా కొమ్మఊతం దొరకలేదా?" అన్నాడు మంగళవర్మ.

హంసలరథం తోలేవాడు అవునన్నట్టు తలవూపి, "వర్మా, కొంచెం మెల్లగా మాట్లాడు. యమకింకరుడిలాటి వాడొకడు భయంకరమైన నరవానరాన్ని ఎక్కి, యీ మార్గానే వస్తున్నాడు. అతడి వెంట కొందరు సైనికులుకూడా వున్నారు. ఏళ్లు





మన శత్రువులైన జయశీలుడూ, సాధకుడూ అనుకుంటాను,'' అన్నాడు.

మంగళవర్మకు ఆ మాటలు వింటూనే ఉత్సాహం కలిగింది. ఆ వచ్చేవాళ్ళలో వైద్యదేవుడని పిలవబడే దేవశర్మ కూడా వుంటాడు. అప్పుడు వాళ్ళతో కలిసి, సాధ్యమైనంత త్వరగా మాయాసరోవరాన్ని చేరవచ్చు!

''ఒరే, బాబూ, యిప్పుడు వాళ్ళు మనకు శత్రువులు కారు; కాని మిత్రులవునో కాదో మాత్రం నాకు తెలియదు. మాయాసరోవరేశ్వరుడు, ఆ జయశీలుడనే అతన్ని పట్టుకుని, సరోవరం కేసి వెళ్ళాడని తెలిసింది. ఇక యిప్పుడు మన చెప్పే వీళ్ళలో మనవాడైన వైద్యదేవుడున్నాడు; నేను ఒంటికాలివాణ్ణి, చెట్టెక్కలేను. నువు దిగలేవు. ఆ వచ్చేవాళ్ళను చప్పట్లు చరిచి పిలువు.'' అన్నాడు మంగళవర్మ.

వైద్యదేవుడు, ఆ నరవానరం ఎక్కివచ్చే వాడి వెంట వున్నాడని తెలియగానే రథం తోలేవాడికి ప్రాణం లేచి వచ్చింది. తను మరికొద్దికాలం అలా చెట్టుకొమ్మల్లో చిక్కుకుపోయివుంటే, ఏ నరభక్షకులో, జలపృకరాక్షసులో తనను హతమార్చి వుండేవాళ్ళు!

రథం తోలేవాడు, తానున్న చెట్టుకు కొంచెం దూరంగా పోతున్న పెద్ద సాధకుడూ, రాజు కనకాక్షుడూ, అతడి వెంట వున్నవాళ్ళనూ ఉద్దేశించి, పెద్ద గొంతుతో, ''అయ్యలారా, నన్ను రక్షించండి! ఇక్కడ చెట్టు చిటారు కొమ్మల్లోని, అడవితీగల్లో చిక్కుబడిపోయాను,'' అంటూ అరిచాడు.

అంతదూరం నుంచి వచ్చిన ఆ కేకను ముందుగా తన వాడి చెవులతో నరవానరం విన్నది. ఆ వెంటనే అది ఆగి, తల ఎత్తి చూస్తూ, భుజాలమీద వున్న పెద్దసాధకుడికి సౌంజ్ఞ చేసింది. అంతలో రథం తోలేవాడు, మరొకసారి పెద్దగా కేక పెట్టాడు.

ఈ సారి వాడి కేకను అందరూ స్పష్టంగా విన్నారు. దేవశర్మ ముందుకు



ప్రాంతాన నివసించే జలవృక రాక్షసులు. అందరం కలిసి వాళ్లను నాశనం చేస్తే తప్ప, కనకాక్షరాజుగారి పిల్లల్ని రక్షించే అవకాశం వుండదు. ఇప్పుడా సరోవరం జలవృకుల చేతుల్లో వుందని నా అనుమానం," అన్నాడు. అంతలో అక్కడికి కనకాక్షరాజు కొందరు సైనికులతో వచ్చారు.

"అయ్యలారా, నా మాటేమిటి? పెద్ద కొండచిలువ ఒకటి, కొమ్మల మీద పాకుతూ, నా కేసి వస్తున్నది!" అంటూ రథం తోలేవాడు భీతితో పెద్దగా అరిచాడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు, నరవానరం వీపు చరిచి, చేయెత్తి చూపుతూ, "ఆ చెట్టు కొమ్మల్లోని అడవి తీగల్లో చిక్కుకు పోయినవాణ్ణి, పోయి కిందికి తీసుకురా," అని ఆజ్ఞాపించాడు.

నరవానరం చప్పున కదిలి, మెరుపు వేగంతో చెట్టు చిటారు కొమ్మల్లోకి పోయి, ఒక చేత్తో రథం తోలేవాణ్ణి సమీపిస్తున్న కొండచిలువను పడిని పట్టుకుని, రెండవ చేత్తో రథంవాణ్ణి, అడవి తీగలనుంచి బయటికి లాగింది. వాడు, వానరాన్ని చూసి గడగడలాడిపోతూ, ఒక బలమైన కొమ్మ పట్టుకుని, "ఇక నన్ను వదులు, కిందికి దిగి రాగలను!" అన్నాడు.

అంతలో హఠాత్తుగా జలవృకరాక్షసుల గుంపొకటి రాతిగదలెత్తి, అక్కడికి పరిగెత్తుకు వస్తూ, "జై, జలవృక నాథుడికి!" అంటూ వాళ్లమీద పడ్డారు.

జలరాక్షసుల్లో ఖడ్గమృగం మీద ఎక్కి వున్న వాడొకడు రాతిగదను గిరగిరా తిప్పుతూ, "శత్రువుల్లో ఒక్కడైనా ప్రాణాలతో పారిపోగూడదు," అంటూ జలవృకుల్ని హెచ్చరించాడు.

చెట్టుకొమ్మల్లో వుండి యిది చూసిన నరవానరం, అరణ్యాలు దద్దరిల్లేలా ఒక కేకపెట్టి, చేతిలో చిక్కిన కొండ చిలువను చర్నాకోలలా ఛళీమంటూ మోగించి, అంత ఎత్తునుంచి ఖడ్గమృగం ఎక్కి వున్న జలరాక్షసుడి మీదికి సూటిగా దూకింది.

—(ముగింపు రాబోయే సంచికలో)





వచ్చి, "ఆ గొంతు మాయాసరోవరేశ్వరుడి రథం తోలేవాడిదిలా వున్నది. వాడు హంసలరథంలోంచి, యీ ప్రాంతాలే కింద పడిపోయాడు," అన్నాడు.

"ఆహా, వాణ్ణి దొరకపుచ్చుకుని, వాడి యజమాని ఆ నీటిపక్షిగాడి రహస్యాలన్నీ బయటికి లాగుతాను. జయశీలుడు కంటబడిన తరవాత, యీ గుంపునంతా చెట్లకు కట్టి, మహాకాలుడికి బలి యిస్తాను," అంటూ సిద్ధసాధకుడు, నరవానరాన్ని గట్టిగా అదిలించాడు.

నరవానరం వేగంగా పరిగెత్తుతూ వచ్చి, రథం తోలేవాడున్న చెట్టు కింద ఆగింది. మంగళవర్మ సాధకుడి ముందుకు పోయి, "సాధకా, నువ్వు చెట్లకొమ్మల్లో చిక్కుకుపోయిన మా వాళ్ళని కిందకు దించాలి. అదెలా సాధ్యం అందావు?" అన్నాడు.

సిద్ధసాధకుడు, "జై, మహాకాళా!" అంటూ కేకపెట్టి, "అంతా నాకు అయోమయంగా వున్నది. మాయాసరోవరేశ్వరుడనేవాడు, కనకాక్షరాజుగారి పిల్లల్ని అపహరించుకుపోవటమేగాక, ఇప్పుడు నా మిత్రుడైన జయశీలుణ్ణి కూడా పట్టుకుపోయాడు. ఆ దుర్మార్గుణ్ణి ఎరిగిన మీరేమో, వాళ్ళ మిత్రులన్నట్టు మాట్లాడుతున్నారు," అన్నాడు.

దేవశర్మ, అతణ్ణి శాంతపరుస్తూ, "సాధకా, ఇప్పుడు మనకూ, ఆ మాయాసరోవరేశ్వరుడికీ—అందరికీ ప్రమాదకరమైన శత్రువులు, సరోవరంలోని మరొక





# మాయాసరోవరం

## 30

[ మాయాసరోవరం కేసి పోతున్న కుంతి మంగళవర్మలకు, చెట్టుకొమ్మల్లో చిక్కుకుపోయిన రథం తోలేవాడు కనిపించాడు. వాడి ఆర్తనాదాలు విని సిద్ధసాధకుడూ, రాజు కనకాక్షుడూ అక్కడికి వచ్చారు. ఆ సమయంలో జలవృకుల్ని ఉసికొల్పుతూ, ఖడ్గమృగం మీద ఎక్కి వున్న వాడొకడు రావటంతో, చెట్టు మీదినుంచి నరవానరం వాడి మీదికి దూకింది. తరవాత—]

జలవృకులు తమ నాయకుడికి రానున్న ప్రమాదాన్ని చూస్తూనే, గుంపుగా వచ్చి, తమ గదలతో నరవానరాన్ని ఎడాపెడా కొట్టసాగారు. సిద్ధసాధకుడు శూలం పైకెత్తి, "జై, మహాకాళీ!" అంటూ ముందుకురికి, జలవృకుల్ని అందిన చోట అందినట్టు పొడవసాగాడు.

ఈ విధంగా భయంకరమైన పోరాటం రెండు, మూడు నిమిషాలకాలం జరిగేంతలో నరవానరం వాటి గదల దెబ్బలు బలంగా తగలటంతో సొమ్మసిల్లి ఖడ్గమృగం మీది నుంచి నేలకి పడిపోయింది. ఆ వెంటనే జలవృకుల నాయకుడు తన వాహనాన్ని చుట్టుముట్టిన సైనికుల నుంచి ముందుకు దూకించి, గదను పైకెత్తి "ఒరే, మానవాధములారా, నేనెవరనుకున్నారు? మాయాసరోవరానికి సర్వాధిపతినైన జలవృకనాథుణ్ణి! అప్పటి







పోయి, నాకు బందీలుగా దొరికిన వాళ్లలో పద్మముఖి అనే కన్యను మాత్రం వదిలి, తతిమ్మావాళ్ళ నందర్నీ, నా రాతిగదకు బలియివ్వబోతున్నాను." అన్నాడు.

నరవానరానికి యింకా బాగా స్పృహ రాలేదు. అది చేతుల్ని అటూ యిటూ తిప్పుతూ, గట్టిగా పళ్ళు కొరుకుతున్నది. దానికి స్పృహ తెప్పించటం తన భటుడైన జలవృకుడి కొక్కడికే సాధ్యం అనుకుంటూ సిద్ధసాధకుడు తల తిప్పి, "ఒరే, వృకభటా, ఎక్కడ? నువ్వూ, నీ పాత నేస్తగాళ్లతో పారిపోలేదు గద!" అన్నాడు.

ఆ వెంటనే జలవృకుడు ముందుకు వచ్చి, సిద్ధసాధకుడికి సాగిలపడి లేచి, "దొరా, జలవృకరాక్షసుల స్వామిభక్తి మెండు. పుట్టు బానిసలు కూడా దిగదుడుపే! జలవృకుడు మాట తప్పుడు. ఏం సెలవు?" అన్నాడు.

"ఒరే, వృకభటా, నరవానరానికి తగిలిన రాతిగద దెబ్బలు ప్రాణాపాయం కలిగించేపనుకోడు. దాన్ని ఎత్తి, కాళ్ళ మీద నిలబెట్టు." అన్నాడు సిద్ధసాధకుడు.

"దొరా, యిలాంటి మృగానికు చావు భయం ఒక్కటే ఊపిరిపోయగలదు." అంటూ జలవృకభటుడు, నరవానరాన్ని సమీపించి, ఎడమచేత్తో దాని గొంతు గట్టిగా పట్టుకుని, రాతిగదను దాని తల మీద ఆనించి, "నరవానరా, నీ రాచ్చిప్పతల బద్దలవబోతున్నది!" అంటూ అరిచాడు.

ఆ మరుక్షణం నరవానరం విళ్ళుం గొదులా ఎగిరి గంతేసి నిలబడి, భయంకరంగా అరుస్తూ, జలవృకభటుణ్ణి రెండు చేతులతో పట్టుకుని ఎత్తి, విసిరివేసింది. వాడు నేలమీద పడేలోపలే కొందరు సైనికులు వాణ్ణి పట్టుకున్నారు.

నరవానరం మరొకసారి జలవృక భటుడి మీదికి పోబోయేంతలో, సిద్ధ సాధకుడు శూలం అడ్డంపెట్టి ఆపి, "ఇక శాంతించు, నరవానరా! మీ యిద్దరూ నా సేవకులే; పోట్లాడకండి." అని, జల రాక్షసుల నాయకుడు ఖడ్గమృగం మీద

పారిపోయిన వైపుకు చూసి, "ఇంక ఆ దుర్మార్గుణ్ణి పట్టటం ఎలా? వాడు మాయాసరోవరం చేరినట్టైనా? అదెంత దూరంలో వున్నది?" అన్నాడు.

వైద్యదేవుడని పిలవబడే దేవశర్మ అతణ్ణి సమీపించి, "సాధకా, ఆ మాయా సరోవరం యిక్కడికి మరెంతో దూరాన లేదు. అందరూ నా వెంట కదలండి," అన్నాడు.

సిద్ధసాధకుడు అంగీకార సూచకంగా తల ఊపాడు. దేవశర్మ ముందుండి దారితీయగా అందరూ కదిలారు. రాజు కనకాక్షుడు అతడి పక్కనే నడుస్తూ, "శర్మా, ఆ జలరాక్షసుడు పద్మముఖి అనే కన్యనొక్కదాన్ని మాత్రం ప్రాణాలతో వదులుతానంటున్నాడు. అందుక్కారణం ఏమిటో నాకర్థం కాలేదు," అన్నాడు.

"మహారాజా, మనం విన్నదాన్నిబట్టీ, చూస్తున్నదాన్నిబట్టీ మాయాసరోవరం పూర్తిగా జలరాక్షసుల స్వాధీనమైపోయినట్టు తెలుస్తున్నది. పద్మముఖి మాయా సరోవరేశ్వరుడి కుమార్తె. ఆ జలరాక్షసుల నాయకుడు ఆమెను చంపకపోవటంలో మరేం విశేషం లేదు; వాడికొక కొడుకున్నాడు- అదీ సంగతి!" అన్నాడు దేవశర్మ.

"నా కుమార్తె కాంచనమాలను కూడా మరొక జలరాక్షసుడు వివాహమాడ ప్రయ



త్నించవచ్చు!" అంటూ రాజు కనకాక్షుడు ఉద్రేకపడిపోయాడు.

"మహారాజా, మీరు అనవసర భయానికి లోనుకాకండి. ఆ మాయాసరోవరం కేసి మహాసత్వులైన జయశీలుడూ, సరోవరేశ్వరుడూ ఎప్పుడో వెళ్లారు." అన్నాడు దేవశర్మ.

దేవశర్మ, రాజు కనకాక్షుడికి యిలా ధైర్యం చెపుతున్న సమయంలోనే జయశీలుడు మిగతావాళ్ళతో కలిసి మాయా సరోవరాన్ని చేరాడు. ఆ సరోవరం అతి విశాలమైనది. దానిచుట్టూ ఎత్తయిన కొండలూ, నీటి అంచువరకూ పరుచుకుపోయిన మహారణ్యం వున్నది.







సాయంతో నువ్వు జలవృకరాక్షసులను ఊచకోత కోసి, వాళ్ళకు బందీలుగా వున్న నా అన్న కాంచనవర్మనూ, మాయా సరోవరేశ్వర మహారాజుగారి కుమార్తె పద్మముఖినీ రక్షించాలి," అన్నది.

"నేను ఒంటరిగా అంతమంది జలవృకరాక్షసులతో యుద్ధం చేయటమా? ప్రయత్నిస్తాను. మీ నాన్న కనకాక్షరాజు గారికి వాగ్దానం చేసిన విధంగా నిన్నూ, నీ అన్ననూ జలరాక్షసుల నుంచి కాపాడ వలసిన భారం మాత్రం నా మీద వున్నది," అన్నాడు జయశీలుడు.

జయశీలుడు ఇలా అనగానే మాయా సరోవరేశ్వరుడు ముందుకువచ్చి, అతడి రెండు చేతులూ పట్టుకుని, "జయశీలా, నేను హిరణ్యపుర రాజుగారి పిల్లల్ని అపహరించి, ఈ సరోవరానికి తెప్పించటంలో పెద్ద నేరం చేశానను కోను. మకరకేతుణ్ణి నేను పంపింది, రాజకుమారుడు కాంచనవర్మ నొక్కణ్ణి పట్టుకురమ్మని మాత్రమే. అతడు బుద్ధిహీనుడవటం వల్ల, అతడితోపాటు సమయానికి కంటబడిన కాంచనమాలను కూడా పట్టుకుని ఇక్కడికి పంపాడు. ఆ సమయంలో రాజభటులవల్ల గాయపడి మకరకేతు మీకు కనిపించి, ఇంత గొడవకు కారణం అయాడు," అన్నాడు.

జయశీలుడు సరోవరం నీటిని కత్తితో కలుపుతూ, "ఇదన్నమాట, నువ్వు నివసించే మాయాసరోవరం! కాంచనమాల కోరగా, నా మెడకు బిగించిన ఉచ్చును తొలగించావు; బాగానే వున్నది! ఇప్పుడు మనం మిత్రులమా లేక శత్రువులమా?" అని అడిగాడు.

మాయాసరోవరేశ్వరుడు దిగులుగా ముఖం పెట్టి, కాంచనమాల కేసి చూశాడు. కాంచనమాల తడబడే గొంతుతో, "జయశీలా, ఇక్కడ శత్రువులంటూ ఎవరూ లేరు. మకరకేతు చెప్పగా విన్నాను. నీ చేతగల కత్తిని, మహాగాయుడు ఆవే సించిన వాడెవడో ప్రసాదించాడని! దాని

"ఇంతకూ యువరాజును అపహరించుకు రావటంలో నీ ఉద్దేశం ఏమిటి?" అని అడిగాడు జయశీలుడు.

"ఇందులో పెద్ద రహస్యం ఏమీ లేదు. నా ఒక్కగానొక్క కుమార్తె పద్మముఖిని అతడికిచ్చి వివాహం చేసి, హిరణ్యపురానికి పంపి, నేను సరోవరాన్ని వదిలి మరెక్కడికైనా పోదామనుకున్నాను. కాని పద్మముఖి, కాంచనవర్మను వివాహమాడనన్నది." అన్నాడు సరోవరేశ్వరుడు.

జయశీలుడికి అతడి మాటలు నమ్మదగినవిలాగే కనిపించినై. అతడు కాంచనమాల కేసి చూశాడు. కాంచనమాల నీటి అంచుకుపోయి, ఒక తామర కాడను తుంచి తెచ్చి, దాన్ని మెలిపెట్టగా వచ్చిన రసాన్ని, జయశీలుడి నుదుటి మీద బొట్టుగా పెట్టి, "మామయ్య చెప్పినదంతా నిజం. ఇప్పుడు మాయాసరోవర రహస్యం కూడా చెప్పేస్తున్నాను. ఈ సరోవరంలో పుట్టి పెరిగిన తామర కాడ నుంచి వచ్చిన రసాన్ని ఎవరైనా ఫాలభాగానికి రాసుకుంటే, ఇక వాళ్ళకు నీటిలో నివసించే శక్తి, బతికున్నాళ్లూ వుంటుంది," అన్నది.

"అలాగా! అయితే, పరీక్షించి చూస్తాను!" అంటూ జయశీలుడు ఎగిరి సరోవరం నీటిలోకి దూకాడు.



ఒడ్డున వున్న మాయాసరోవరేశ్వరుడూ, కాంచనమాలా, మకరకేతూ ఒకటి రెండు నిమిషాలు జయశీలుడు నీటిపైకి తేలగలడని చూశారు. కాని, నాలుగైదు నిమిషాలు గడిచినా అతడు నీటిపైకి రాకపోయేసరికి ముందుగా కాంచనమాల అదుర్దాపడుతూ, "జయశీలుడికేమైంది? జలవృక్ష రాక్షసులు నీటి అడుగున పొంచి వుండి, అతణ్ణి పట్టుకోలేదు గద!" అన్నది.

ఆ మరుక్షణం నీటిలో పెద్ద కల్లోలమైంది. జయశీలుడు, ఒక యువ జలవృక్షాన్ని మెడపట్టుకుని పైకి తేలి, వాణ్ణి బరబరా ఒడ్డుకు ఈడ్చుకు వచ్చాడు.



వాణ్ణి చూస్తూనే మకరకేతు, "హాం, మనకు దొరకవలసిన వాడే దొరికాడు! వీడు జలవృకుల నాయకుడి కొడుకు. బందీలుగా చిక్కిన మనవాళ్ళకు వీడి తండ్రి ఏమైనా హాని కలిగిస్తే, వీణ్ణి చిత్రవధ చేద్దాం," అన్నాడు.

"ఒరే, నువ్వు నీటి అడుగున పొంచి వుండి, మా సంభాషణ అంతా వింటున్నావా? నీ తండ్రి—ఆ దుర్మార్గుడు జలవృకనాయకుడెక్కడ?" అని అడిగాడు మాయాసరోవరేశ్వరుడు కత్తిపైకెత్తి.

"మా నాన్న అరణ్యంలో వున్న ఎవరో రాజునూ, కాపాలికుణ్ణీ హతమార్చడానికి వెళ్ళాడు. తిరిగివచ్చి మిమ్మల్నందర్నీ సరికి కాకులకూ, గద్దలకూ, మొసళ్లకూ ఆహారంగా వేస్తాడు," అన్నాడు యువరాక్షసుడు.

"ఆ సంగతి తరవాత చూద్దాం. కాంచనవర్మా, పద్మముఖీ ఎక్కడున్నారు?" అని అడిగాడు జయశీలుడు.

"వాళ్ళను దాచిన రహస్యప్రదేశం మా నాన్న ఒక్కడికే తెలుసు," అన్నాడు యువరాక్షసుడు.

అంతలో దూరంగా కలకలం లేచింది. ముందు ఖడ్గమృగం మీద జలవృకుల నాయకుడూ, వెనకగా ఒక గుంపు జలవృకులూ రాతిగదలెత్తి, అక్కడికి వస్తూ, "లొంగిపొండి!" అంటూ అరిచారు.

ఆ వెంటనే జయశీలుడు, మకరకేతుతో, "కేతూ, ఈ జలరాక్షసుడి కొడుకును నీ జలగ్రహం తొండంతో పట్టి, పైకి ఎత్తేలా చేయి," అన్నాడు.

మకరకేతు, "జలగ్రహా!" అని హెచ్చరించగానే, అది యువరాక్షసుణ్ణి తొండంతో పట్టి పైకి ఎత్తింది.

జయశీలుడు తమను సమీపిస్తున్న జలవృకులతో, "ఒరే, దుర్మార్గులారా! మా మీద దాడి చేయాలని చూశారో, ముందుగా మీ నాయకుడి కొడుకు జలగ్రహం కాళ్ళకింద నలిగిపోతాడు," అని గట్టిగా కేకపెట్టాడు.





అంతలో వాళ్ల వెనకనుంచి నరవానరం మీద ఎక్కి వేగంగా వస్తున్న సిద్ధసాధకుడు, "మహారాజా, మీ సైనికులతో యీ దుర్మార్గుల్ని చుట్టుముట్టండి. అడుగో, జయశీలుడు!" అంటూ అతడి దగ్గిరకు వచ్చి నరవానరాన్ని దిగాడు.

జయశీలుడు, సిద్ధసాధకుడికి తన వెంట వున్న వాళ్ళను పరిచయం చేస్తున్నంతలో, జలవృక రాక్షసుల నాయకుడు ఖడ్గమృగం మీద లేచి నిలబడి, రాతి గదను దూరంగా విసిరివేస్తూ, "నేనూ, నా అనుచరులం లొంగిపోయాం. బందీగా చిక్కిన నా కొడుకును చంపకండి. నేను పట్టుకున్న మీ వాళ్ళనందర్నీ యిప్పుడే యిక్కడికి తెప్పిస్తాను." అన్నాడు.

అంతలో జయశీలుడి దగ్గిరకు రాజా కనకాక్షుడు కూడా వచ్చాడు. కాంచనమాల పోయి తండ్రిని కావిలించుకుని, "నాన్నా, మామ మాయాసరోవరేశ్వరుడికి ఎలాంటి హానీ కలిగించకు. జరిగిన దానికి పశ్చాత్తాపపడుతున్నాడు," అన్నది.

"ఆయన కుమార్తె పద్మముఖి, మీ కోడలు కావటం కొద్దిలో తప్పిపోయింది." అంటూ జయశీలుడు నవ్వాడు.

"పద్మముఖి మనసు నాకు తెలుసు: ఆమె దేవశర్మను వివాహం ఆడాలనుకుంటున్నది." అన్నది కాంచనమాల.



దేవశర్మ, జలవృక రాక్షసుల నాయకుణ్ణి పెడరెక్కలు విరిచి కట్టించి, నలుగురు సైనికులు వెంటరాగా జయశీలుడి దగ్గిరకు వచ్చి, "జయశీలా, యీ దుర్మార్గుడు బంధితులై వున్న పద్మముఖి, కాంచనపద్మలను తెచ్చేందుకు తన అనుచరులను పంపాడు. ఇందులో మోసం వుండదనుకుంటాను," అన్నాడు.

"ఏదైనా మోసం జరిగితే వీడూ, తన కొడుకులాగే జలగ్రహానికి బలైపోతాడు," అన్నాడు జయశీలుడు.

పావుగంట కాలం గడిచే లోపలే నలుగురు జలవృక రాక్షసులు కాంచనపద్మనూ, పద్మముఖినీ అక్కడికి తీసుకు

వచ్చారు. మాయాసరోవరేశ్వరుడూ, రాజు కనకాక్షుడూ పొందిన ఆనందం అంతా యింతా కాదు.

సిద్ధసాధకుడు, "జై, మహాకాళీ!" అంటూ కేకపెట్టి, "నేను విన్నదాన్ని బట్టి, పద్మముఖికి దేవశర్మతో వివాహం నిశ్చయమైనట్టు. శుభం! మరి రాజకుమారి కాంచనమాల సంగతేమిటి?" అన్నాడు.

రాజు కనకాక్షుడు, జయశీలుడి కేసి తల తిప్పి, "అపహరింపబడ్డ నా పిల్లల్ని తెచ్చిన వీరుడికి అర్ధరాజ్యం యిస్తానని ప్రకటించాను. జయశీలుడు ఆ కార్యం సాధించటమే గాక, మహావీరుడని కూడా అనిపించుకున్నాడు," అన్నాడు.

"కాంచనమాలకు అలాంటి మహావీరుడే తగిన 'భర్త'! అవునా, కాంచనా?" అన్నాడు సిద్ధసాధకుడు.

కాంచనమాల సిగ్గుపడుతూ, తల వంచుకుని పోయి తండ్రి చాటున నిలబడింది. సిద్ధసాధకుడు పెద్దగా నవ్వి, "జయశీలుడికీ, కాంచనమాలకూ; పద్మముఖికీ, దేవశర్మకూ హిరణ్యపురంలో మహా వైభవంగా వివాహాలు జరగవలసి వున్నది! ఇక మీరంతా బయలుదేరండి," అన్నాడు.

"సాధకా, మరి నీ సంగతేమిటి?" అని అడిగాడు జయశీలుడు.

"నేని మాయాసరోవరం ఒడ్డున మహాకాళుణ్ణి మరికొంతకాలం ఉపాసిస్తాను. ఇక్కడ వున్న జలవృకరాక్షసులూ, అరణ్యంలోని నరభక్షకులూ నా బంట్లు!" అంటూ సిద్ధసాధకుడు శూలం ఎత్తి పట్టుకున్నాడు.

జయశీలుడూ, రాజు కనకాక్షుడూ, మాయాసరోవరేశ్వరుడూ తమ తమ పిల్లలతో, అనుచరులతో అక్కణ్ణించి బయలుదేరారు. వాళ్ళు కొద్ది దూరం పోగానే జలవృకరాక్షసులూ, చెట్లచాటు నుంచి బిలబిలమంటూ వచ్చిన నరభక్షకులూ, సిద్ధసాధకుడి చుట్టూ చేరి, అతడికి జేజేలుకొడుతూ, నాట్యాలు చేయసాగారు. —(అయిపోయింది)

